# అన్నదాత

## పాఠకులకిస్తున్న 'బోనస్'



లోగడ "కుందేళ్ళు", "నూనెగింజలు" మీద విడుదలయిన బోనస్ బుక్స్‌కి లభించిన ఆదరణతో, కేవలం 6నెలలలో సుమారు మూడురెట్లు పెరిగిన అమ్మకాలు ఇస్తున్న ఉత్సాహంతో, పెరుగుతున్న చందాదారులు, ఏజంట్లు ఇస్తున్న ప్రోత్సాహంతో, 'అన్నదాత' మార్చి '88 సంచికతో మరింత ఉపయోగకరమైన బోనస్‌బుక్‌ని 'గొర్రెలు & మేకలు' మీద రూపొందించింది.

మీ కాపీకై వెంటనే మీ స్థానిక అన్నదాత/ఈనాడు ఏజంట్‌ని కలవండి. లేదా రూ. 30/- D.D/M.O ద్వారా 'అన్నదాత, ఈనాడు కాంపౌండ్, సోమాజిగుడా, హైదరాబాద్- 500 482'కు పంపి సంవత్సర చందా దారులుగా చేరండి.

# విశాఖపట్టణంలో ఇండ్ల స్థలములు

## S.V.L. NAGAR-2

విశాఖపట్టణంలో **SVL Nagar-I**ను చేర్చి **SVL Nagar-II Booking** జరుగుచున్నది. త్వరపడండి.

విశాఖపట్టణంలో **SVL Nagar**లో మీరు ప్లాటు పొందినయెడల మీకు కలిగే సౌకర్యములు:

(1) ఇది ఉడా (**VUDA**) వారిచే అప్రూవల్ (**No.BPLP 26/87**) పొందిన అతి పెద్దది అయిన **Layout.**

(2) **Borewells** వేయించి **Overhead tank**కట్టించి నీటి సౌకర్యము మరియు కచ్చా రోడ్లు, కచ్చా డ్రయినేజి సౌకర్యము కల్పించబడును.

(3) సభ్యుల సహకారంతో **Electrical Line** వేయించబడును.

(4) విశాఖపట్టణంలో **SVL Nagar** అతి పెద్దది అయిన **Residential Colony** అగుటవలన మరియు **Steel Plant**కు చేరువలో ఉండుటవలన శీఘ్రముగా అభివృద్ధి చెందుటకు ఎక్కువ అవకాశము కలదు.

(5) **City bus** సౌకర్యము మరియు ఎత్తయిన ప్రదేశములో కలిగి ఉండి వరద ముంపునకు గురికావి స్థలము.

(6) అన్నింటికన్నా ముఖ్యమయినది – మధ్యతరగతివాసులకు, ఉద్యోగస్తులకు అనువుగా 50 సులభ వాయిదా పద్ధతులలో స్థలము లభించును.

(7) ప్రతినెలా జరుగు డ్రాలో పాల్గొని ప్లాటు గెలుపొందు అవకాశం కలదు.

(8) ప్లాటు **Registration** సమయమునందు

 (1) ఉడా (**VUDA**) అప్రూవల్ **Copy**

 (2) **Original title deed Photostat copy**

 (3) **Encumbrance Certificate (12 Years)** ఇవ్వబడును.

(9) ఇప్పుడు మీ బిడ్డకు ఒక స్థలము కొనండి, దాని విలువ మీబిడ్డతో పెరుగుతుంది.

అందుచే రండి, త్వరపడండి, అవకాశం జారవిడువకండి

కొద్ది పాట్లు మాత్రమే కలవు

వివరములకు సంప్రదించండి:

**Managing Director**
**K.S.N. Choudhary**
**SVL Real Estates & Construction (P) Ltd.**
**45–A, Pandurangapuram**
**VISAKHAPATNAM–3, Phone: 60269**






ALFA VISION/V/SVL/88F

ప్రచురించే ప్రతి నవలకు రూ. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.

# రచయితలకు సూచనలు

- "చతుర"లో నవలకు వేసే చిత్రాలు, చిట్టి కథలు, చిన్న ప్రకటనలు వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతప్రతిలో వారి వారి దస్తూరినిబట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.
- ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా వ్రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.
- నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.
- ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటు తగుపోస్టేజీ జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.
- సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.
- పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482.

# చతుర సమీక్షలు

'చతుర' నవలల పోటీలో ప్రత్యేక నవలగా ఎన్నికై జనవరి సంచికలో ప్రచురితమైన యమ్.విశ్వనాథ్‌గారి 'రక్తం కార్చిన కాటుక కళ్ళు'పై మాకు అందిన 'చతుర' సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.



## అన్యాయం

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

అత్తగారింట్లో ఆడపిల్లల అగచాట్లని వర్ణించే నవలల్లో మరో నవల ఈ 'రక్తంకార్చిన కాటుక కళ్ళు'. "సమాజంలో స్త్రీజాతి ముందడుగు వెయ్యాలి. మార్పుకోసం పోరాటం జరపాలి" అని పాత్రలచేత చెప్పించి తొందర తొందరగా నవలని ముగించేశారు రచయిత.

ఆడపిల్ల ఏ వర్గానికి చెందినా, ఎంత కట్నం తీసుకెళ్లినా పడే బాధల్లో తేడా లేదంటుందీ నవల. కానీ వాస్తవంలో వరకట్న పిశాచానికి బలియై బాధలనుభవించేవాళ్లు ఎక్కువగా మధ్యతరగతి నుంచి దిగువవాళ్లే. భూస్వామ్య వర్గానికీ, వ్యాపారవర్గానికీ చెందినవాళ్లు అనుభవించే బాధలు వేరుగా వుంటాయి. అసలు వరకట్నాలరేటు ఇంతగా పెరగటానికి కారణం వీళ్లే. ఇందులో కోడళ్లు కోరినంత కట్నంతోనే వస్తారు. అత్తామామలు చెప్పినట్లు చేస్తూనే ఉంటారు. అయినా బలయిపోతారు. కోడళ్లని హత్యచేసేవాళ్లూ, ఆత్మహత్య చేసుకునే పరిస్థితులు సృష్టించేవాళ్లూ వున్నారు. కానీ, ఈనవల్లో పావనిని చంపటానికిగానీ, జ్యోతి ఆత్మహత్య చేసుకోటానికిగానీ బలమైన ఎలిమెంట్ కనబడటంలేదు.

పావని చదువుకొన్నది. వారంనుంచి జ్వరం వస్తుంటే డాక్టరుకు చూపించుకోదా? పోనీ టాబ్లెట్ తెప్పించి వేసుకోదా? కోమాలోకి వెళ్ళే దాకా పరిస్థితుల్ని తెచ్చుకుంటుందా? అయినా కోమాలోకెళ్లిపోయి, సహజంగా చనిపోయే స్థితిలో వున్న పావనిని తగలెట్టి చంపాల్సిన అవసరం ఏమిటి? అలాగే రైతుకుటుంబంలో పుట్టి అమాయకురాలిలా కనబడే కమల భర్తతో తెగతెంపులు చేసుకొని పారిపోగా, ఉన్నతకుటుంబంలో, ఎమ్.ఎల్.ఎ. కూతురుగా పుట్టి, బాగా చదువుకొన్న ఆలోచించగల జ్యోతి ఆత్మహత్య ఎందుకు చేసుకొంటుంది?

శ్రీకాంత్ మహా బలవంతుడు. ఎమ్.ఎ. ఫస్ట్ క్లాస్. నిరుద్యోగం ఎందుకున్నదో తెలియదు పాపం. భార్యమీద బోలెడు ప్రేమ. సోమరిగా వుంటూ ఆమెకు ఒక్కపనిలో సాయంచేయడు. తల్లిదండ్రుల్ని ఎదిరించడు. దూరానవుంటూ భార్యకు ఒక్కవుత్తరం రాయడు. ఇహపోతే భర్త చచ్చిపోయిన సరోజని, ఆమెని వెలుగులోకి తేవటానికి కృషిచేసిన బ్రహ్మచారి సతీష్‌కి కలవటానికి రచయితకు ధైర్యంచాలక, ఎక్కడివాడో శ్రీధర్‌ని పరిచయం చేసి, భార్య చనిపోయిన అతనికి కలిపి సంతృప్తిపడ్డారు.

రచయిత తన ఆదర్శభావాల్ని వాసుదేవ రావుగారు, ప్రహ్లాద ద్వారా చెప్పించారు. కాని, వాసుదేవరావు ఆడపిల్లల్ని కన్ఫ్యూజన్‌లో పె




ట్టిస్తాడు. కర్ర విరగకూడదూ, పాము చావకూడదూ– సిద్ధాంతం ఆయనది. ఎవరికీ, ఆఖరుకు తన కూతురికి కూడా ఆయన చేసేదేమీ కనబడదు. అలాగే ప్రహ్లాదకూడా. ఈ నవలకి ముఖ్యమైన మనిషి ఇతను. స్త్రీస్వేచ్ఛ రావాలంటే, పాలకవర్గంలో స్త్రీల నిష్పత్తి పెరగాలని ఈతని సిద్ధాంతం. ఒక మహిళ దశాబ్దంపైగా ప్రధానమంత్రిగా వుండి స్త్రీలకు ఏం చేసిందీ మనకు తెలుసు. అనేకమంది మహిళలు మంత్రిపదవుల్లో, అధికారవర్గాల్లో వుంటూ ఏం ఒరగబెడుతున్నదీ తెలియంది కాదు. పాలకపక్షంలో ఎవరున్నారన్నది ముఖ్యంకాదు.- వాళ్ళు ఏవర్గప్రయోజనాల్ని ఆశించే మనుషులన్నది ముఖ్యం. స్త్రీలకోసం పోరాడినవాళ్ళు, చరిత్ర తిరగేస్తే స్త్రీలకన్నా పురుషులే ఎక్కువశాతం వున్నారనేది తెలుస్తుంది.

ప్రహ్లాద్ నిరుద్యోగం, విద్యావిధానం గురించి మాట్లాడుతూ- ఏదో మార్పురావాలి. దానికోసం పోరాటం జరపాలి అంటాడు. అయితే అతను చెప్పే మార్పుకు రూపంలేదు. పోరాటాలకు రంగు, రుచీ, వాసనా లేవు. అవి ఎలాంటివో అతనికీ, అతన్ని సృష్టించిన రచయితకూ కూడా తెలిసినట్లు లేవు.

రచయితకు ఏదో చెప్పాలనే తపనవుంది కానీ నిర్దిష్టమైన సిద్ధాంతమార్గం లేదు. మార్పు కావాలన్న ఆవేదన ఉంది కానీ, దానికి స్పష్టమైన ఆకారంలేదు. అయితే తను రాసిందాన్ని పాఠకునిచే చదివింపగల నేర్పుంది. మెరుగుపరచుకోవాల్సిన అవసరం వుంది.

–బి. వల్లీకుమారి,
తెనాలి.

## కథల కూర్పు

**(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)**

నలుగురు పెళ్ళయిన ఆడపిల్లల కొత్త కాపురాలతో ప్రారంభించి అందులో ఇద్దరికి కట్నకానుకలు సరిగా తేలేదనే నెపంతో అత్తమామల ఆరళ్ళకు బలిచేసి ఒకరిని విధవను చేసి, తర్వాత పునర్వివాహానికి పురికొల్పి, మరొకరి ముగింపును పాఠకుల ఊహకు వదిలిన శ్రీయం. విశ్వనాథ్‌గారి 'రక్తంకార్చిన కాటుకకళ్ళు' నవల విలక్షణంగా ఉంది. పై నలుగురు స్నేహితులపటం తప్ప నవలలో ఏకసూత్రత లేదు. మరొకవిధంగా చెప్పాలంటే ఇది నాలుగు కథల సంకలనం.

పావని, శ్రీకాంత్‌ల కుటుంబం మధ్యతరగతి కోవకు చెందింది. కమల, రమేష్‌ల కుటుంబం నడమంత్రపుసిరితో మిడిసిపడేది. జ్యోతి, మోహన్‌ల కుటుంబం పైతరగతిది. ఈ మూడు విభిన్న స్థాయిల్లో ఉన్న శ్రీకాంత్, రమేష్, మోహన్‌లు ముగ్గురూ తల్లిదండ్రులకు భయపడేవారే. స్వయం సంపాదనలేక నిత్యావసరాలకు తల్లిదండ్రులమీద ఆధారపడినవారే కావడం విచిత్రం. ఒకరు ఎం.ఎ. చదువుకొన్న నిరుద్యోగి, మరొకరు సీదా వ్యవసాయదారుడు, ఇంకొకరు విలాసపురుషుడు. వీళ్ళ ముగ్గురి వ్యక్తిత్వాలలో వైవిధ్యాన్ని చూపగలిగినా వీరి భార్యల జీవితాలు మూసలో పోసినరీతిగా సుఖసంతోషాలకు దూరమై అత్తమామల ఆరళ్ళతో దుర్భరంగా సాగడంతో నవలలో వస్తువైవిధ్యం కొరవడింది. ఇక నాల్గవజంట సరోజ, సురేష్‌ల కథ పైకథలకన్నా భిన్నంగా, ప్రత్యేకంగా ఉంది. సంప్రదాయపు కట్టుబాట్లలో పెరిగిన సరోజ చదువుకొంటూ చెడుతిరుగుళ్ళు తిరిగే సురేష్‌తో తొలిసారి కలయికతోనే వైధవ్యాన్ని పొందడం, తర్వాత ఆమె జీవితం శ్రీధర్‌తో ముడిపడినట్లు చిత్రించడంతో ఈ కథ మిగిలినవాటికన్నా విలక్షణంగా ఉంది. ఈ నాల్గవ కథలో మాత్రమే సమస్యకు సక్రమ పరిష్కారం చూపబడింది. ఈ సరోజ కథే ఈ నవలలో హైలైట్.

ఈ నలుగురు కథానాయికలకు జీవితపు విలువలను, వ్యక్తిత్వ వివేకాన్ని ప్రబోధించిన వాసుదేవరావుగారి మాటలు, శ్రీకాంత్ తన మిత్రులతో చేసిన చర్చలు, శ్రీధర్ సరోజ ఆలోచనాసరళిని మార్చినతీరు రచయిత ప్రతిభకు, జీవితాన్ని గూర్చిన అవగాహనకు, విశ్లేషణకు అద్దంపడతాయి. కథలలోలేని బిగువును కథనం కొంతవరకే పట్టుకోగలిగింది. మధ్యతరగతి పావని కుటుంబంలోని అత్తగారు, వ్యవసాయ కుటుంబంలో ఉన్న కమల అత్తగారు తెల్లవారగానే కోడళ్ళను "మా ముఖాన టీనీళ్ళు కొట్టు" అంటూ గదమాయించడం వంటి పడికట్టు సన్నివేశాలు, ఆకాశంలో తెల్లగా కని



పించే చుక్కల్ని వాస్తవానికి, సంప్రదాయానికి భిన్నంగా "నల్లటి వస్త్రంపై రత్నాలు చల్లినట్లుగా ఆకాశం నిండా నక్షత్రాలు" వంటి వర్ణనలను రచయిత పరిహరించి ఉంటే బాగుండేది.

– సూర్యదేవర రవికుమార్,
భట్టిప్రోలు

## అభాగినుల అగచాట్లు

**(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)**

"రక్తం కార్చిన కాటుక కళ్ళు"లో నలుగురు ఆడపిల్లల జీవితాలను తీసుకొని వారివారి జీవితాల్లోని వైవిధ్యం, సమస్యలలోని విభిన్నత చూపించుటకు ప్రయత్నం చేశారు. కాని వాసు దేవరావుగారి పాత్రకు అన్యాయం చేశారు. తొలిదశలో ఎంతో అనుభవంతో పరిస్థితులనవగాహన చేసుకొనే శక్తిని పావని, జ్యోతి, కమల, సరోజలకిచ్చిన ఆయన వాళ్లకు నిజమైన అవసరం కలిగినపుడు, వాళ్ల సమస్యలలోకి తొంగి చూసి, వారికి సరియైన మార్గం చూపే నేర్పు, ఓర్పు చూపించలేకపోయారు. ఇది రచయిత అస్పష్టతకు నిదర్శనం. వివేకం, విజ్ఞానం, తెలివి, అణకువ అన్నీ ఉన్న ఈ అమ్మాయిలు కూడా అందరు ఆడపిల్లల్లాగే బలి అయిపోయారంటే రచయిత ఈనాటి సమాజంలో స్త్రీకి ఇచ్చే సందేశం ఏమిటి? "మీకు దిక్కులేదు. మీ కర్మ ఇంతే... చావండి" అనా?

రచన వాస్తవానికి దర్పణంపడ్తూ కర్తవ్యం నిర్దేశించాలి. పలాయనం పరిష్కారం కాదు. అమాయకంగా బలైన అమ్మాయిల జీవితాల ద్వారా రచయిత సాధించిన సామాజిక ప్రయోజనం ఏమిటి?

సరోజ సాంప్రదాయపు అడ్డుగోడలను ఛేదించి, జీవిత మాధుర్యం అనుభవించుట మాత్రం బాగుంది.

రమేశ్‌లాంటి వ్యక్తిత్వంలేని మగవాళ్ళు, శ్రీకాంత్‌లాంటి దూరాలోచనలేని యువకులు, మోహనలాంటి డబ్బు మదం, దానితో వచ్చే సుఖాలకు బానిసలైనవారు, నాగరత్నమ్మ, మీనాక్షమ్మ, రాజ్యలక్ష్మి, రామారావు, శేషగిరిరావు రాజేశ్వరరావులాంటి తల్లిదండ్రులున్నంత వరకు ఈ కథ ఇలాగే సాగుతుంది.

ఇలాంటి డబ్బు పిశాచి ఆవహించిన సమాజంలోని వ్యక్తులకు గుణపాఠం ఎవరు నేర్పాలి? బాధితులే నిజమైన పరిష్కర్తలు కూడా అయిననాడే దీనికి అంతం. ఈ మారణ హోమాన్ని ఆపాలంటే స్త్రీలు తమ శక్తిసామర్థ్యాలు నిరూపించుకోవాలి. పెళ్ళే జీవితానికి సర్వస్వం అని గాక అది జీవితంలో ఒక భాగం మాత్రమేనని చూసే శక్తి అలవడాలి. ఈ పరిష్కారం చూపటంలో కృతకృత్యులు కాలేకపోయారు. రచయిత ఇది గ్రహించి ముందు ముందు మరిన్ని మంచి రచనలు చేయగలరని ఆశిద్దాం.

– శిలువేరు అనసూయ,
సరూర్‌నగర్.

## రక్తం కార్చని కళ్ళు

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

పరిష్కారం చూపకుండా, నాణెం తాలూక ఒకవైపునే చూసి, రాసిన నవలలా ఉంది వాసుదేవరావుగారి పాత్ర చాలా విశిష్టమైనది అయినా రచయిత సమాజంలోని మంచికంటె చెడునే ఎక్కువ పరిశీలన చేస్తాడు అని రచయిత మరోమారు రుజువుచేశారు. అత్తమామలు, భర్తలు ఆరళ్ళు పెట్టేవిధానం చర్చించారు గానీ మంచివారయిన అత్తమామలను వేధించే కోడళ్ళూ ఉన్నారు. ఇప్పుడున్న అత్తలు, "అవసానదశలో కొడుకులూ, కూతుళ్ళూ చూడరు, తిట్టినా, కోడలే చూడాలికదా!" అని ఆలోచిస్తున్నారు. ఇంకా మారని వారికి తెలియజెప్పే బాధ్యత ఇప్పటి రచయితలపై ఉంది. వరకట్నాలకి బాధ్యత అడిగేవారిదేకాదు ఇచ్చేవారిది కూడా! లక్షరూపాయలు ఇవ్వగల స్తోమతు ఉన్నవారు రెండు లక్షల సంబంధం దొరికితే తమ కూతురు సుఖపడుతుందని చూస్తున్నారే కాని, తమకంటె కిందిస్థాయివారికి ఇవ్వటానికి ముందుకు రావటంలేదు. ముందు మన ఆలోచనా విధానం మారాలి! మరణమే సమస్యలకు పరిష్కారంకాదు.




విద్యకి పరమార్థం ఉద్యోగం కాదు - మానవత్వం అన్నాడు రవీంద్రుడు.

– దొండపాటి నాగేశ్వరరావు
తూర్పుమాధవరం

## నిరంకుశత్వం

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

నవల పేరు వింటేనే అన్పిస్తుంది కోడళ్ళు ఎంత నరకం అనుభవిస్తారో అని. ఎందరో అమాయకపు ఆడపిల్లలు- భర్త, అత్తమామల అత్యాశల్ని తీర్చలేక పుట్టింటినుండి తగురక్షణ లేకా విధిలేని పరిస్థితుల్లో హత్య, ఆత్మహత్యలకు గురవటం జరుగుతూనే వుంది. సామాజిక స్పృహతో ఈ ఇతివృత్తం ఎన్నుకున్న రచయిత అభినందనీయుడే.

కానీ... అంతో ఇంతో చదివి పుట్టింటి అండదండలు, ఆర్థికస్వాతంత్ర్యం, స్వేచ్ఛ, విప్లవాత్మక ఆదర్శాలు వుండి దురాచారాలను అవసరమైన మేరకు మార్చాలనే ఆశయాలుగల జ్యోతి, పావని, కమల అలా అధ్వాన్నంగా బతకడం ఏమిటి? చివరలో జ్యోతి, పావని ఆత్మహత్య చేసుకోవడం; కమల పిచ్చిదైపోవడంతో ఆ పాత్రలకున్న అవకాశాలన్నీ రచయిత దౌర్జన్యంగా, నిరంకుశంగా లాక్కున్నారనిపించి పాఠకులకు రచయితమీద ఆగ్రహం రాదా!

గవర్నమెంట్ ఉద్యోగి అయ్యుండి వాసుదేవరావుగారు చట్టవిరుద్ధమైన కట్నం ఇవ్వడమే గాకుండా, అల్లుడి ఉద్యోగంకోసం అయిదువేలు లంచం కావాలంటే అప్పుతెచ్చి ఇవ్వటం, నరకయాతనలు పెడతారేమో అని తెలిసి కూడా సాంప్రదాయం అని మామగారి వెంట కోడలును వంపుతాడు. అలాంటప్పుడు అతని ఉపన్యాసాలన్నీ నవల పేజీలు పెంచడానికేనా అనిపిస్తుంది

న్యాయానికి వీరి ముగ్గురికంటే దయనీయమైన పరిస్థితిలో వుండవలసిన పాత్ర సరోజ. ఆమెను ఎప్పుడు ఏంచేస్తారో అర్థంగాని పరిస్థితి. అందమైంది, వయసులో వుంది. ఒక రోజు ఒకసారి భర్తతో అమరసుఖం అనుభవించింది. కోరికలలో కాగిపోతోంది. ఆ పాత్ర ఆలోచనలు, ప్రవర్తన రచయితకు అర్థమయ్యాయేమో కానీ పాఠకులకు పిచ్చివట్టించాయి. దాదాపు అరవై పాత్రలతో నిండిన నవలలో ఏ పాత్రకూ న్యాయం చేకూరలేదు.

ఈ నవల చదివితే ఆడపిల్లలకు పెళ్లి అంటే నరకానికి పోవడమే అన్న ఉద్దేశం కలుగుతుంది. పరిష్కారం ఒక్కపాత్ర కూడా వెతుక్కోదు. రచయితకు స్త్రీ ద్వేషం వుందేమో, అందుకే వారికోదారి చూపించడం ఇష్టంలేక అర్థాంతరంగా ముగించారని పిస్తుంది. ఇది రచయిత నిరంకుశధోరణే తప్ప వేరుకాదు.

–జె. జయప్రదాదేవి
నంద్యాల

## అపరిష్కృతం

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

"రక్తం కార్చిన కాటుక కళ్ళు"కు కావలసింది సానుభూతికాదు- సమస్యల్నెదుర్కోగలిగే మనోబలం. అది రచయిత తాను సృష్టించిన నలుగురు కథానాయికలకూ ఇవ్వడంలో కృతకృత్యులు కాలేకపోయారు.

జ్యోతి కొంత ధైర్యం చూపించినా, అది-కేవలం 'చావు తెలివిగా' తేలిపోయింది. సరోజ- సెంట్‌మెంటును వీడినా, తనంతటతాను జీవితంలోకి ఆహ్వానించిన అవివాహిత యువకుణ్నికాదని, ఓ విడోయర్‌కు భార్యకావడంలో ఎదుగుదలగాని మార్పుగాని, శూన్యం.

పావని తనని అంతగా ప్రేమించే చదువూ, వివేకమూ పుష్కలంగా వున్న భర్త ఉండికూడా బలయింది. అందరిలోకీ మరీ అధ్వాన్నంగా ముగిసింది కమల బతుకు.....

ఇంతకంటే మన రచయితలు సాహసించలేరా, మరికొంత ముందడుగు వేయలేరా...?

ఇలా అపరిష్కృతంగా వున్న కథల్ని సరిచేసి రాయమని రచయితలకు సూచనలిచ్చి, ప్రోత్సహించే రిస్క్ ఎడిటర్లు తీసుకోడం మంచిదని సూచించడానికి సాహసిస్తున్నందుకు మన్నించగలరు.

– నియాజ్ అలి,
హైదరాబాదు

# చతుర కతలు

## అతిజాగ్రత్త

బస్సులో జనం కిక్కిరిసి ఉన్నారు. నిలబడటానికి కాస్త చోటు దొరికితే చాలనుకున్న ప్రయాణీకులు సీట్లకోసం ఆశగా చూస్తున్నారు. అవకాశం కోసం చూస్తున్న జేబు దొంగలూ, అమ్మాయిల్ని తాకాలని ఆబగా చూస్తున్న రౌడీ వెధవలూ. ఉక్కగా ఉందని గునుస్తున్న షోకిల్లారాయుళ్లతో బస్సు కళకళలాడుతోంది. అందర్నీ శ్రద్ధగా పరిశీలిస్తూ నిలబడ్డ ఆనంద్, ఓ ముసలతను గబగబా అందర్నీ తోసుకుంటూ బస్సులోకి రావడం చూశాడు.

ఆ ముసలతను చూడబోతే పక్కా జోకర్‌లా ఉన్నాడు. ఎర్రటి పెద్దపెద్ద పూలున్న పసుపు రంగు చొక్కా, నీలంరంగు బెల్‌బాటమ్, నడుముకు పెద్దబెల్టు. పొట్టపైనుంచి జారుతున్న ప్యాంటును పైకి ఎగదోసుకుంటూ కండక్టర్ కోసం చుట్టూ చూశాడు. అతని పరిస్థితి చూస్తున్న ఆనంద్‌కి నవ్వాగలేదు.

కండక్టర్ అందరికీ టిక్కెట్లు కొట్టి వెళ్లాడు. ఎంతో నిజాయితీపరుడిలా చిల్లరడబ్బులు కండక్టర్‌కిచ్చి టిక్కెట్టు తీసుకున్నాడతను. పరీక్షగా చూస్తున్న ఆనంద్ అతను చేసిన పని చూసి షాక్ తిన్నాడు. కండక్టరిచ్చిన టిక్కెట్టును ఆ తిక్కశంకరయ్య వెంటనే మూడు ముక్కలుగా చింపాడు. ఆ ముక్కల్ని మూడు జేబుల్లో భద్రంగా దాచాడు. ఆశ్చర్యమనిపించి ఉండబట్టలేక ఆనంద్ తన అనుమానాన్ని అడిగేసాడు. "ఏవిటిసార్! టిక్కెట్లను అలా ముక్కలు చేసి దాచుకుంటున్నారూ?"

"చూడునాయనా... ఈమధ్య జేబుదొంగలు జేబుల్లో ఏమున్నా కాజేస్తున్నారు. కనీసం ఒక్క ముక్కయినా మిగులుతుందని అలా చేస్తూ ఉంటాను" అన్నాడు ఎంతో తెలివిగలవాడిలా పోజుపెడుతూ.

"మరి ఒకవేళ దొంగ అన్ని జేబుల్నీ చోరీ

చేస్తే ఏంచేస్తారు?" సందేహంగా అడిగాడు ఆనంద్.

" అయ్యో! నేనంత పిచ్చివాణ్ణనుకుంటు న్నావా? ఇదంతా తెలిసి ముందే జాగ్రత్తపడతాను. ఎమర్జన్సీలో ఉపయోగపడుతుందని ఇది ఎప్పుడూ నావెంటే ఉంచుకొని తిరుగుతాను. చూడం"టూ లోపల బనియన్ జేబులో భద్రంగా దాచుకున్న బస్‌పాస్ తీసి చూపించాడు గొప్పగా.

\- వీణ

## తెలివి

మాలతి తనకన్నా తెలివైంది అని పెళ్ళిచూపులనాడే రాజుకి అర్థమయింది.

మాలతితో రాజు పెళ్లయిపోయింది. హైదరాబాదులో ఇల్లు చూసుకొని మాలతిని కాపురానికి తీసుకొచ్చాడు రాజు. అతడు సనత్‌నగర్‌లో ఓ ప్రయివేట్ కంపెనీలో టెక్నీషియన్‌గా పని చేస్తున్నాడు.

మాలతి వస్తూ తెచ్చిన స్వీట్సు తన మిత్రులకి ఇస్తూ, పనిలోపనిగా బాసుక్కూడా కాసిన్ని సమర్పించుకున్నాడు.

స్వీట్సు తీసుకుంటూ సంతోషపడిన బాసు కుశలప్రశ్నలవీ అడిగి- "అయితే ఫామిలీ పెట్టావన్నమాట" అన్నాడు.

"అవున్సార్ !" అన్నాడు రాజు సగం సంతోషంగా ! సగం సిగ్గుగా.

"గూడ్ !" అని గుడ్‌ని సాగదీసి ఆశీర్వదించాడు బాస్.

ఆ సాయంత్రం రాజు కంపెనీనుంచి బైటపడి వెళ్తూవుండగా బానుగారి కారు అతన్ని దాటుకుంటూ వెళ్ళిపోయింది.

రాజుని సెక్యూరిటీ వాళ్ళు ఆపి- "మీరివ్వాళ డ్యూటీకి వస్తున్నారుగదా" అని అడిగారు.

"నాది డే షిఫ్టు"అది పూర్తిచేసుకునే వెళ్తున్నాను అన్నాడు రాజు.

"కాదుసార్... బానుగారు మీ షిఫ్టు మార్చా



రు. మీరివాళ్టినుంచి రాత్రి షిఫ్టులో పనిచేయాల్సుంటుంది'' అన్నారు సెక్యూరిటీ వాళ్ళు ఓ కాగితం అందిస్తూ.

ఓసారి షిఫ్టు మారితే ఆ వారమంతా అదే షిఫ్టు.

నీరసంగా ఇంటికొచ్చిన రాజు మొహం చూసి ఆందోళనపడింది భార్య మాలతి. వెంటనే- ''ఏమిటలావున్నారు?'' అంది.

రాజు చెప్పాడు... బాస్ మనస్తత్వం అంతా సవివరంగా వర్ణించాడు కూడా.

అంతా విని పకపకనవ్వింది మాలతి.

''ఏమిటా నవ్వు?'' అన్నాడు రాజు ఉక్రోషంగా.

నవ్వాపుకుంటూ చిత్రంగా కళ్ళు తిప్పుతూ- ''మీ బాస్ పెద్ద శాడిస్టులావున్నాడే'' అంది.

కాసేపాగి కాస్త ఆలోచనగా ''పోనీ ఈ వారం శలవు పెట్టరాదా ?'' అంది చిలిపిగా నవ్వుతూ.

''మా బాసు దుర్మార్గుడు. శలవు యివ్వడు'' అన్నాడు రాజు దిగులుగా.

చేసేదిలేక మర్నాడు నైట్‌షిఫ్ట్‌కు హాజరయ్యాడు రాజు.

రాత్రి పదవుతూండగా షిఫ్టు ఇన్‌ఛార్జి హడావుడిగా ప్లాంట్‌లోకొచ్చి ''రాజుగారూ... మీ ఆవిడకేం బాగులేదంట ! ఫోన్‌వచ్చింది. హాస్పిటల్‌కి తీసుకెళ్లాలంట. అర్జంటుగా రమ్మంటున్నారు. వెళ్లండి- క్విక్' అని హడావుడి పెట్టేశాడు.

హడలిపోతూ, ఆదరాబాదరా పరుగులేస్తూ ఇంటికి పరుగెత్తుకొచ్చిన రాజుకి సర్వాలంకార శోభితయై చిరునవ్వుతో గుమ్మంలోనే ఎదురైంది మాలతి. అర్థమయిపోయింది రాజుకు.

మాలతి తెలివికి అబ్బురపడ్డాడు రాజు మరోసారి.

ఆ వారమంతా అసలు డ్యూటీకే వెళ్లలేదు రాజు. కాని మాలతి అనారోగ్యం గురించీ, ఆవిడకిప్పిస్తున్న ట్రీట్‌మెంటు గురించీ ప్రతి రోజూ ఓసారి బాస్‌కి ఫోన్‌చెయ్యాల్సిరావటం మాత్రం ఇబ్బందిగా అనిపిస్తోంది రాజుకు.

-ఎ. కె. రావ్





## క్షమించండి

ఉదయం పదకొండే అయినా అప్పటికే సూర్యుడు తన తీక్ష కిరణాలను భూమిపైకి వేగంగా ప్రసరిస్తున్నాడు.

నీరసం ఎక్కువైంది మోహన్‌కు. దాదాపు గంటనుండీ కావల్సిన అడ్రసుకోసం వెదుకుతున్నాడు. అయినా ఫలితం లేదు.

''ఈ పాడు వూర్లో అస్సలు డోర్ నెంబర్లే లేవు'' అని గొణుక్కుంటూ మరో వీధిలోకి తిరిగాడు.

'' ఆ... అదే మర్రిచెట్టు'' స్నేహితుడు ఉత్తరంలో రాసిన మర్రిచెట్టు గుర్తొచ్చి ఆ కాంపౌండ్‌లోకి అడుగెట్టాడు.

కాలింగ్‌బెల్ నొక్కాక, అయిదు నిమిషాలకు తలుపు తెరిచింది ఓ యువతి.

''మీ డోర్ నెంబరెంతండీ ?'' అందర్నీ ఈ డోర్ నెంబర్లడగటం విసుగ్గావున్నా అడిగాడు.

''క్షమించండి... ఎందుకు ?'' అడిగిందామె.

''ఓ అడ్రసుకోసం వెదుకుతున్నాను... దయచేసి చెప్పగలరా!'' సహనం కోల్పోకుండా అడిగాడు.

''4/393-8-C'' చెప్పిందామె. ఒక్కసారిగా సంతోషం ముంచుకొచ్చింది మోహన్‌కు. తనకు కావల్సిన నెంబరిదే.

''ఇక్కడ రాజశేఖర్ అని ఓ రచయిత-మా ఫ్రెండు—'' ఇంకా ఏదో అడగబోతుండగా మధ్యలో ఆమె అందుకొంది.

''క్షమించండి... నాలుగు బార్ కాదు మూడు. 3/393-8-C'' అంది. ఒక్కసారిగా నిస్సత్తువ ఆవరించింది మోహన్‌కు.

''అలానా... ఈ వీధి పేరేమిటండీ'' నిరాశగా అడిగాడు.

''అరుణోదయ్‌నగర్'' అని మళ్ళీ తిరిగి- ''క్షమించండి- కరుణోదయ్‌నగర్'' అంది.

వళ్ళు మండింది మోహన్‌కు. ''మీరు క్షమించండి అనే పదం లేకుండా మాట్లాడలేరా'' అని అడుగుదామనిపించింది- కానీ సభ్యతకాదని వూరకుండిపోయాడు.

కనీసం ఆమె భర్తతోనన్నా మాట్లాడితే—ఏ



వరంగా అడ్రస్ తెల్సుకోవచ్చనే ఉద్దేశంతో- "మీ భర్తపేరు రామారావ్ కదూ-" అడిగాడు.

"ఔను" అని వెంటనే... "అహ- క్షమించండి కృష్ణారావ్" అందామె.

మరింతగా వళ్ళుమండింది మోహన్‌కు. 'మీకేం మాయదారి రోగం- క్షమించండి క్షమించండి అని చెవితెగిన మేకలా అరుస్తున్నారు' అనే మాటలు నోటిచివరివరకూ వచ్చాయి. కానీ చదువుకున్న సంస్కారం వాటిని బైటకు రానివ్వలేదు.

"ఆయన ఏంపని చేస్తారండీ?"

"టైపిస్ట్" అని చెప్పిందామె ఆ వెంటనే...

"క్షమించండి... స్టేట్ బ్యాంక్‌లో క్లర్క్ కమ్ టైపిస్ట్" అంది.

"మీపేరేమిటో తెలుసుకోవచ్చా?" ఆమె పేరు తనకనవసరమైనా ఉండబట్టలేక అడిగాడు.

ఆమె కాస్త సిగ్గుపడింది.

"నిర్మల" అనేసి, ఆ వెంటనే "క్షమించండి... విజయనిర్మల" అంది.

"ఏంచేస్తుంటారు?" ఆత్రుత ఆపుకోలేక అడిగాడు మోహన్.

"డాన్సర్‌గా క్షమించండి... రేడియోలో అనౌన్సర్‌గా- తడబడుతూ చెప్పిందామె"

'హమ్మయ్య... అదా సంగతి' అనుకున్నాడు మోహన్.

"మీకు కల్గిన అసౌకర్యానికి క్షమించండి" మోహన్‌కు తెలియకుండానే ఆమాటలు వచ్చాయి అతని నోటినుండి.

-ఎ.ఎస్.రాజశేఖర్

---

కవరుపేజీ ఫొటోగ్రాఫరు: ప్రసాద్, మద్రాసు

# చతుర

సంపుటి:11 సంచిక:2 మార్చి:88

## అరాజకీయం నవలా పరిచయం

నేటి రాజకీయ జీవితం ఒక రంగులకల. హోదాల వల. అధికారాల భ్రమ. మిలమిల మెరిసి ఆకర్షిస్తుంది. అందలం ఎక్కించిన అదృష్టాన్ని ఎగతాళి చేస్తూ ఏ క్షణాన అగాథాలలోకి తోసేస్తుందో ఎవరికీ అంతుపట్టదు. ముచ్చటగా ముఖ్యమంత్రిన వుదామనే ప్రబలమైన వాంఛ చాలామందిలో వున్నా విఫలులవుతున్నవారెక్కువ. అందుకోగలుగుతున్నవారు అత్యల్పం. అదో మాయాలోకం.

అట్టడుగు స్థాయినుండి ఎదిగి ముఖ్యమంత్రి పదవిని చేపట్టాడు గోవిందరావు. అతన్నెలాగైనా పడగొట్టి ఆ పదవిని దక్కించుకోవాలనేవారి ప్రయత్నాలు అప్పుడే ప్రారంభమైనాయి. అలా ప్రయత్నించినవారిలో అతని ఇల్లాలు సైతం వుండటమే ఆశ్చర్యం. చివరికి ఆమె అతన్ని పదవీభ్రష్టునిచేసి తనే గద్దెనెక్కిన తీరు అపూర్వం. వాచస్పతిలాంటి కార్యనిర్వహణాదక్షులైన జర్నలిస్టులకి ఈ రాజకీయాలు ఎలాంటి పాఠాలు నేర్పుతున్నాయి? ఎలాంటి అనుభవాల్నిస్తున్నాయి?

అందరికీ తెలిసిన రాజకీయాల వెనుక కొందరికే తెలిసే అరాజకీయాల్ని ఆసక్తికరంగా చిత్రించారు పాలకోడేటి సత్యనారాయణరావు. 'చతుర' నవలల పోటీలో ప్రత్యేక బహుమతి పొందిన విశిష్ట రచన 'అరాజకీయం'.

"జీవితం అంటే, బాధ్యతలంటే తెలీని పసితనంలో నాచేత అక్షరాలు దిద్దించి, నాకు అక్షర భిక్ష అన్న భిక్షపెట్టిన ఆ మహానుభావుడెవరో తెలీదుగానీ, కలం పుచ్చుకున్న ప్రతిసారీ నాకు గుర్తొచ్చే ఆ మహనీయునికి నా కృతజ్ఞతగా ఈ నవల అంకితం చేస్తున్నాను" అంటున్న శ్రీ పాలకోడేటి సత్యనారాయణరావు, ఉస్మానియా యూనివర్సిటీ పోస్టుగ్రాడ్యుయేట్. హైదరాబాద్‌లోని అక్కౌంటెంట్ జనరల్ ఆఫీసులో సీనియర్ అక్కౌంటెంట్. కొన్ని కథలు, నవలలకు బహుమతులు పొందిన సీనియర్ రచయిత.





# అరాజకీయం

—పాలకోడేటి సత్యనారాయణరావు

**మా**ర్గశీర్షబహుళ నవమీ శుక్రవారం. ఉదయం తొమ్మిది గంటల తొమ్మిది నిమిషాలు.

మాన్యశ్రీ గోవిందరావుగారు హుందాగా సంతకంచేసి, చేతిలోని కలాన్ని పక్కనపెట్టారు. గవర్నర్‌తో ముందుగా కరచాలనం చేశారు. ఆ తర్వాత అది చాలదన్నట్లుగా ఆయన్ను గట్టిగా కౌగలించుకొన్నారు.

వేదికమీద ఇదంతా జరుగుతోంటే, కింద షామియానాలో ఉన్న అతిరథ మహారథులంతా పరిసరాలు దద్దరిల్లేలాగ హర్షధ్వానాలు చేశారు. గోవిందరావు అందరికేసి సాదరంగా చూశారు.

ఆ తర్వాత - టేబుల్‌మీద ఉన్న కాగితాలనందుకొన్నారు.

అది మంత్రుల జాబితా అనుకొన్నారు షామియానాలోనివాళ్లంతా. ఎవరికివారు ఆ పట్టికలో తమ పేరువుండి తీరుతుందన్న ఆశతో క్షణం ఊపిరిపీల్చటం మానేశారు.

మైక్ ముందుకుచేరి గోవిందరావు గొంతు సవరించుకొన్నారు. క్షణంతర్వాత, నెమ్మదిగా అన్నారు--

"గవర్నర్‌గారికి, ఆహూతులైన పార్టీ పెద్దలకు, అధికార, అనధికార ప్రముఖులకు, రాష్ట్రప్రజలకు ముందుగా నా కృతజ్ఞతలు.

రాష్ట్ర చరిత్రలో నేడు సుదినం..."

--గోవిందరావు ఆతర్వాత ఏంచెప్తారోనని అందరూ ఆసక్తిగా చెవులు రిక్కించి వినటం ఆరంభించారు.

పత్రికారంగానికి చెందిన ప్రముఖులు, విలేకరుల కోసం షామియానాలో కొంత స్థలాన్ని ప్రత్యేకించి ఉంచారు. అందులో కూర్చుని ఉన్నవారిలో వాచస్పతి కూడా ఒకడు. వేదిక మీద, వేదికకింద జరుగుతున్న తమాషానంతా ప్రేక్షకుడిలా చూస్తున్నాడు.

ముఖ్యమంత్రుల ప్రమాణస్వీకారోత్సవానికి రావటం వాచస్పతికి ఇదే మొదటిసారికాదు. గతంలో రాష్ట్రంలో వరసగా ముఖ్యమంత్రులు మారినప్పుడల్లా పదవీస్వీకార ప్రమాణోత్సవాలకు వాచస్పతి ఆనవాయితీగా హాజరవుతూ వచ్చాడు. ఒకప్పుడు రాష్ట్రంలో ఈ 'ఉత్సవం' నిజంగా ఉత్సవంగానే అరుదుగా జరుగుతుండేది. కానీ ఇపుడది చాలామామూలు విషయమైపోయింది. వార్తాపత్రికల్లో పతాకశీర్షిక చూస్తేగానీ ఎవరికీ ఆరోజు సరిగ్గా గడుస్తోందన్న నమ్మకం లేకపోయేది రాష్ట్ర రాజకీయ నాయకులకు.

"'...గారి రాజీనామాకు కేంద్రం ఆదేశం'' అని పతాకశీర్షికలో కనబడకపోతేనే, పదవికి గ్యారంటీ అని నాయకులు అనుకోగలుగుతున్నరోజులివి!

కొత్త ముఖ్యమంత్రి ఏంచెప్తారో ఎవరూ విననక్కర్లేదు--

ఎవరు చెప్పినా, ఏ రాష్ట్ర రాజధానిలో చెప్పినా అవే చిలకపలుకులు--

అవకాశం ఇచ్చిన పార్టీ పెద్దలకు కృతజ్ఞతలు.

ఏకగ్రీవంగా ఎన్నుకొన్న పార్టీ సభ్యులకు కృతజ్ఞతలు...!

వగైరా... వగైరా...!

ఈ నాయకులకు పార్టీ పెద్దలు, పార్టీ సభ్యులు తప్ప ఇంకెవ్వరూ కనబడరు. రాష్ట్రప్రజలు అసలు వీళ్లకు పట్టనేపట్టరు.

సింహాసనం చుట్టూ మ్యూజికల్ ఛెయిర్స్ లాగా గిర్రున తిరగటమేతప్ప ఇంకో వ్యాపకంలేని మనుషులు వీళ్ళు.

పేరు మార్పేతప్ప వాసివరంగా ఏ తేడాలేని వాళ్లు!

వీళ్లు పలికేది ఆ గూటి పలుకులు.

అవి విననక్కర్లేదు. కిందటి ముఖ్యమంత్రిగారు ఇదే సమయంలో ఏం అన్నారో చూసుకొని, అవసరమైనచోట ఆయన పేరుకొట్టేసి 'గోవిందరావు' అనిరాస్తే సరిపోతుంది!!

కానీ...

'గోవిందరావు... ముఖ్యమంత్రి' అన్నమాటే వాచస్పతికి కంపరంగా ఉంది.

ఈ రాష్ట్ర పాలకులుగా ఎలాటి మనుషుల్ని చూశాడు తను. ఇపుడు ఎలాటివారిని చూడాల్సివస్తోంది! దేశంలో జనాభా పెరుగుతున్నకొద్దీ నీతినియమాలకు, నిజాయితీకి పేరు పొందినవారి సంఖ్యా అదే నిష్పత్తిలో పెరగాల్సి వుంది.

 

కానీ ఈ దేశ దౌర్భాగ్యం ఏమిటో- ఎనభైకోట్ల జనాభాలో ఎనభైమందైనా నిజాయితీపరులు దొరకటంలేదు-- మంది పెరిగినకొద్దీ మజ్జిగ పలచన అన్నట్లు!

కాకుంటే - గోవిందరావు రాష్ట్ర ముఖ్యమంత్రి కావటం ఏమిటి?

—ముఖ్యమంత్రిగారి ప్రసంగం కొనసాగుతూనేవుంది.

వాచస్పతికి అక్కడి వాతావరణం అంతా ఉక్కిరిబిక్కిరిగా ఉన్నట్లు అనిపించింది. ఎవరెవరో తన మెడకు అన్నివైపులనుంచి ఉరి వేసి బిగిస్తున్నట్లుగా తోచింది.

సభ మధ్యలోంచి లేచివెళ్లిపోవటం సభ్యత సంస్కారాలకు భిన్నమే అయినప్పటికీ, అక్కడ ఇంకొంతసేపు కూర్చుంటే గుండె ఆగిపోతుందన్న భయంతో వాచస్పతి లేచాడు.

అడుగులో అడుగులేనుకొంటూ, అడ్డంగా ఉన్న ఎందర్నో తప్పించుకొంటూ కదిలాడు.

వేదికమీద ఉన్న గోవిందరావు కళ్లు తనను వెంటాడుతూనే ఉంటాయన్న సంగతి వాచస్పతికి తెలీందిగాదు. అయినా బయటకు నడిచాడు.

దర్బార్‌హాల్ పక్కనే మరో పెద్దహాలు. ఆ హాలు గోడలమీద రాష్ట్రంకోసం పాటుపడ్డ మహామహుల ఫొటోలున్నాయి. జరుగుతున్న ఉత్సవంలో ఆనందంగా పాలుపంచుకోవాల్సిన ఆ పుణ్యాత్ములంతా 'ఇదేమిటి, ఇలా జరుగుతోందన్న బాధ'తో దిగాలుపడ్డట్లుగా కనిపిస్తున్నాయి. ఫొటోల్లో ఉన్నవారంతా కీర్తిశేషులే అయినా ఇంత నిర్జీవంగా వాళ్లెప్పుడూ కనిపించలేదు వాచస్పతికి.

ఈ హాల్లో కూడా ఎందరో మనుషులు.

అందరికీ ఒకటే ఆశ-

ప్రసంగం తర్వాత.

గోవిందరావు మంత్రివర్గ సభ్యుల పేర్లు ప్రకటిస్తే అందులో తమ పేరు ఉంటే అది విని తరిద్దామన్న ఆశ.

అందుకే వాచస్పతి బయటకు నడుస్తోంటే ఎవరూ పట్టించుకోలేదు.

అడుగులో అడుగుగా వేసుకొంటూ, గతాన్ని గుర్తుచేసుకొంటూ వాచస్పతి ఆ హాల్లోంచి నడిచాడు.

ఆ ముందు హాలు - విశాలమైన రిసెప్షన్ రూం. ఎవరినైనా గవర్నర్‌గారు కొద్దిక్షణాలపాటు మాత్రమే కలుసుకోవాల్సి ఉంటే, ఈ రూంలోకి వస్తారు. మర్యాదపూర్వకంగా లాంఛనప్రాయంగా నాలుగుముక్కలు మాట్లాడి వచ్చినవారిని సాగనంపుతారు.

వాచస్పతి ఆ హాల్‌లోకి వచ్చి... నివ్వెరపోయాడు!!

మిసెస్ మైథిలీరావ్ ఆ హాల్లో ఓ సోఫాలో కూర్చుని ఉంది!

మైథిలి అంటే ఎవరోకాదు - ఇపుడు ముఖ్యమంత్రిగా రాష్ట్రప్రజలకు తన తొలిసందేశాన్ని అందజేస్తున్న గోవిందరావుకు సాక్షాత్తూ ఇల్లాలు!

భర్త రాష్ట్ర నాయకత్వాన్ని చేబడుతున్న శుభతరుణంలో మైథిలి - ఇలా ఆ ఉత్సవానికి దూరంగా అశోకవనంలో సీతలాగ - నిర్లిప్తంగా కూర్చుని ఉండటం వాచస్పతికి చిత్రంగా తోచింది.

అయినా క్షణంలో సర్దుకొని నెమ్మదిగా ముందడుగు వేశాడు.

మైథిలికి కొద్దిదూరంలో నిలబడ్డాడుఆమెకు 'భద్రత' కల్పిస్తున్న గార్డులు వాచస్పతిని చూసి పక్కకు జరిగారు.

"నమస్కారం!" అన్నాడు వాచస్పతి.

మైథిలి తలెత్తి చూసింది.

"మీరా... రండి!" అంది. సోఫాలో కొంచెం పక్కకు జరిగింది. కానీ వాచస్పతి వెళ్లి ఆమెకు ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చున్నాడు. ముఖంమీదకు వీలైనంత నవ్వు పులుముకొంటూ అన్నాడు-- "కంగ్రాట్స్... మన రాష్ట్ర ముఖ్యమంత్రిగారి ఇల్లాలైనారు మీరీ రోజు"

మైథిలి తలఊపింది చిన్నగా.

"మన రాష్ట్రం వరకూ చెప్పాలంటే మీరు ఇకపైన ఫస్ట్ లేడీ!"

—మైథిలి నవ్వింది. ముఖ్యమంత్రి రాష్ట్రానికి ఫస్ట్ సిటిజన్ అయితే, ముఖ్యమంత్రి భార్య ఫస్ట్ లేడీయేగదా!

"మీ కోసం పెండాల్ అంతా వెతికాను. అక్కడ మీరు కనపడకపోయే సరికి ఇలా

# ఈ పాప ఎవరు?





ముఖం చూస్తే తెలుగు. వేషం చూస్తే కాశ్మీరీ అనుకుంటున్నారా?

నిజమే! ఈ పాప తెలుగు పాపే! కాశ్మీర్లో తీయించుకుందీ ఫొటో!

'విపుల' కథలూ అంతే!

ఒక్క కాశ్మీరే కాదు అన్ని ప్రాంతీయభాషాకథల్నీ తెలుగులో అందిస్తుంది విపుల.

అవి తెలుగుకథలు కాకపోయినా, హాయిగా తెలుగులోనే చదువుకోవచ్చు.



మీ భాషలో ఇతరభాషా సాహిత్యాన్ని అందుకోగల ఏకైక సాధనం.

# విపుల

వచ్చాను. నేను ఊహించినట్లుగానే మీరిక్కడ ఉన్నారు... మీరేమీ అనుకోనంటే నాదో చిన్న రిక్వెస్ట్''

మైథిలి నవ్వింది. ''చెప్పండి... ఇప్పటికి పదిమంది వచ్చారు. ఎవరి కోరికలు వారివి! అన్నీ గుర్తు పెట్టుకొంటున్నా- మీదీ చెప్తే ఆయనకు చెప్తాను'' అంది.

వాచస్పతి నవ్వాడు. ''ఇది ఆయన తీర్చాల్సిన రిక్వెస్ట్ కాదు! మీతోటే నాకుపని! కొంచెం వెరైటీగా ఉంటుంది. మీరాయన్ను మా పత్రిక కోసం ఇంటర్వ్యూ చేసిపెట్టాలి!''

మైథిలి ఉలిక్కిపడింది.

వాచస్పతి తెలివైనవాడు. ఆ సంగతి మైథిలికి తెలీందికాదు.

కానీ 'ఇంత' తెలివైనవాడని మాత్రం ఆమె అనుకోలేదు.

ఆవులిస్తే పేగులు లెక్కపెట్టాల్సిన గుణం పత్రికా విలేకరులలో ఉండి తీరాలిగానీ వాచస్పతి ఆవులించకుండానే అన్నీ లెక్కపెట్టే ప్రయత్నంలో ఉన్నాడు. 'ఇంత' తెలివైనవాడిని ఆషామాషీ పనులకు ఉపయోగించుకోకూడదు- అనుకొంది మైథిలి.

''మీ ఊహ బాగుంది కానీ... ఐరిగ్రెట్! ఈసారికి వదిలెయ్యండి. మరోసారి చూద్దాం! నేనే మిమ్మల్ని పిలిచి చెప్తాను. నా మాట నమ్మండి'' అంది నిజాయితీగా.

''మీఇష్టం మరి!'' అన్నాడు వాచస్పతి.

--కొత్త ముఖ్యమంత్రిగారు తన మంత్రివర్గ సభ్యుల పేర్లు ప్రకటిస్తే వెళ్ళిపోవచ్చు- అనుకొన్నాడు వాచస్పతి.

తను, తనలాగే సభలోని ఇతరులూ వెళ్ళిపోతారన్న భయంతోనే కాబోలు, గోవిందరావు కూడా ఆ పని చివరికి పెట్టుకొని ముందుగానే 'సందేశం' అందిస్తున్నారు.

వాచస్పతికి ముళ్ళమీద వున్నట్లుగాఉంది. వృత్తి ధర్మం అడ్డొస్తోంది గనుక ఉండిపోయాడుగానీ, లేకపోతే వెళ్ళిపోయేవాడే!

మరో అయిదు నిమిషాల తర్వాత తన ప్రసంగం ముగించాడు గోవిందరావు. ఆ తర్వాత --''పాదుపు మన ముఖ్యకర్తవ్యం అని నాకు బాగా తెలుసు! అందుకే మంత్రుల ప్రమాణస్వీకారం కోసం మరో ఉత్సవాన్ని ఏర్పాటు చేయనవసరంలేకుండా, ఆ పనీ ఇపుడే జరిపించాలని నిర్ణయించాను'' అంటూనే తన మంత్రి వర్గ సభ్యుల పట్టికను రాష్ట్ర ప్రధానకార్యదర్శికి అందజేశారాయన.

మంత్రులపేర్లు వరసగా చదవటం మొదలుపెట్టాడు కార్యదర్శి. పట్టిక పూర్తయ్యాక వరస క్రమంలో ప్రమాణస్వీకారోత్సవం ఆరంభమయింది. పట్టికను పరిశీలిస్తూ కూర్చున్నాడు వాచస్పతి. కోస్తాకు ఇరవై, రాయలసీమ, తెలంగాణాలకు చెరోపదిహేను, జంటనగరాలకు అయిదు-- మొత్తం యాభైఅయిదు మంది మంత్రులు. కాబినెట్ హోదాలో ముప్పయి, స్టేట్ హోదాలో పాతిక, కులాలవారీగా, మతాలవారీగా అన్నీ నిష్పత్తుల ప్రకారం ఉన్నాయి. ఆరుగురు స్త్రీలు. వారిలో ఇద్దరు కాబినెట్ హోదాలో.

నిట్టూర్చాడు వాచస్పతి.

పాదుపు గురించి పేర్కొంటూ యాభై అయిదు మందిని మంత్రుల్ని చెయ్యటం ఈయనకే చెల్లింది. మాటకు, చేతకు ఎంత దూరమో అపుడే నిరూపించనారంభించాడు గోవిందరావు. ఎందరు గమనిస్తారు ఈ సంగతి? వాచస్పతి ఇబ్బందిగా కదిలాడు.

అందరు మంత్రులూ ప్రమాణం చేశారు.

ఇపుడు షామియానా కొత్తకళతో నిండింది. ఏ మంత్రికి ఉన్న మద్దతుదార్లు ఆ మంత్రి చుట్టూ చేరారు. ఒకర్ని ఒకరు మించేలాగున పూలమాలలు గుప్పిస్తున్నారు. గోవిందరావు సంగతి చెప్పనే అక్కర్లేదు- నడుస్తున్న పుష్పపర్వతంలా ఉన్నాడు.

ఇకమిగిలింది-- ఆహూతులకు డిన్నర్.

అందరూ నడుస్తోంటే, వాచస్పతి కూడా బయల్దేరాడు.

దూరాన్న మైథిలి చుట్టూ ప్రముఖులు, విలేకరులు గుమిగూడి ఉండటంతో వాచస్పతి అటు నడిచాడు.

మైథిలిలో ఇందాకటి నిర్లిప్తతలేదు. ఆమెలో ఇపుడో కొత్త భావం స్పష్టంగా కనిపిస్తోంది. అది ఏదో పసిగట్టే ప్రయత్నం చేశాడుగానీ వాచస్పతికి అది అంతుబట్టలేదు.

''అంటే మీకు మంత్రి వర్గంలో స్థానం

లేకపోవటంవల్లే రాజీనామా చేశారా?'' ఒక విలేకరి అడుగుతున్నాడు.

వాచస్పతి ఉలిక్కిపడ్డాడు—

మైథిలి రాజీనామా చేసిందా?

శాసనసభ్యత్వానికా? పార్టీకా??

ఎందుకు?

భర్త ముఖ్యమంత్రిగా పదవీ స్వీకారం చేసినకొన్ని క్షణాలకే ఇలా చేయటం ఏమిటి?

''కారణం అదికాదు, ఒక వ్యక్తికి జోడు పదవులు కూడదన్నది మా పార్టీ నియమం. ఒక కుటుంబంలో మాత్రం దేనికన్నది ఈ రాజీనామాకు కారణం!''

ఈ జవాబు ఇచ్చింది మైథిలి కాదు, మైథిలి భర్త, కొత్త ముఖ్యమంత్రి గోవిందరావు.

అంటే పార్టీకి కాదన్నమాట రాజీనామా!

అయినా— అరగంట క్రితం ఆమె ఏకాంతంగా ఉన్నప్పుడు తను వెళ్ళి పలకరించాడు, మాట్లాడాడు. అపుడు తనకు చెప్పలేదీ సంగతి!

ఆడదాని నోట్లో నువ్వు గింజనానదంటారు. కానీ మైథిలి మాత్రం— ఆడదే అయినా అంతటి వార్తను అణిచిపెట్టుకోగలిగింది.

అందరి దృష్టి గోవిందరావు మీదికి మళ్లింది. భార్య శాసనసభా సభ్యత్వానికి రాజీనామా ఇవ్వటానికి అందమైన కారణం చెప్పి, అసలు విషయాన్ని సినలైన రాజకీయ నాయకుడులా పక్కదారి పట్టించాడాయన.

ఎంతైనా మైథిలి తెలివైనది! రాజీనామాకు సైతం తగిన సమయాన్ని ఎంచుకొంది. గోవిందరావుకు ఎంత ప్రాముఖ్యాన్ని ఇచ్చినా, మైథిలికి కూడా రేపు వార్తల్లో ప్రత్యేక స్థానం ఇచ్చి తీరాల్సిందే!!

తెలివిగానే కొట్టింది దెబ్బ!!

కానీ... రాజీనామాకు అసలు కారణం అదేనా?

వాచస్పతిని వృత్తిపరమైన సందేహాలు వెంటాడుతూనే ఉన్నాయి.

గోవిందరావుతోనాలుగు అడుగులు వేసిన మైథిలి— ఉన్నట్లుండి వెనక్కు మళ్ళింది. తిన్నగా వాచస్పతి దగ్గరకు వచ్చింది.

''మీరిప్పుడు ఏం ఆలోచిస్తూ ఉంటారో నాకు తెలుసు! మీకు ఆ రాజీనామా సంగతి అప్పుడే చెప్పలేదని అనుకోకండి. రాజీనామా చెయ్యాలని నేను అప్పటికింకా అనుకోనేలేదు'' అంది నెమ్మదిగా.

ఆ తర్వాత, రహస్యంగా చెప్తున్నట్లుగా ఇంకొంచెం దగ్గరగా చేరింది. ''అయినా మీకు అలాటి చిన్న చిన్న వార్తలు దేనికి చెప్పండి! అసలైన విశేషం అంటూ ఏదన్నా ఉంటే అది ముందు మీకే తెలుస్తుంది. గుర్తుంచుకోండి... ది సీజ్ మై ప్రామిస్'' అంటూ నవ్వింది.

వాచస్పతి నివ్వెరపోయాడు— నిజానికి ఆమె జీవితంలో ఈ రోజు చెప్పుకోదగ్గ 'పండగ'. అయినా ఆమె అంతటి ముఖ్యమైన రోజున కూడా తన చెంతకువచ్చి మరీ ఎపాలజిటిక్‌గా సంజాయిషీ ఇచ్చుకోవటం అతనికి చిత్రంగా తోచింది.

అంతేకానీ...

రాజకీయ చదరంగంలో ఆమె తననో పావుగా ఉపయోగించుకోబోతోందన్న విషయాన్ని వాచస్పతి సూచనగానైనా గుర్తించలేకపోయాడు ఆక్షణంలో.

★ ★ ★

'హర్ష'లో ఆరోజు సంతోష సంబరాలు పెద్ద స్థాయిలో చోటుచేసుకొన్నట్లున్నాయి. ఆ భవనానికి అన్ని పక్కల చిన్న చిన్న సిరీస్ దీపాలు వెలిగి ఆరుతూ, మళ్లీ వెలుగుతున్నాయి. రంగు రంగు దీపాల వెలుగుల్లో ఆ భవనం మరింత శోభాయమానంగా ఉంది ఆరోజు.

'హర్ష' రాష్ట్ర ముఖ్యమంత్రి అధికార నివాసం. ఎత్తైన కొండమీదున్న ఆ భవనం బాల్కనీలో నిలబడితే నగరం అంతా అన్ని వైపులా విస్తరించి మరీ కనిపిస్తుంది. ఆ భవనంలోని అధికారానికి నగరం యావత్తూ పాదాక్రాంతమైనట్లుగా వుంటుంది. రాష్ట్ర ప్రజలంతా ఆభవనాధీశుని మోలవాలినట్లుగా వుంటుంది.

గోవిందరావు ఆరోజే ఆ భవనంలోకి మారాడు.

ఇంత క్రితం కాబినెట్ మంత్రిగా ఉన్నప్పుడు నగరంలో ఎక్కడో ఓ మూలన ఉన్నట్లుండేది




ఇపుడు ముఖ్యమంత్రి అయ్యాక ఆ మారు మూల గల్లీలోంచి, సువిశాలమైన ప్రదేశంలోకి, లోయల్లోంచి ఉన్నత శిఖరాలమీదకు చేరిన ట్లుగా ఉందతనికి. ఎక్కవలసిన ఎత్తులన్నీ ఎక్కినట్లుగా కొన్ని క్షణాలపాటు అనిపించింది గోవిందరావుకు.

రాత్రి పదకొండు గంటలవరకు ఎవరెవరోవ చ్చి పోతూనే వున్నారు.

ఏవేవో చర్చలు - పనికి వచ్చేవికొన్ని అయితే, పనికి మాలినవి మరెన్నో; తమ గురించి చెప్పుకొనే వారు కొందరైతే, ఎదుటివా రిమీద ఆరోపణలు చేసేవారు ఇంకొందరు.

''పర్సనల్‌గా మాకేమీ అఖ్ఖర్లేదు. కానీ... ఇదిగో వీడున్నాడు చూడండి. మా అల్లుడు, వీడికి గనక ఆ జిల్లా అధ్యక్షపీఠాన్ని అనుగ్ర హిస్తిరో...'' ఆ జిల్లాను ఉద్ధరిస్తామని చెప్పేవా రొకరు.

''పాతికేళ్ల నుంచి పార్టీనే పట్టుకొని వేళ్లాడు తున్నా! అదో గానుగెద్దు జీవితం అయిపో యింది. ఆ గ్రామంనుంచి నాకు విముక్తి ప్రసాదించండి!'' అంటూనే తనను జిల్లాపరిష త్‌కో, శాసనసభకో ప్రమోట్ చెయ్యమని అడిగే వారు ఇంకొకరు-

''మీకు తెలీందిగాదు, నాముందు పార్టీలో చేరినవారు ఇపుడు కేబినెట్‌లోకి చేరారు. నేనేమో ... పోనీ నాసంగతి వదిలెయ్యండి, మాజిల్లా ఏం పాపం చేసుకుందో చెప్పండి!'' అంటూ నిలదీసేవారు ఇంకొకరు-

ఎవరికి తగ్గట్టుగా వారిని ఎవరిస్థాయికి తగినట్లుగా వారిని బుజ్జగించీ, బతిమాలీ, ప్రమోషన్లకు హామీలిచ్చీ, అలా ... అలా ... అందర్నీ తప్పించుకొనేసరికి - రాత్రి పదకొండ యింది.

పర్సనల్ స్టాఫ్‌ను వెళ్లమని సెలవిచ్చి, గో విందరావు బెడ్‌రూంలోకి అలసటగా చేరాడు.

అప్పటికే అక్కడ మైథిలి వుంది.

''పదకొండింటికి రాగలిగాను. నిజానికి ఇది తొందరగా తెమిలినట్లే లెక్క'' అన్నాడు గో విందరావు -కొంత ప్రకాశంగా, కొంత తనలో అనుకొంటున్నట్లుగా.

మంచంమీద తలగడను సరిగ్గా సర్దుకొని నెమ్మదిగా అన్నాడు గోవిందరావు ఆ తర్వాత... ''సరే- ఇపుడు చెప్పు - ఎందుకు చేశావాపని?''

మైథిలి వెనక్కు తిరిగింది - 'వేటువడ్డ ఉరగాంగన' రీతిగా.

గోవిందరావు మైథిలి కోపాన్ని అర్థం చేసుకొ న్నాడు. కానీ రాజకీయనాయకులందరికీ గాంధీగారొక మూడు కోతుల సూత్రం చెప్పిపో యారు. వినకు, కనకు, అనకు! భార్య దగ్గర ఆ సూత్రాన్ని అమలులోపెట్టాడు గోవిందరావు.

''చెప్పు... ఎందుకు చేశావాపని?''

''నిజమే... తప్పుచేశాను!'' అంది మైథిలి.

''నేనూ అలాగే అనుకొంటున్నా!''

''రాజీనామాకాదు, ఆత్మహత్య చేసుకోవా ల్సింది అసలు!''

''అంత అవసరం ఏమొచ్చింది?''

''మీకు మాటల్లోనే చెప్పాలి కాబోలు అంతా! యాభై అయిదుకు బదులు యాభైఆరయితే తేడా ఏముండేది?'' అనడిగింది మైథిలి.

మైథిలి ఏమంటోందో ముందు గోవిందరా వుకు అర్థం కాలేదు. ఏదో పజిల్‌లా అని పించింది.

క్షణం తర్వాత అసలు సంగతి అర్థమై చిన్నగా నవ్వేశాడు- ''తేడా ఉండేది కాదేమో కానీ అసలుకే ఎసరు వచ్చేసేది'' అన్నాడు.

''నన్నొక్కదాన్ని తీసుకొన్నంత మాత్రాన్నే...'' ఆశ్చర్యపోయి అడిగింది మైథిలి.

''నువ్వు ఎవరో ఓ ఎమ్మెల్యేవి అయివుంటే బాగుండేది. ఏ ఇబ్బందీ ఉండకపోయేది! కానీ నువ్వు నా భార్యవు. నేను సి.యం.గా నువ్వు కాబినెట్ మినిస్టర్‌గా వుండటం కుదిరేదిగా దు!''

''ఏం... ఎందుకని? మీ కాబినెట్‌లో ఉన్న ఎవరిపేరైనా చెప్పండి! వాళ్లకున్న అర్హత ఏమిటో, నాకులేని దేమిటో చెప్పండి... నోరు మూసుకొంటాను. కాకపోతే నేను చెప్తాను - మీ మంత్రుల్లో ఎవరెవరు ఎలాటి ఛండాలులో, ఎవరెవరు ఎలాటి దుర్మార్గులో...'' మైథిలి కోపంగా అడిగింది.

''నీకన్నీ తెలుసు. అయినా ఇలా నామీద విరుచుకుపడుతున్నావ్! ఊళ్లో వాళ్లకయితే నచ్చచెప్పగలను కానీ... నీకెలా చెప్పాలి! అయినా నీకు మంత్రిపదవి దేనికి? అంతకు

మించిన అధికారం నీకు వుండనే వుంటుంది గదా''

''ఏదీ... ముఖ్యమంత్రిగారి పెళ్లాంగానా?'' వ్యంగ్యంగా అంది మైథిలి.

''కాదా చెప్పు... ఈ దేశంలో ప్రజాస్వామ్యం పద్ధతే అంత! పదవిలో వున్నవారికన్నా వారి భార్యలు, బావమరుదులు-వీళ్లదేగదా ఇక్కడ



రాజ్యం! మన రాష్ట్రంలోకూడా ఇదే కథ గాదా? సి.యం. ఇక్కడుంటే, ఆయనకొడుకు హొటల్లో వుంటూ అడిగినవారి పనులు చేయిస్తాడు. మరో మంత్రికి పెళ్లాం పంపిన ఫైళ్లమీద సంతకాలు పెట్టటమే పనిగా వుండేది గదా! ఇవన్నీనీకు తెలీనివా ఏం? అనవసరంగా నామీద విరుచుకుపడటం తప్పిస్తే!''

''మీకు ముందే చెప్పాను - నాకిలాటి ఇన్‌డైరెక్ట్ పవర్స్ పనికిరావు. మీరు సంతకంపెడితే తప్ప నామాటకువిలువ ఏముంటుంది?''

''నువ్వు పెట్టమన్నచోట పెడతాను సంతకం! ఇదేమిటి అని అడగను... సరేనా?''

''రాష్ట్ర ప్రజలకు ఇచ్చిన వాగ్దానాలవంటి దేనా ఇదీనూ?''

గోవిందరావు నవ్వేశాడు - ''నీలో సెన్సాఫ్ హ్యూమర్ ఎక్కువ! నీలో నాకునచ్చిన క్వాలిటీల్లో అదొకటి!'' అంటూ మైథిలిని దగ్గరగా తీసుకొన్నాడు.



మైథిలి గోవిందరావును వారించలేదు. కానీ ఆమెకు అంతా అసంతృప్తిగా వుంది. అపూర్వావకాశాన్ని గోవిందరావు చేజేతులా జార్చేశాడు. లేకుంటే తనకు ఏమిటి తక్కువ? పార్టీలో ఎనిమిదేళ్ల సభ్యత్వం, మూడేళ్లనుంచి శాసన సభా సభ్యత్వం, వీటికితోడు ... ఆడవాళ్లకు ఇవ్వాల్సిన కోటా ఎలానూ ఉండనే వుంది.

ఆరుగుర్ని తీసుకొన్నాడు గదా గోవిందరావు, ఆ సంఖ్యను ఏడుకు పెంచితే ఎంత బాగుండేది! ఈ రోజు మధ్యాహ్నం తను మంత్రిణి అయివుండేదే!

ఆయన అన్నట్లు రవ్వంత కలకలం వుండేది. నిజమే కాని

ఈ దేశంలో దేనికి రాలేదు కలకలం?

ప్రధాని కొడుకొకడు ప్రేమించి పెళ్లిచేసుకొంటేనూ కలకలమే. మరొకడు విదేశీ అమ్మాయిని చేసుకొన్నా సంచలనమే! మంత్రి కొడుకొకడు బాహాటంగా వ్యభిచారిణులతో పోలీసులకో, పత్రికలవాళ్లకో దొరికిపోయినా సంచలనమే!

అయితే అవన్నీ ఎంతకాలం నిలబడ్డాయి?

ఈ దేశంలో ప్రజలకు జ్ఞాపకశక్తి స్వల్పం. వాళ్లు దేన్నీ ఎక్కువకాలం గుర్తుపెట్టుకోరు. ఈరోజు పేపర్లో వచ్చిన వార్తగురించి ఈ రోజంతా చర్చిస్తారు. రేపు - ఇంకోపేపరు వస్తుంది. ఇంకో పతాకశీర్షికతో! పాతపేపరును మూలపడేసినట్లు, నిన్నటి రోజున తలలు బద్దలు కొట్టేసుకొనేట్లు మాట్లాడుకొన్న ఆ సంగతిని కూడా మూలపడేస్తారు. ఈ విషయమూ అదే అయ్యేది. మంత్రివర్గంలో మంత్రిగాతాను ప్రమాణస్వీకారం చేసిన రోజున పెద్ద సంచలనం చెలరేగేది - 'భార్యాభర్తలు ఒకే మంత్రివర్గంలో' అన్న పేరుతో బాక్సుకట్టి వేసేవారు. మర్నాటికి అందరూ ఆ విషయాన్ని మర్చిపోయేవారు. ఇంతోటి దానికి భయపడటందేనికి?

కాదు... ఇది ప్రజలంటే భయపడటంకాదు. కేవలం తను ఎదుగుతుందన్న భయమే! ఆ భయంతోనే తనను ఎదగనీయకుండా కాపలా కాసుకొంటున్నాడు భర్త- అనుకొంది మైథిలి.

ఈ భావం రావటంతోనే మైథిలి మనసులో ఏవేవో ఆలోచనలు చెలరేగాయి.

రాత్రంతా మైథిలి ఆలోచిస్తూనే వుండిపోయింది. మర్నాటి ఉదయానికి ఆ ఆలోచనలలో కొన్ని స్పష్టమైన రూపురేఖల్ని దిద్దుకొన్నాయి.




వాచస్పతికి జీవితంలో పెద్దకోరికలు ఏమీ లేవు. బతికినంతకాలం ఈ దేశంలో ఉన్న కోట్లానుకోట్ల మందిలో తాను ఒకడిగా బతికితే చాలునన్న భావమే అతనిలో ఉండేది. ఏదో- ఏపూర్వజన్మసుకృతమో- నాలుగు అక్షరాలు చదువుకొన్నాడు. తెలుగులో ఉండేవి యాభైఅక్షరాలే అయినా వాటిని రకరకాలుగా కలుపుతూపోతే అవి ఎన్నోఅందాలు చిలికిస్తూ వస్తాయన్న సంగతి అతనికి అర్థంఅయింది. ఆ తర్వాత అదే అతనికి జీవనోపాధీ అయింది. 'అక్షరాల్ని నమ్ముకొని బతుకుతున్నవాడిని. నాకు అన్యాయం జరగదు' అన్న భావం అతనిలో గూడుకట్టుకొని ఉండేది.

ఉద్యోగంలో చేరినప్పటినుంచీ అదే భావన. ఆ భావనే అతన్ని కాపాడుతూ వస్తోందేమో కూడానూ!

దినపత్రికకోసం వార్తలసేకరణ అతని ఉద్యోగం. ఎక్కడో చిన్నతీగ దొరుకుతుంది. దాన్ని కొంచెం అందుకొంటే ఏడొంకో కదులుతుంది. వార్తలు రాలుతాయి. పత్రికలో పండుతాయి. అయితే వార్తల సేకరణ తేలికయిన ఉద్యోగంకాదు. ఆ సంగతి వాచస్పతికి తెలీందీ గాదు.

ఆరోజూ, రోజూలాగే వాచస్పతి తను అప్పటికే సేకరించిన వార్తల్ని చూసుకొంటూ, వాటికి పదునైన ఆకృతిని కల్పిస్తూ కూర్చున్నాడు.

అప్పుడొచ్చింది అతనికి సెక్యూరిటీ రూంనుంచి ఫోన్.

"మీకోసం ఎవరో వచ్చారండీ ఇపుడే! మీరున్నారో లేదో కనుక్కొని చెప్తాం అనేలోపునే వాళ్లు ఒక పార్శిలు ఇచ్చివెళ్లారు. మీకు అందజెయ్యమంటూ! మీరు వస్తారా... పైకి పంపించమంటారా?" అనడిగాడు సెక్యూరిటీ ఇన్స్పెక్టర్ కాశీపతి.

వాచస్పతి "పైకి పంపించండి" అంటూ ఫోన్ పెట్టేశాడు. ఇలాటి ఫోన్లు రావటం చాలా మామూలు. ఇలాటి పార్శిళ్లూ మామూలే. ఎక్కడో ఏదో కంపెనీ తెరుస్తున్నామనో, ఏదో సంస్థ వార్షికోత్సవమనో- ఏవేవో ఇన్విటేషన్లు వస్తూనే ఉంటాయి. ఒక్కోసారి తానువెళ్లకపోయినా ఆకంపెనీవాళ్లే తమ కంపెనీల వివరాలు చెప్పేపుస్తకాలు, ఫొటోలు వగైరాలతో పార్శిళ్లు పంపిస్తుంటారు.

సెక్యూరిటీగార్డు రాజువచ్చి ఆ పార్శిలు టేబుల్‌మీద పెట్టి వెళ్లిపోయాడు.

వాచస్పతి యధాలాపంగా ఆ పార్శిల్‌కేసి చూశాడు. పార్శిల్ నీటుగా పాక్‌చేసి ఉంది. ట్వయిన్‌దారంతో కట్టి సీల్‌చేశారు. పైన తనపేరు రాసి ఉంది. ఇంత జాగ్రత్తగా వచ్చిన పార్శిలు ఏమిటో వాచస్పతికి అర్థంకాలేదు.

వెంటనే దారం తెంపి పార్శిల్ విప్పాడు - లోపల ఇంకో కవరుంది. ఆ కవరుమీద 'పర్సనల్ అండ్ కాన్ఫిడెన్షియల్' అని ఉంది. వాచస్పతి ఆశ్చర్యపోయాడు.

క్షణం అటూఇటూ చూశాడు - డెస్క్‌లో ఉన్నవాళ్లంతా ఎవరి పనుల్లో వాళ్లుమునిగి ఉన్నారు. ఇలాటపుడు ఈ పార్శిల్ విప్పినా ఫర్వాలేదు గానీ, వాచస్పతికి ఎందుకో అక్కడ ఆ పార్శిల్ విప్పాలనిపించలేదు.

రాస్తున్నది పక్కనపెట్టి, పార్శిల్ చేతపట్టుకొని కాంటీన్‌లో ఒకమూలకుర్చీలో కూలబడ్డాడు. సావకాశంగా ఆ రెండోకవర్ కూడా చింపాడు.

లోపలన్నీ ఫొటోలు - ఎవరో ఒక యువకుడు, ఒక యువతితో ఉన్నాడు - ఆ ఉంటమూ అలాఇలాకాదు ఇద్దరు పూర్తి నగ్నంగా ఫొటో తిప్పిచూస్తే 'రమేష్‌కుమార్, సన్‌ఆఫ్ రామనాథం, మినిస్టర్‌ఫర్ కల్చరల్ ఎఫైర్స్' అని నీటుగా టైప్‌చేసి ఉంది.

వాచస్పతి ఉలిక్కిపడ్డాడు. ఫొటోలన్నీ ఒకదానితర్వాత ఇంకోటిగా తీసిచూశాడు. మొత్తం ఆరుఫొటోలు. ఆరుఫొటోలూ విభిన్నంగా ఉన్నాయి. అన్నిఫొటోల్లోనూ ఉన్నది రమేష్‌కుమారే అయినా అమ్మాయిలు మాత్రం ముగ్గురు.

—ఆ ఫొటోలు చెప్తున్నది ఏమిటో స్పష్టంగా అర్థంఅయింది వాచస్పతికి. 'కల్చరల్‌ఎఫైర్స్' మంత్రిగారి సుకుమారుని రాసలీలా వినోదానికి ప్రత్యక్షసాక్ష్యాలు. అంతవరకు బాగానే ఉంది గానీ, వీటిని తనకు ఎవరు పంపారు? ఎందుకు పంపారు? ఎవరు వీటిని పంపినా- వారికి రామనాథం మీద ఉన్న కక్ష అర్థంఅవుతోంది. లేకపోతే మంత్రిగారి కొడుకులు కూడా సచ్ఛీలురై ఉండాలని రూలెక్కడుందీ దేశంలో!

-అసలు ఈ దేశంలో దేనికి ఓరూలుందిగనుక ! ఎవరైనా ఎవరికైనా ఈ దేశాన్ని టోకుగానో, చిల్లరగానో అమ్మేయవచ్చు! హైసెక్యూరిటీ అని పేరుపెట్టుకొన్న జైళ్ళలోంచే పేరు మోసిన దొంగలు హాయిగా రాజులా నడుచుకొంటూ వెళ్లిపోవచ్చు!

నియమనిబంధనలన్నిటికీ నీళ్లొదిలి కోట్లాది రూపాయల ఖరీదుచేసే కాంట్రాక్టులను తనవారికి అప్పగించవచ్చు!

-ఇవేవీ ఈ దేశంలో నేరాలుగావు... ఘోరాలు అనలేకావు. అలాటిది ఓ మంత్రిగారి కొడుకు ఎవరో అమ్మాయిలతో రాసక్రీడలాడితే అదినేరమెలా అవుతుంది?

తను దాన్ని నేరంగా ... తన ఇంటినే చక్కదిద్దుకోలేని మంత్రి దేశాన్ని ఏంచక్కదిద్దుతాడు? అంటూ రాసినా, ఎందరు పట్టించుకొంటారు?

-ఏముంది ఇందులో న్యూస్‌వాల్యూ?

-వాచస్పతి చాలా ఆలోచించాడు. చివరకు ఫొటోలన్నిటినీ మళ్లీ జాగ్రత్తగా ఆ కవరులోనే పెట్టాడు. వీటిని వాడుకోవచ్చు. కానీ ఇప్పట్లో కాదు. ఆ కల్చరల్‌ఎఫెయిర్స్ మినిస్టర్ మరో ఆయిదేళ్లలో ముఖ్యమంత్రి కావచ్చు.

ఈ రమేష్‌కుమార్ ఓ దశాబ్దంగడిచేలోపునే మంత్రి అయిపోవచ్చు. ఈ దేశంలో అదేంపెద్ద కష్టంకాదు. ఇక్కడ మంత్రి పదవులన్నీ వారస

త్వపు పదవులే! అప్పుడు... అప్పుడు ఈ ఫొటోలకు విలువ పెరుగుతుంది- అనుకొన్నాడు.

కాంటీన్లోంచి బయటకు నడిచాడు వాచస్పతి. -మర్నాడు అదే సమయానికి మళ్లీ ఇంకో పార్శిల్ వచ్చింది వాచస్పతికి.

ఈసారి ఇంకేఫొటోలు ఉన్నాయోనని ఆ కవరు జాగ్రత్తగా విప్పాడు. అందులో ఈసారి ఏఫొటోలూలేవు. కేవలం ఒకే సైక్లోస్టయిల్డ్ కాగితం - అధికారంలో ఉన్న పార్టీవారు రమేష్ కుమార్ను తమ పార్టీయువజన విభాగానికి అధ్యక్షుడుగా నియమిస్తున్నట్లు వార్త ఉన్న కాగితం అది.

- వాచస్పతి నివ్వెరపోయాడు - అంటే నిన్నగనుక తను కొంచెం జాగ్రత్తపడివుంటే రమేష్కుమార్ గురించిన 'నిజం' ఈరోజు పేపర్లోవచ్చిఉండేది. ఇలాటి వ్యక్తికి పార్టీయువజన విభాగాన్ని అప్పగించేటప్పుడు పార్టీ ఇంకొంచెం జాగ్రత్త పడివుండేది. అంటే రమేష్కుమార్కు ఆ పదవి 'హుష్కాకి' అయిపోయిఉండేది.

పొరపాటు జరిగిపోయింది అనుకొన్నాడు వాచస్పతి.

అలా అనుకొంటూ ఉండగానే వాచస్పతికో ఫోన్వచ్చింది. అందుకొన్నాడు. "హలో... వాచస్పతి దిస్సైడ్!" అన్నాడు అలవాటుకొద్దీ.

"రమేష్ ఫొటోలు ఈరోజైనా వెయ్యండి! ఆతర్వాత ఏంజరుగుతుందో చూడండి!" అంది అవతలికంఠం. వాచస్పతి ఉలిక్కిపడ్డాడు. ఎవరిదా కంఠం? ఎవరికి తెలుసు తనదగ్గర ఆఫొటోలు ఉన్నట్లు? ఎవరికంత ఇంటరెస్ట్ అతన్ని పడగొట్టాలని!

"మీరెవరు మాట్లాడేది?" అనడిగాడు వాచస్పతి.

ఫోన్కట్ అయిపోయింది. కానీ ఆ ఫోన్లో గొంతు తనని వేటాడుతున్నట్లుగా ఉందతనికి.

"ఆఫొటోలు ఈరోజైనా వెయ్యండి!"

"వేస్తే"?

"ఆ తర్వాత ఏంజరుగుతుందో చూడండి! ఎవరిదో భవిష్యద్వాణి? ఏంజరుగుతుంది? అయినా రమేష్కుమార్కు ఉద్వాసన పలుకుతారు. అంతేగదా!

అదీ చూద్దాం అనుకొన్నాడు వాచస్పతి.

అనుకోవటమే తడవు - పాడ్ అందుకొన్నాడు. అధికారంలో ఉన్నపార్టీ నీతినియమాల గురించి ఉపన్యాసాలు మాత్రం చెప్తూ, క్రియల్లో దానికి ఎంతదూరంగా ఉంటోందో ఈఫొటో నిరూపిస్తున్నదంటూ ఒకే ఒక ఫొటోవేస్తూ, ఇలాటివి మరెన్నో ఉన్నాయని చిన్నవార్త బాక్స్ ఐటంగా రాసి పంపాడు.

-ఆవార్త రాస్తున్నంతసేపూ వాచస్పతి చాలా ఆలోచించాడు.

-తను తప్పు చేస్తున్నానా అని.

వాచస్పతికి తాను చేస్తున్నదాంట్లో ఏ తప్పూ కనిపించలేదు. తగిన సాక్ష్యాధారాలతో సరైన వార్తలు సేకరించటం తనపని. ఇపుడదే జరిగింది- అయితే ఫొటోలు ఎవరో పంపారు. అంతే తేడా! ఎవరో పంపకపోయినా, తనైనా సేకరించాల్సిందే ఎవరో ఒకరిదగ్గర్నుంచి... అనుకొని సరిపెట్టుకొన్నాడు.

మర్నాడు ఉదయమే వచ్చిన వార్తాపత్రిక తిరగేశాడు వాచస్పతి. 'రమేష్ కుమార్ రాసక్రీడలు' పేరుతో మొదటి పేజీలోనే బాక్స్ అయిటం- ఆకర్షణీయంగా అందరిదృష్టిలోనూ పడేటట్లుగా ఉంది!!

మామూలుగా వెళ్లే టైంకే ఆఫీసుకు వెళ్లాడు వాచస్పతి. అప్పటికే ఆ వార్త సంచలనం సృష్టించింది. అందరూ వచ్చి వాచస్పతిని అభినందించివెళ్లారు!!

అభినందనల పరంపర అందుకోవటం పూర్తయి, వాచస్పతి కొంచెం సెటిలయ్యేసరికి ఫోనొచ్చింది. "థాంక్స్ నేనడిగినట్లు వేశారు న్యూస్! చూడండి, ఏంజరుగుతుందో! మీ వార్త సంచలనం సృష్టిస్తోంది!!" అంది అవతలి కంఠం.

"మీరెవరో చెప్పారుగాదు!" అన్నాడు వాచస్పతి. ఫోన్ కట్ అయిపోయింది-

సాయంత్రం ఆరున్నరా, ఏడు గంటల సమయంలో తన కోసం ఎవరో వచ్చి వెయిట్ చేస్తున్నారని కబురొస్తే కిందకు వెళ్లాడు వాచస్పతి.

ఎవరో తెలీనివాళ్లు.

"నా పేరు వాచస్పతి!" అన్నాడు వాచ

స్పతి.

"మీ కోసమే చూస్తున్నాం సార్!" అన్నారు వాళ్లు. "అలా బయటకు వస్తారా... మాట్లాడు కొందాం!" అన్నారు అందులో ఒకరు.

"ఇది మాకు బిజీటైం మీరు చెప్పదలి చిందేదో చెప్తే...!" ఆగిపోయాడు వాచస్పతి.

"పదండి... పోనీ మీ కాంటీన్లోనే కూర్చుందాం!" అన్నారు వాళ్లు.

వాచస్పతి వాళ్లను కాంటీన్లోకి తీసుకెళ్లాడు. అందరికీ టీ తెప్పించాడు. టీ తాగుతోంటే అడిగాడు- "చెప్పండి, వివరాలెంత క్లుప్తంగా... అవతల!" అని ఆగిపోయాడు.

కానీ- వాళ్లు చెప్పటం ఆరంభించాక వాచ స్పతికి టైం తెలీలేదు. వాళ్లు చెప్తున్నవి వింటూంటే అతనికి మతిపోయినట్లుగా అని పించింది. ఎవరో అందించిన తీగ కదిపితే ఇప్పుడు పెద్ద డొంకే కదులుతున్నట్లు అని పించింది.

"ఇదండీ జరిగిన సంగతి! వివరాలన్నీ చెప్పాం! అన్నీ చెక్ చేసుకోండి! ఎవరికి చె ప్పాలా, వినే నాధుడు ఎవరున్నారా అని మేం మధనపడుతోంటే ఈ రోజు పేపర్లో మీరు రాసింది పడింది. అది చూశాక మాకూ ధైర్యం వచ్చి, మీకు జరిగిందంతా తెలియజేస్తు న్నాం!" అన్నారు వాళ్లు.

—వాళ్లిచ్చిన వివరాలన్నీ సరిచూసుకొన్నా డు. ఒకటికి రెండుసార్లు అన్నీ స్పష్టంగా తెలుసుకొన్నాడు. వాళ్ల పేర్లూ, అడ్రసులూ అన్నీ నోట్ చేసుకొన్నాడు. - వాళ్లను గేటుబయ టవదిలి, తన సీటు దగ్గరకు పరిగెట్టుకొచ్చాడు వాచస్పతి.

—కాగితం, కలం అందుకుని వెంటనే రాయసాగాడు తల వంచుకొని!

రాయటం పూర్తయ్యాక, మెట్లు దిగి, స్కూట రెక్కి హెూటల్ అక్బర్ ముందుదిగాడు. రిసెప్ష నిస్టుకి విష్ చేసి ఆమె సాయంకోరాడు. మొ దట సందేహించినా, ఆ తర్వాత రిజిస్టర్లు తీసి, అన్ని వివరాలూ చెప్పింది రమణి.

—వాచస్పతి ఆ వివరాలన్నీ నోట్ చేసుకొని, తిరిగి ఆఫీసుకు వచ్చాడు. ఇంత క్రితం రాసింది ఓసారి చూసుకుని కంపోజింగ్ సెక్ష న్కు పంపాడు.

—వాచస్పతి రాసిన ఆ వార్త మర్నాడు పత్రికలో ప్రచురితమయింది!!

ఆ వార్త పత్రికలో రావటంతోనే, రాజధానిలో సంఘటనలన్నీ చకచకా జరిగిపోయాయి.

ప్రతిరోజూ ఉదయమే ఇన్ఫర్మేషన్ డిపార్ట్ మెంట్‌శాఖ ఉద్యోగి ఒకరు, ఆనాటి పత్రికల్లో వచ్చిన ముఖ్యవార్తలన్నీ ముఖ్యమంత్రిగారికి చూచాయగా, టూకీగా చెప్తారు. ఆరోజు ఆ ఉద్యోగం ప్రతాపరావు డ్యూటీ అయింది.

ప్రతాపరావుకు ఆ పని చెయ్యటం ఇష్టం ఉండదు. ఏరోజు ఏపత్రిక తీసిచదివినా, ఏముంటుంది గనుక! పతాకశీర్షికల దగ్గ ర్నుంచి, పత్రిక చివర్లో వేసే ఇంప్రింట్‌కు అరంగుళంపై వరకు కూడా ప్రభుత్వాన్ని నాయకుల్ని, అవినీతిని, ఆడిపోసుకోవటమే గదా ఈ పత్రికలకుపని! ఆ విషయాలన్నీ ముఖ్యమంత్రిగారికి చెప్పటం, ఆయన కొంత సేపు పత్రికలమీద, కొంతసేపు రాసిన వాళ్ల మీద విసుక్కోవటం షరామామూలేగదా! ఉద యమే ఇలాటి కంచిగరుడ సేవంటే ప్రతాప రావుకు మంట! కానీ... తప్పదుమరి!!

—జీపు వచ్చి ఇంటిముందు నిలబడగానే, పేపర్లు అందుకొని, జీపెక్కాడు ప్రతాపరావు.

జీపు 'హర్ష'వైపు దౌడు తీస్తోంటే, ప్రతాప రావు ఒక్కో పేపరే తీసి ముఖ్యమైన వార్తలను చదువుకోనారంభించాడు.

"వార్త" పేపరు అందుకోగానే అతని ముఖం ఒక్కసారి జేవురించింది. ఫస్ట్‌పేజీలో పెద్దబాక్స్- రమేష్‌కుమార్ ఫొటోతోబాటు పక్కనే రామనాథంగారి ఫొటో కూడా ఉంది.

ప్రతాపరావు ఆదరాబాదరాగా ఆ వార్తంతా చదివాడు. తలదిమ్మెక్కిపోయింది అతనికి. రాసిన ప్రతి అక్షరంలోనూ నిజం వుందన్న సంగతి ప్రతాపరావుకు తెలీందిగాదు. ఇపుడా సంగతినే తాను ముఖ్యమంత్రి గారికి కూడా చెప్పాల్సి వుంటుంది! అదే అతనికి భయం కలిగించిన విషయం!

-రామనాథం గురించి రాష్ట్రంలో అందరికీ తెలుసు. అధికారంలో ఉన్నపుడు గొప్ప శాంతికా ముకుడు అతడు. అధికారంపోయిందంటే పచ్చినెత్తురు తాగడానికికూడా వెనుకాడని హింసావాది. దానికితోడు రామనాథం కొడుకు





రమేష్‌ను కూడా రంగంలోకి లాగుతున్నాడు ఆ పత్రికా విలేకరి! చేసిన వాళ్ళు ఆ తంత్రీక్ డుకులూ బాగానే ఉంటారు, రాసిన ఈ విలేకరీ బాగానే ఉంటాడు. మధ్యలో తన ప్రాణానికొస్తుంది ముప్పు. ''ముఖ్యమంత్రికి ఆ సంగతి చెప్పకుండా ఉంటే సరిపోయేదిగా!' అంటాడు రామనాథం. ఇలాటివిషయం... చెప్పకుండా ఉంటేమాత్రం దాగుతుందా? ఇంకోగంటకు రాష్ట్రంలో అంతా ఇదే చర్చనీయాంశంకాదా??

అయినా ఈ వార్తచెప్పటానికి ముందు ఏదైనా ఒక్క మంచివార్త చెప్తే, బాగుంటుందని ప్రతాపరావు అన్ని పేపర్లూ తిరగేశాడు. ఎక్కడైనా మచ్చుకు ఒకటంటే ఒక్కటి కూడా 'మంచి'వార్త అతనికి కనబడలేదు.

సరే... జరిగేది జరగకమానదు-అనుకొంటూ ప్రతాపరావు జీపుదిగి హాల్లోకి నడిచాడు.

ముఖ్యమంత్రి అప్పటికే నిద్రలేచి, శుభ్రంగా తయారయి ఉన్నాడు. విశాలమైన టేబుల్‌ముందు కూర్చుని ఏదోఫైల్ చదువుకొంటున్నాడు. పక్కనే భార్య మైథిలి కూర్చుని వుంది. ఆవిడ ముందు ఆరోజు పేపరు, పుస్తకాలు, మేగజైన్లు.

ప్రతాపరావు ఇద్దరికీ విష్‌చేసి, కుర్చీలో కూర్చున్నాడు. -క్షణంతర్వాత గోవిందరావు తన ముందున్న ఫైలు మూసేశాడు.

మరుక్షణం కళ్ళుమూసుకొన్నాడు-అంటే, 'వార్తలు చదవండీ వినటానికి నేను సిద్ధం' అని అర్థం అన్నమాట.

ప్రతాపరావు ఒక్కసారి నోరు తడుపుకొన్నాడు. నెమ్మదిగా అసలువార్త చదివి వినిపించాడు.

ప్రతాపరావు ఒక్కో వాక్యం పూర్తిచేస్తుంటే, గోవిందరావు ముఖం క్రమంగా జేవురించనారంభించింది. వార్త పూర్తవగానే గోవిందరావు ఒక్కసారి తలెత్తి ప్రతాపరావుకేసి చూశాడు.

''నమ్మదగినవార్తేనా ఇది?''

ప్రతాపరావు జవాబేమీ ఇవ్వలేదు.

''అయితే రామనాథంగార్ని వెంటనే రమ్మని కబురుపెట్టండి!'' అన్నాడు గోవిందరావు.

ప్రతాపరావు 'సరే'నంటూ తల ఊపి పక్కగదిలోకి కదిలాడు.

మైథిలి నెమ్మదిగా, చిన్నగా నవ్వింది: ''రామనాథంగారి సంగతి సరే... వారి పుత్రరత్నం సంగతి ఏమిటి? పత్రికలో అతని ఫోటోలు కూడా వేశారునిన్న!''

''మరి నాకు చెప్పలేదేం?''

''మీకు నేను భార్యనేగానీ, ప్రెస్‌సెక్రటరీని కాను!'' అంది మైథిలి నవ్వేస్తూ.

క్షణం ఆగి అంది మైథిలి మళ్ళీ: ''మీతోకలిపిన ఆ యాభై ఆరుసంఖ్య యాభై అయిదుకి దిగిపోతోందన్నమాట!''

గోవిందరావు తలఊపాడు-''వీళ్ళకు బుద్ధిలేదు! బుద్ధిరాదు!''

గోవిందరావు అన్నమాట రామనాథం గురించే-ఆ రామనాథం ఇంకోపావుగంటకు 'హర్ష'కు చేరుకొన్నాడు.

గోవిందరావుకు విష్‌చేసి సోఫాలో కూర్చున్నాడు-''ఈరోజు పేపరు చూశారామీరు? చూడకపోతే, అదుగో... అక్కడుంది చూడండి!'' అంటూ పేపరును రామనాథం ముందుకుతోశాడు గోవిందరావు.

రామనాథం పేపరు అందుకొన్నాడు. అక్షరంఅక్షరం కూడబలుక్కొని చదివాడు.

''ఏమిటంటారు ఇది?''

''ఇది...ఇది...'' రామనాథం మాటలు వెతుక్కుంటున్నాడు. కానీ అతని దృష్టంతా హాలులోకూర్చున్న ప్రతాపరావుమీదే ఉంది. వాడే చేసి ఉంటాడీపని! లేకపోతే పేపరుకు ఎలావెళ్తుంది ఆ వార్త? ఎవరు ఇచ్చివుంటారు ఫొటోలు??

''చెప్పండి... అక్బర్ హొటల్లో మీ సుపుత్రుడు మకాంపెట్టినమాట అబద్ధమా? అక్కడ ఎందరో సుందరాంగులతో శృంగారకేళీవిలాసాల్లో తేలింది అబద్ధమా? ఆ అమ్మాయిల్ని సరఫరాచేసిన కంపెనీలకు మీరు సాంస్కృతిక కేంద్రాలనిర్మాణం కాంట్రాక్టులు అప్పజెప్పింది అబద్ధమా? ఊ...చెప్పండి!''

రామనాథం ఏమీ అనలేదు క్షణంసేపు.

''మనం ప్రజాప్రతినిధులం. నిజానికి ఏ ప్రతిఫలమూ ఆశించకుండా సేవచెయ్యటానికి మనంతట మనమే స్వచ్ఛందంగా ఈ

రంగంలోకి వచ్చాం! ఎవ్వరూ మనల్ని బొట్టూ కాటుకపెట్టి ఇక్కడికి ఆహ్వానించలేదు. అలాటిది మనం ఎంత నీతిగా, నిజాయితీగా ఉండాలో చెప్పండి! అలా ఉండటం మనకు సాధ్యపడకపోతే, కనీసం ఉన్నట్లుగానైనా కనబడే ప్రయత్నం చెయ్యాలిగదా!?''

రామనాథం నోరువిప్పాడు నెమ్మదిగా: ''ఏదో పొరబాటు...వాడలా చెయ్యకుండా ఉండాల్సింది...''

''అలాటివాడు మీ అబ్బాయి అని తెలిసీ మీరు పార్టీయువజనవిభాగానికి అతన్ని నామినేట్‌చేయించారు! అలాచెయ్యకుండా ఉండాల్సింది''

''అసలిదంతా ఎలా బయటకు పొక్కిందో నాకు అర్థంకావటంలేదు!''

''మీరింకా పాతకాలంలోనే బతుకుతున్నట్లున్నారు! ఇపుడు పద్ధతులన్నీ మారిపోయాయి. ప్రజలు, పత్రికలు మనల్ని వెయ్యికళ్ళతో కనిపెడుతున్నాయి. ఎక్కడ ఏమాత్రం తప్పుజరిగినా,వాళ్ళాతప్పును కొండంతలు చేస్తున్నారు. నీతిని నిలబెట్టలేకపోయినా, అవినీతిని తగ్గించుకోవాలని వాళ్ళు తాపత్రయపడుతున్నారు. పైగా వాళ్ళు కూడా ఏ సాక్ష్యాధారాలు లేకుండా ఏ ఆరోపణలూ చెయ్యడంలేదు. కళ్లతో చూసినట్టు ఫొటోలు కూడా ప్రచురించారు. చూశారుగదా. వేసినవి ఇవే అయినా ఇంకా వున్నాయని రాస్తున్నాడా విలేకరి.



"ఈ ఒక్కతప్పు ఏదో మీరే... చక్రం అడ్డువే యాలి?" రామనాథం నాన్చాడు.

గోవిందరావు తల అడ్డంగా తిప్పేశాడు. "జరిగేపని కాదు. నా పేరు గోవిందరావేగానీ నా చక్రాలు, శంఖాలూ ఏవీ ప్రజలముందు పనిచెయ్యవు. నా మాట వినండి... మీరు, మీ అబ్బాయి గుంభనంగా రాజీనామా చేసెయ్యండి. ఒకటి రెండేళ్లు ఎలాగోలా కాలం గడపండి. తర్వాత సంగతి ఆ తర్వాత ఆలోచిద్దాం"

రామనాథం వులిక్కిపడ్డాడు "రాజీనామా యా... నేనా...?"

"మీరొక్కరే గాదు, మీ అబ్బాయి కూడా"

రామనాథం గుటకలు మింగాడు- "పెద్ద శిక్ష అయిపోతుందిది. పోనీ ఆ కాంట్రాక్టులు రద్దుచేసెయ్యండి. మళ్లీ టెండర్లు పిలుద్దాం. వాటిని మీరే చూద్దురుగాని... మీకు తెలీందిగాదు. మంత్రిపదవి ఒకసారి చెయ్యిజారితే మళ్లీ సంపాదించుకోగలగటం మాటలతో జరిగేపని కాదు. రాజకీయనాయకులు ఒక్కసారి కనుమరుగైతే మళ్లీ వారి గురించి ఎవ్వరికీ గుర్తుండదు. మీరీ తప్పుకు అంత శిక్ష విధించటం... ఇంకొక్కసారి ఆలోచించండి" దాదాపు ప్రాధేయపడుతూ అడిగాడు.

గోవిందరావు క్షణం ఆలోచించాడు- 'రామనాథం అంటున్నది నిజమే అయినా ఈ తప్పు చిన్నది కాదు, క్షమించగలిగేదీ కాదు. పోనీ పట్టించుకోకుండా వదిలేద్దాం అన్నా ప్రజలు దీన్ని తేలిగ్గా తీసుకొంటారన్న నమ్మకాలు లేవు.

'ఈ దేశంలో ప్రజల సంగతి చెప్పటం, వూహించటం కష్టం. వాళ్లు దేనికి ఆవేశంతో ప్రతిస్పందిస్తారో, దేన్ని ఆషామాషీగా కొట్టిపారేస్తారో తెలీదు. వేలాదిమందికి ఉపాధి కల్పించగల ఉక్కు కర్మాగారం నేలకు అరంగుళం పైకి రాకపోయినా వులకని పలకని వీళ్లు, అత్యల్పమైన విషయంమీద అలజడులు చేస్తారు. ఆందోళనలు చేస్తారు. బంద్‌లంటారు, ప్రాణత్యాగాలూ చేస్తారు. ఇలాంటి వాళ్లగురించి వూహించుకోవటం కష్టం. వాళ్ల ఆవేశాన్ని వుపేక్షించి బతకటం మరీ కష్టం. ఇంత పొలిటికల్ రిస్క్ తీసుకోవటం మంచి పద్ధతిగాదు. చివరికి తను నష్టపోయేకన్నా ముందే నిష్ఠురపడటం మంచిది'- అని నిర్ణయించుకొన్నాడు గోవిందరావు.

"మీ ఇష్టం... చెప్పవలసింది చెప్పాను. మీరు రాజీనామా చెయ్యకపోతే నేనే మిమ్మల్ని మంత్రివర్గంలోంచి తీసెయ్యవలసి వస్తుంది. అది మన ఇద్దరికీ గౌరవప్రదం కాదు" అన్నాడు ఖరాఖండిగా.

రామనాథం లేచి నిలబడ్డాడు.

అతని కళ్లల్లో నీళ్లుబుకుతున్నాయి. ఏళ్లతరబడిగా నిర్మించుకొంటూ వచ్చిన రాజకీయ ఆశాసౌధం క్షణాలమీద కళ్లముందే కుప్పకూలిపోతున్నట్లుగా అనిపించింది అతనికి.

తన ఆశలన్నిటినీ సజీవంగా సమాధి చేసిన ఆ వార్తను ఇంకొక్కసారి చూడదల్చినట్లుగా రామనాథం పత్రిక అందుకొన్నాడు. బాక్స్ అయిటంలో విలేకరి పేరు 'వాచస్పతి' అని వుండటం గుర్తుపెట్టుకొన్నాడు. పేపరు మడతపెట్టి కిందపెట్టాడు.

"రాజీనామా కాగితాన్ని పంపిస్తాను.... సెలవు!" అంటూ గోవిందరావుకు, మైథిలీకి చెరో నమస్కారం పెట్టి గదిలోంచి బయటకు వచ్చాడు రామనాథం.

దెబ్బతిన్న పులిలా వున్న రామనాథం ఆలోచనలన్నీ ఇప్పుడు వాచస్పతి మీద కేంద్రీకృతమయి వున్నాయి.

-రామనాథం వెళ్లిపోగానే మైథలి భర్త దగ్గరగా చేరి అడిగింది- "మీ కాబినెట్‌లో ఒక సీటు ఖాళీ!"

"శని విరగడయిందనుకొంటాను. వీళ్లంతా నాపాలిటి గుదిబండలే! పదవి ఇచ్చేంతవరకూ కాళ్లావేళ్లా పడతారు. ఇస్తే కన్నూ మిన్నూ కానక ప్రవర్తిస్తారు. ఇచ్చిన పదవిని వారంరోజులు కాపాడుకోవటం చేతకాదు వీళ్లకు"

"రామనాథం బదులు నన్ను తీసుకోవచ్చుగా ఆ పదవికి"

గోవిందరావు వులిక్కిపడ్డాడు, "నిన్నా?"

"నన్నే!!"

"నిన్ను తీసుకుంటే పెనంలోంచి పొయ్యిలో పడ్డట్లు అవుతుంది నా పని. ఇప్పుడు తప్పుచేసింది రామనాథం ఒక్కడే కానీ నిన్ను మంత్రిణి చేస్తే తప్పుచేసిన వాడిని నేనవుతాను" అన్నాడు గోవిందరావు. "అయినా నిన్నెలా




తీసుకొంటా, నీకిప్పుడు శాసనసభ్యత్వం కూడా లేదు'' అంటూ నవ్వాడు.

మైథిలికి ఒళ్లు మండింది. ''ఏమిటి నాకు రూల్స్ చెప్తారు- ఇదేమైనా గవర్నమెంటు ఉద్యోగమా? గ్రాడ్యుయేట్ అయివుండాలి, ఇంత చదువు, ఇంత అనుభవం వుండాలి, ఇంత వయస్సు మించి వుండకూడదు అంటూ రూల్స్ వుండటానికి. ఈ దేశంలో అలాంటి రూల్స్ లేనివి మినిస్టర్ల పదవులకే నని అందరికీ తెలుసు. నిశానీవద్దుగాళ్లు, కాటికి కాళ్లు చాచిన ముసలిపీనుగులకు కూడా మంత్రి అయ్యే అర్హత వుంటుంది ఈ దేశంలో!''

గోవిందరావు నవ్వేశాడు- ''నిజమేనుమా! మరి అంత పనికిరాని పదవి నీ కెందుకు చెప్పు- తెలివితేటలున్నదానివి, పరోక్షంగానే వుండి చక్రం తిప్పు, నీకూ, నాకూ మంచిది''

మైథిలి ఏమీ అనలేదు. గోవిందరావు ఆమె కేసి చూడలేదుగానీ, చూసివుంటే తన మాటలు ఆమెకు నచ్చలేదన్న సంగతిని అర్థంచేసుకొని వుండేవాడు.




వాచస్పతి భోజనంచేసి చేతులు కడుక్కొని, ఒంటిమీది తువ్వాలుతో చేతులు తుడుచుకొంటూ లేచాడు. లేస్తూనే గోడగడియారంకేసి చూశాడు. వార్తలువచ్చేటైమయిందని చెప్తోంది ఆ గడియారం. వెళ్ళి రేడియో ఆన్‌చేశాడు.

ఢిల్లీ నుంచి వస్తున్న వార్తలు అప్పుడే ప్రారంభం అయినాయి. అక్కడెక్కడో గల్ఫ్‌లో ఆరేడేళ్ళుగా జరుగుతున్న యుద్ధం ఆపేందుకు జరుగుతున్న శాంతి ప్రయత్నాల గురించి చెప్పారు. అటుతర్వాత 'సాంస్కృతిక శాఖమంత్రి పదవికి శ్రీ రామనాథం, రాష్ట్రపార్టీ యువజన విభాగం అధ్యక్ష పదవికి శ్రీ రమేష్ కుమార్ రాజీనామాలు చేశారు' అని చెప్పారు.

వాచస్పతి నివ్వెరపోయాడు - అప్పుడే అంత త్వరగా తను రాసిన వార్తకు తండ్రీకొడుకులు ఇలా రాజీనామాలు చెయ్యటం వరకు వచ్చిందంటే అతనికి నమ్మబుద్ధికాలేదు.

అయినా నిజం అది! నిజాలు ఒక్కోసారి కల్పనలకన్నా చిత్రంగా ఉంటాయంటారు. ఇది తను కల్పన చేసుకోగలిగిందే అయినా చిత్రంగానే ఉంది తనకు!

-చాలారోజులకు వృత్తిపరంగా ఏదో సాధించగలిగానన్న తృప్తి వాచస్పతిలో నిండింది ఆరోజు. అయితే తన వెనక నిలబడ్డ ఆ అజ్ఞాతవ్యక్తి ఎవరో తనకు తెలీదు. ఒక్కసారి ఆ వ్యక్తికి కృతజ్ఞతలు చెప్పుకోగలిగితే బాగుంటుందనిపించింది.

మర్నాడు ఆఫీసుకు వెళ్ళేసరికి, అందరూ వాచస్పతికి అభినందనలు తెలిపారు. నవ్వుతూ వాటిని అందుకొన్నాడు వాచస్పతి. అసలు ఈ అభినందనలన్నీ తనకు కాదు. ఆ ఫోటోలు పంపించిన ఆ వ్యక్తికి దక్కాల్సినవి! ఎందుకో తనకందుతున్నాయి. టెలిఫోన్ మోగింది.

ఎత్తితే ''మీకోసం సియంగారి ఫోన్వచ్చింది. మీరెప్పుడొచ్చినా ఫోన్ చెయ్యమన్నారు'' అని చెప్పాడు ఆపరేటర్.

వాచస్పతి వెంటనే గోవిందరావుకు ఫోన్‌చేశాడు - ఆయన కూడా తన అభినందనలు తెలిపాడు. ''పత్రికలు ఇంత జాగ్రత్తగా ఉంటే తప్ప ప్రజాస్వామ్యం నిలవదు. ఈ దేశంలో ప్రజాస్వామ్యాన్ని, నీతిని, నియమాల్ని కాపాడుకోవాల్సింది పత్రికలు మాత్రమే! అవినీతిపరుల్ని ఏరిపారేసేందుకు నేనెప్పుడూ సిద్ధమే! మీరూ నాకు సాయంచేస్తే, రాష్ట్ర ప్రజలకు మరింత సేవచేయగలను'' అన్నాడు గోవిందరావు.

-ఆ మాటలు ఎక్కడ నుంచి వచ్చినా అభినందనీయమే- అనుకొన్నాడు వాచస్పతి.

లేచి లైబ్రరీకి వెళ్లాడు. పాతకాలంనాటి ఫైళ్లన్నీ ఒక్కోటి తీసి నెమ్మదిగా చదువుతూ, అవసరమైన నోట్స్ తయారుచేసుకొంటూ కూర్చున్నాడు.

చీకటి పడింది. లైబ్రరీ ఇన్‌ఛార్జీ వచ్చింది

– "మీరింకా కూర్చుంటానంటే తాళాలు ఇచ్చి వెడతాను. కింద సెక్యూరిటీలో ఇచ్చేద్దురు గాని!"

వాచస్పతి తల ఊపి "అలాగే" అన్నాడు.

ఆవిడ వెళ్లిపోయింది. వాచస్పతి కూడా మరికాసేపట్లో లేచి తాళం వేసి టీకోసం కాంటీన్‌లోకి నడిచాడు.

అందరూ తనను చూసి ఏదో అనుకొంటున్న ఫీలింగ్. అనుకోకుండా ఒక్కసారిగా హీరో అయిపోయాడు తను. ఈ గౌరవం కొద్దికాలమన్నా మిగుల్చుకోవాలంటే తను ఇంకా జాగ్రత్తగా ఉండాలి అనుకొని రెట్టింపు ఉత్సాహంతో, ఆవేశంతో వాచస్పతి మళ్ళీ లైబ్రరీలో దూరాడు.

- రాత్రి పదకొండయింది.

రోజంతా పనిచేసిన అలసట అతన్ని విశ్రాంతి తీసుకోమంటోంది. వాచస్పతి లేచాడు. రాసుకొన్న నోట్సంతా జాగ్రత్తగా సర్దుకున్నాడు. లైబ్రరీకి తాళంవేసి కిందకు దిగి, తాళాలు సెక్యూరిటీలో ఇచ్చేశాడు.

నెమ్మదిగా వెళ్లి స్కూటర్ తీశాడు. ముందు చక్రంలో గాలిపోయింది. అప్పుడంలా అణిగిపోయి ఉందా చక్రం. స్కూటర్‌కు స్టాండ్‌వేసి, వాచస్పతి ఇంటివైపు నడక ఆరంభించాడు.

మలుపు తిరిగి, ఇంటికి వెళ్లాల్సినదారిలో నడుస్తున్న వాచస్పతికి ఎందుకో తననెవరో అనుసరిస్తున్న భావం కలిగింది. వెనక ఎవరో ముగ్గురు నలుగురు నెమ్మదిగా నడుస్తున్నారు. ఎందుకో వాచస్పతికి మనసులో కీడు మెదిలినట్లయింది. వెంటనే నడకలో వేగం పెంచాడు. అదో లైట్లు వెలగని చీకటి మలుపు.

కానీ – అప్పటికే ఆలస్యం అయిపోయింది. వాళ్ళూ ఇంకొంచెం వేగంగా వచ్చి వాచస్పతి ముఖంలోకి బాటరీవేసి చూశారు. అతను వాచస్పతే అన్నది నిర్ధారించుకున్న మరుక్షణంలో వారిలో ఒకడు చేతిలోని కర్రెత్తాడు.

ఆ తర్వాత - నలుగురూ నాలుగు రకాలుగా కొట్టారు. ఒక్కో దెబ్బ పడుతోంటే అతనికి దిమ్మదిరిగిపోతున్నట్లయింది. ఎక్కడెక్కడో ఆయువుపట్లు చూసి మరీ చావగొడుతున్నట్లు అనిపించింది వాచస్పతికి.

గట్టిగా అరవాలనిపించింది. నోరు పెగలలేదు. గొంతెత్తి ఎవరినైనా పిలవాలనిపించింది. కానీ, గొంతు ఎండిపోయింది.

- వాచస్పతి బాగా దెబ్బలు తిన్నాడని నిర్ధారించుకొన్నాక వాళ్ళు ఏమీ జరగనట్లు నిదానంగా వెళ్లిపోయారు.

- కొన్నిక్షణాల తర్వాత వాచస్పతికి స్పృహ తప్పిపోయింది.

–వాచస్పతి కళ్లుతెరిచి చూసేసరికి, అప్పటికే గడియారంలో చిన్నముల్లు ఒకసారి పూర్తిగా తిరిగి, రెండోసారి తన భ్రమణాన్ని పూర్తిచెయ్యటానికి మరికొద్ది వ్యవధిలోకి వచ్చింది.

చుట్టూ ఉన్న ఆస్పత్రి వాతావరణం అయిదోవార్డని తెలియజేస్తోంది.

వాచస్పతికి-అప్పుడు పక్కనే కూర్చుని ఉన్న భార్య శారద కనిపించింది.

చిన్నగా నవ్వే ప్రయత్నం చేశాడు వాచస్పతి.

శారద ఆప్యాయంగా అతని నుదుటిమీద చెయ్యివేసింది. ఆమె కళ్లలో నుడులు తిరుగుతున్న నీళ్లు.

"ఏం ఫర్వాలేదు... కంగారుపడకు!" అన్నాడు వాచస్పతి నెమ్మదిగా మాటలు పేర్చుకొంటూ.

అందరూ అదే మాట- ఏమీ కంగారుపడొద్దని. శారదకు అంత బాధలోనూ నవ్వొచ్చింది. కానీ కంగారుపడకుండా ఉండగలిగే స్థితా అది? ఆ రోడ్డు మీద ఆరేడేళ్లుగా తిరుగుతున్నా ఏమీకాలేదు, అలాటిది నిన్న రాత్రి అలా జరిగిందీ అంటే... ఎవరో కక్షతో జరిపించిందే ఇది అన్న సంగతి వేరే చెప్పనక్కర్లేదు!!

–భర్త సంగతి తనకు తెలీనిదికాదు. తన వృత్తి జీవితంలో ఎవర్నీ కలగజేసుకోనివ్వని తత్వం అతనిది! అందుకే ఎన్నిగంటలకు వచ్చినా, ఎన్నిగంటలకు వెళ్లినా-- అతని ధోరణి అతనిదేనని ఏమీ పట్టించుకోకుండా ఉండిపోవటం అలవాటు చేసుకొంది శారద. అయినా– నిన్న మంత్రిగారి రాజీనామా, ఈరోజు ఆస్పత్రి బెడ్‌మీద భర్త-

ఒకటీ ఒకటీ కలిపితే రెండే అవుతాయి.

కానీ... ఆ సంగతి అందరికీ అర్థమైనా, దాన్ని రుజువు చెయ్యటం కష్టం.

దొంగ దెబ్బతీస్తే కానుకోవటం కష్టమవు




తుంది ఎలాటివారికైనా!

—శారద ఏమీ అనకపోవటంతో వాచస్పతి ఆమె చెయ్యిమీద చెయ్యివేశాడు.

"కంగారుపడొద్దు... ఇలాటివి పట్టించుకోకూడదు!" అన్నట్లుగా నవ్వుతూ చూశాడు.

శారద చిన్నగా నవ్వే ప్రయత్నం చేసింది. కానీ... ఆ ప్రయత్నం ఆమె పెదాల దగ్గరే విఫలమయింది. "నాకెందుకో భయంగా ఉందండీ!" అంది మాటలు పేర్చుకొంటూ.

వాచస్పతి అడ్డంగా తల ఊపాడు. అదంతా అర్థంలేని భయం అన్నట్లుగా.

భర్త పరిస్థితి బాగోలేదని తెలిసినా, శారద ఊరుకోలేకపోయింది. అలాటి సమయాల్లో చర్చించవలసిన విషయం కాకపోయినా, దాన్ని ప్రస్తావించకుండా ఊరుకోలేకపోయింది. "రోజంతా ఏదో పనంటూ మీరు ఇంటికి దూరంగా గడుపుతారు! ఇంట్లో ఉండేది నేనొక్కదాన్నే! నా ప్రాణాలు రేపటి నుంచి అరిచేతిలో ఉంటాయి! మీరు నా మాట వినండి- ఇలాటి ఇబ్బందికరమైన వార్తల గురించి చూసీ చూడనట్లు ఊరుకోండి! ఈ ఒక్కసారికే ఏదో జరిగిపోయింది. మీరిలా మంచంమీద ఉండటం చూస్తోంటే నా కడుపు తరుక్కుపోతోంది! ఎంత డ్యూటీ అయినా ప్రాణాలకు మించి కాదు గదా!!" అతనిలో పిరికితనాన్ని నింపే ప్రయత్నం చేస్తున్నానని తెలియదు ఆమెకు.

వాచస్పతి భార్య చెప్పేదంతా వింటూ కళ్లు మూసుకుకూర్చున్నాడుగానీ ఏమీ జవాబివ్వలేదు. ఎవరు కొట్టారో తనకు తెలీదు. కానీ ఎవరు కొట్టించారో తెలుసు. దొంగచాటున దెబ్బతీయటం రాజకీయ నాయకుల్లో ఉండే ప్రథమ లక్షణం. అది తెలిసీ బెదిరిపోతే ఎలా?? వాళ్ల ధ్యేయం కూడా తనలో, తన కుటుంబ సభ్యుల్లో భయాన్ని నింపటం! తను ఇపుడు బెదిరిపోతే వాళ్లు తమ లక్ష్యాన్ని నెరవేర్చుకొన్నట్లే అవుతుంది! తను వాళ్లకు ఆ అవకాశం ఇవ్వడు! అంతేకాదు అవకాశం వస్తే ఈ దేశంలోని ప్రతి కుహనారాజకీయనాయకుడినీ నగ్నంగా నిలబెడతాడు! వాళ్ల జీవితాల్లోని చీకటికోణాల్ని వెతికి బహిర్గతం చేస్తాడు! రాబోయే రాజకీయనాయకుల తరం ఇప్పటితరానికి భిన్నంగా, నిజంగా దేశానికి మార్గదర్శకులుగా ఉండేలా చూస్తాడు. ఇది అంత తేలికైన పనికాదు, ఒకరు చెయ్యగలిగిన పనీకాదు. అయినా ఎవరో ఒకరు ఈ పనికి శ్రీకారం చుట్టాల్సి ఉంది. తను చేస్తాడు ఆ పని! అవసరమైతే ఆ పనిలో తను ప్రాణాల్ని కోల్పోవాల్సి వచ్చినాసరే...

'నేను చనిపోతే నా రక్తం ఆఖరి బొట్టులోంచి కూడా విప్లవవీరులు ఉద్భవిస్తారు. ఈ దేశాన్ని స్వర్గంగా మార్చే ఉద్యమం చేపడతారు'- ఎవరో రాసిన కవిత గుర్తొచ్చింది వాచస్పతికి.

—వారంరోజులకుగానీ వాచస్పతి కోలుకోలేకపోయాడు. ఈ వారం రోజులలోనూ ఆస్పత్రిలో అందరూ బాగా పరిచయం అయ్యారు. ఒక మంత్రిగారి రాజీనామాకు కారణమయిన పత్రికా విలేకరిగా అందరూ అతని పట్ల ఆదరం చూపిస్తున్నారు, గౌరవంగా మసలుకొంటున్నారు

వాచస్పతి కూడా అక్కడ ఉన్న ఆ కాలం వృధాగా పోనివ్వలేదు. ఆస్పత్రులలో డాక్టర్ల నిర్లక్ష్యం, నర్సులు కొందరిలో ఉండే సేవాభావం, ఆయాలు, వార్డ్ బాయ్‌లలో ఉండే లంచగొండితనం గురించి తన దృష్టిలోకి వచ్చినవన్నీ అవగతం చేసుకొన్నాడు. మరింత సమాచారం సేకరించి ఫీచర్ రాయాలని నిర్ణయించుకొన్నాడు.

వాచస్పతి ఆ రోజే ఆస్పత్రి నుంచి డిస్చార్జ్ కావాల్సి ఉంది. డాక్టర్ పర్మిషన్ అడిగేందుకు వెళ్లాడు వాచస్పతి.

అవుట్‌పేషంట్ వార్డు అంతా సందడిగా ఉంది. నాలుగైదు బల్లల మీద జనం కూర్చుని ఉన్నారు. ఎవరి బాధలు వారివే అన్నట్లు ఎవరి గొడవల్లో వారు ఉన్నారు అక్కడ. ఒక్కో పేషంటూ రిజిస్టర్ చేయించుకొని, తమకు కావాల్సిన చికిత్స కోసం ఆయా డాక్టర్ల దగ్గరకు వెళ్తున్నారు.

'వీళ్లంతా డాక్టర్ల దగ్గరకు వెళ్లగానే 'దణ్ణం పెడతాం! ఎలాగైనా రక్షించండి!' అని వేడుకొంటారు. జబ్బు తగ్గాక వీళ్లలో ఏ ఒక్కరిని పలకరించినా, ఎవ్వరూ ఆ డాక్టర్ గురించి నాలుగు మంచి ముక్కలు చెప్పరు!' అనుకొన్నాడు వాచస్పతి.

అంతలో—

ఆస్పత్రి గేటులోంచి లోపలికి దూసుకొ

చ్చింది ఓ కారు. బానెట్‌మీద జెండా. కారు నంబర్‌ప్లేట్‌మీద 'ప్రభుత్వవాహనం' అన్న అక్షరాలు, కారు దూసుకు వచ్చిన తీరు చూస్తొంటే అందులోని వ్యక్తికి అధికారం కూడా తక్కువ కాదన్నది అర్థం అవుతోంది.

కారు మెట్లముందు ఆగింది.

కార్లోంచి ఓ చప్రాసీ దిగి పరుగులాటి నడకతో మెట్లు ఎక్కాడు. తిన్నగా డాక్టర్‌గారి గదిలోకి వెళ్లబోతూ వార్డ్‌బాయ్ కనిపిస్తే-

"ఓ.పి. ఇన్‌ఛార్జ్ ఎవరండీ?" అనడిగాడు ఆ చప్రాసీ.

"అదిగో!" అంటూ వార్డ్‌బాయ్ ఇన్‌ఛార్జ్ డాక్టర్‌గది చూపించాడు. వార్డ్‌బాయ్ చూపించిన వైపు పరుగుతీశాడు చప్రాసీ.

"రండి సార్... మిమ్మల్ని పిలుస్తున్నారు, అయ్యగారు!" అన్నాడు ఆ చప్రాసీ.

"ఎవరా అయ్యగారు?" ఇలాటివి చాలా చూశాం అన్న లెక్కలో అడిగాడు ఆ డాక్టర్.

"మినిస్టర్‌గారండీ... హెల్త్‌మినిస్టర్‌గారు!!"

-ఆ మాటతో ఒక్కసారిగా ఆస్పత్రి అంతా బద్ధకాన్ని వదిలించుకొంది. ఎవరికి వారు ఎక్కడికక్కడ ఎలర్ట్ అయిపోయారు. మినిస్టర్‌గారు సర్‌ప్రైజ్ విజిట్‌కు వచ్చారని ఆస్పత్రంతా హడలిపోసాగింది.

అయితే ఆయన వచ్చినపని అదికాదని రెండు నిమిషాలలోనే అందరికీ తెలిసిపోయింది.

చప్రాసీ 'మినిస్టర్'గారి రాకను ప్రకటించగానే డాక్టర్‌గారు వెంటనే లేచారు. మెట్లుదిగి సాదరంగా ఆయనకు స్వాగతం చెప్పేందుకు సిద్ధమయ్యాడు.

కార్లోకి వంగిచూసి- "నమస్తే సార్!" అన్నారు డాక్టరు.

"అర్జంట్‌గా ట్రీట్‌మెంట్‌కు ఎరేంజ్‌చెయ్యండి!" అన్నారు మినిస్టర్‌గారు.

"ఏమయిందిసార్?" డాక్టర్‌గారి ప్రశ్నలో ఆందోళన.

"ఏదో ఊరకుక్క కరిచింది! సాధారణంగా గేట్‌వేసే ఉంచుతాం గదా! అయినా ఎలా వచ్చిందో ఏమో, ఆ కుక్క ఏకంగా లోపలికి చొరపడి కరిచేసింది!"

ఎంతమాట, అనుకొన్నాడు డాక్టరు. ఒక్కసారి ఆయన కళ్లముందు మంత్రిగారి భవనం కదలాడింది. అన్నివైపులా పెద్దపెద్ద గోడలుండే భవంతి అది. దానికి ముందు ఎత్తయిన ఇనపగేట్లు రెండు. ఆ రెంటినీ కాపలాకాస్తున్నట్లుగా పోలీస్ గార్డ్స్- ఇంతటి అట్టహాసాన్ని, భద్రతా ఏర్పాట్లను తప్పించుకొని ఆ వీధికుక్క వెళ్లి ఏకంగా మంత్రిగార్ని కరిచెయ్యటం ఏమిటి??

-డాక్టర్ ఒక్కసారి ఆలోచనల్ని విదిలించుకొన్నాడు.

"రండిసార్, లోపలికి వస్తే..." సావకాశంగా చూద్దాం అనబోయాడు డాక్టర్.

"లోపలికి ఎందుకు? మీరు చూడండి!" అంటూ డోర్ పూర్తిగా తెరిచారు మినిస్టర్.

కార్లో- ఆ సీట్లో- ఓ లేడిపిల్ల పడుకొని ఉంది సావకాశంగా, సాధికారికంగా.

డాక్టర్ నివ్వెరపోయాడు- "కుక్క కరిచింది దీనికా?"

"అవును... దానికే! దీనిపేరు భారత్! దేశంపట్ల నాకున్న అభిమానానికి గుర్తుగా పెట్టుకున్న పేరది! ఇది లాన్‌లో తిరుగుతుంటే కుక్క కరిచింది! వెంటనే ట్రీట్‌మెంట్‌కు ఏర్పాటు చెయ్యండి!"

డాక్టరుకు నవ్వొచ్చింది. వస్తున్న నవ్వును బయటపెట్టటం ఆక్షణంలో అనారోగ్య హేతువు అన్నసంగతి ఆ డాక్టర్‌కు తెలుసు. అందుకే నవ్వును బలవంతాన నొక్కిపెట్టుకొని అన్నాడు- "సారీ సర్... ఇక్కడ జరగదాపని! మీరు దాన్ని వెటర్నరీ హాస్పిటల్‌కు తీసుకెళ్లాల్సి ఉంటుంది."

"అంటే- మీరు ట్రీట్ చెయ్యరా దీనినే?"

"కుదరదండి, ఇది సివిల్ హాస్పిటల్. ఇక్కడ మనుషులకే తప్ప ఇంకెవరికీ చికిత్సకు అవకాశం లేదండీ!"

మినిస్టర్‌గారికి కోపం పెరుగుతున్న సంగతి అక్కడున్న అందరికీ అర్థమవుతోంది- "అంటే... ఏంటయ్యా నువ్వనేది? ఆస్పత్రి ఉన్నది ఎందుకయ్యా? మందులు ఇచ్చేందుకే గదా!"

"ఇక్కడున్న మందులు మనుషుల కోసం!

ఈ జంతువుల కోసం కాదండి! వాటిని మీ రు..."

"చాల్చాలేవయ్యా! చెప్పొచ్చావ్! మనుమలకన్నా ఈ జంతువులు ఎందులో తీసిపోయాయ్! ఒక విధంగా చూస్తే మనుమలకన్నా ఇవే నయమేమో!" అన్నారు మినిస్టర్.

వాచస్పతి అంతా వింటూ కూర్చున్నాడు. అక్కడి పరిస్థితి చూస్తోంటే... ఒక్క అక్కడిది అనేంఖర్మ. అసలు ఈదేశం పరిస్థితి చూస్తొంటేనే అతనికి మతిపోతోంది!- లేకపోతే ఏమిటిది, సివిల్ హాస్పిటల్‌కు వచ్చి ఈ దబాయింపు ఏమిటి? ఈ గొడవ ఏమిటి? మంత్రులకు స్వతహాగా అన్నీ తెలిసి ఉండాల్సిన పనిలేదు. కానీ తెలియజెప్తేనయినా తెలుసుకోవాల్సిన బాధ్యత ఉందిగదా, వారి మీద అచ్చం అక్షరమ్ముక్క రాని అమాయకుల్లాగ ప్రవర్తిస్తున్నారేమిటీ మంత్రిగారు! అని ఆశ్చర్యపోయాడతను.

"సారీసర్... మీరు ఏమైనా చెప్పండి! ఇక్కడ లేళ్లకు, జింకలకు ట్రీట్‌మెంట్ చెయ్యటం కుదరదండి! అది రూల్స్‌కు వ్యతిరేకం! అసలు వాటికి వాడే మందులు వేరు, ఇక్కడవి ఉండవు!" నచ్చచెప్తున్న ధోరణిలో చెప్తున్నా ఖచ్చితంగా చెప్తున్నాడు డాక్టర్.

"అవన్నీ నాకు అనవసరం! ఈ లేడికి ఏమన్నా జరగాలి మీ ఒక్కొక్కళ్ల అంతు చూస్తాను! ఆఫ్టరాల్, ఒక లేడికి మందివ్వలేని మీరేం డాక్టర్లు... చూస్తాను, మీ పొగరు అణిగేలా చేస్తాను..." చిందులు తొక్కుతున్నాడు ఆ హెల్త్ మినిస్టర్.

ఈ దేశంలో మంత్రులకు చదువుసంధ్యలు రాకపోవటమే గాదు, వీరికి నలుగురిలో మర్యాదగా ప్రవర్తించడమూ రాదు. విధి నిర్వహణలో ఉన్న డాక్టరు... డాక్టరే కానవసరం లేదు. ఏ ప్రభుత్వోద్యోగినైనా ఏమైనా అనటం, బెదిరించటం చట్టరీత్యా నేరం... ఆ సంగతి ఈ క్షణంలో ఆ మంత్రిగారికి గుర్తు చెయ్యటంకూడా దండగే అనుకొన్నాడు వాచస్పతి.

-అరగంట గడిచింది ఈ డ్రామా ఆరంభమయి. అర్థంపర్థం లేని వాదనతో అక్కడ ఓ సాన్యనన్నివేశాన్ని సృష్టిస్తున్నాడా మంత్రి.




మంత్రి ఒక్కొసారి బరస్ట్ అవుతున్నకొద్దీ- అక్కడి డాక్టర్లు అంతగా హర్ట్ అవుతున్నారు.

చివరకు ఎలా వెళ్ళిందో ఈ వార్త మంత్రిగారి పియ్యేకు చేరింది. ఆయన ఆదరాబాదరాగా ఆస్పత్రికి చేరుకొన్నాడు. కోపంలో ఉన్న మంత్రిగారికి దగ్గరగా చేరి నెమ్మదిగా చెవిలో చెప్పాడు ఏదో-

పియ్యే వచ్చిన అయిదు నిమిషాలకు మంత్రిగారి కోపం తగ్గింది- అయినా అక్కడి డాక్టర్లందర్నీ వెంటనే సస్పెండ్ చేయించి తీరతానంటూ ఆ మంత్రి శపథంచేసి మరీ కదిలాడు.

ఓపీ ఇన్‌ఛార్జ్ డాక్టర్ దీర్ఘంగా నిట్టూర్పుకొన్నాడు.

"ఈ ఫూల్స్‌కు మేం చెప్తే అర్థంకాదు, వాళ్లకు స్వతహాగా తెలీదు!... ఈ దేశానికి పట్టిన జాడ్యం ఏదైనా ఉంటే, ఇదిగో, అది పొలిటీషియన్సే! వీళ్లకోరలు పీకేసి మూలకూర్చోబెడితేగానీ ఈదేశం బాగుపడదు!" అంటూ తనకుర్చీలో కూలబడ్డాడు.

వాచస్పతి డిస్చార్జ్ మెమో తీసుకొన్నాడు. తిన్నగా ఇంటికొచ్చి, ఆస్పత్రిలో మంత్రిగారి వీరంగం గురించి రిపోర్ట్ రాసి పత్రికకు పంపాడు.

మర్నాటి పత్రికలో అది ప్రత్యేక వార్తగా వెలువడుతుంది.

★ ★ ★

గోవిందరావుకు ఆ వార్త చదువుతుంటేనే కంపరంగా అనిపించింది. వీళ్ళు తెలిసి చేస్తున్నారో, తెలియక చేస్తున్నారో కూడా అర్థంకాలేదు ఆయనకు. మనిషి తనకుతాను గోతులెందుకు తవ్వుకొంటాడో, ఆ క్షణంలో నెత్తిమీద నాట్యం ఆడుతున్న శనిని ఎందుకు వాళ్ళు గ్రహించలేరో ఆయన ఊహించుకోలేకపోయాడు.

వెంటనే ఫోన్‌చేసి ఆ మంత్రిని పిలిపించాడు గోవిందరావు. "ఏమిటండీ ఇది?" అని సూటిగా ప్రశ్నించాడు.

ఆ మంత్రిపేరు వరహాలరావు. ఎప్పుడో శతాబ్దాలక్రితం జమీందార్లట వారివంశంవారు! అప్పుడు తాగిన నేతులవాసనలు ఇప్పటికీ తనలో ఉన్నాయంటాడాయన. ఎటొచ్చీ ఆనాటి నేతులు ఇప్పటికి ఉంటే, అవి ఎంత వాసనకొ

డతాయో, ఈయన గుణగణాలూ అంతే! ఆ రోజుల్లో వారివంశం అన్నివిధాల సద్వంశమే అయివుండి, ప్రజలందరి అభిమానం, మన్ననలూ పొందే ఉండొచ్చు. కానీ నేడు...

ముఖ్యమంత్రి తన్ను పిలిపించి ఇలా సంజాయిషీ అడగటం చిన్నతనంగా అనిపించిందాయనకు. "ఏంటండీ.... ఏంటి? పిల్చి అడిగేంత ఏముంది ఇందులో! కుక్క కరిచింది, మందెయ్యండి అని అడిగా! ఎటొచ్చీ ఆ కుక్క కరిచింది మా లేడీని... అంతే తేడా! నాకే కుక్క కరిచిందనుకోండి, ఆ డాక్టరు మందు వేసే వాడేగదా. మరి అదే మందు మా లేడికి వేస్తే సరిపోయేదిగదా! అదే సూది దానికి పొడిస్తే సరిపోయేదిగదా!!"

మూర్ఖత్వానికి అది పరాకాష్టగా అనిపించింది గోవిందరావుకు- అమాయకులకు తెలీదు, చెప్తే అర్థంచేసుకొంటారు. గడుసరి జనం చెప్పకుండానే అర్థంచేసుకోగలరు, ఇలాటి మూర్ఖులు...చెప్పినా తెలుసుకోలేరు, ప్రాణంమీదకు వస్తోందని తెలిసినా గ్రహించుకోలేరు.

ఇంక అతనితో మాట్లాడటం దండగనిపించి- "ఇంకెప్పుడూ ఇలా ప్రవర్తించకండి! మీకు ఏదైనా చెయ్యాలనిపిస్తే మీ పియ్యేను అడగండి. అతను గీచింది గీత అనుకోండి! దాన్ని దాటడం మీకే శ్రేయస్కరంకాదని గుర్తుంచుకోండి!" అంటూ హెచ్చరించి వరహాలరాజును పంపేశాడు.

వరహాలరాజు వెళ్లగానే ఆ గదిలోకి వచ్చింది మైథిలి.

"చిన్నతనంలో నేను చదువుకొన్న కథలు గుర్తుకొస్తున్నాయి నాకు!" అంది నవ్వుతూ.

"ఏమిటవి?"

"పరమానందయ్య కథలని ఒకరకం, సుందోపసుందులని ఇంకోరకం.... మీకేది నచ్చితే అదే పేరుపెట్టుకోండి ఈ ప్రహసనాలకు!"

గోవిందరావుకు ఆ మాటలు ఈటెల్లా గుచ్చుకున్నాయి. నవ్వుతూనే శూలాలతో పొడుస్తోంది మైథిలి.

క్షణం ఆగి అన్నాడు- "అతన్ని అంటు స్నావ్ అని నాకు తెలుసు! కానీ నీదిమాత్రం అలాటి మొండి పట్టుదలకాదూ? మంత్రిపదవి కావాలన్న పట్టుదల నీకుమాత్రంలేదూ? నీకున్న పట్టుదలలాటిదే అతనిదీను. ఏ హాస్పిటల్ అయితేనేం మందివ్వటానికి అన్నది అతని పద్ధతి!"

"హు... గొప్పపట్టుదలే! తెలివితక్కువతనం శాఖకు తానే మంత్రినన్న సంగతి అన్ని చోట్లా నిరూపించుకొంటున్న ఆయనకీ, నాకూ పోలిక ఏమిటి? నాది నికార్సయిన పట్టుదల. ఏది కావాలో, దాన్ని సాధించుకోవటం ఎలాగో అన్నీ తెలిసిన దాన్ని నేను! ఏ కోణంలోంచి చూసినా మీ పేకముక్కల యాభై ఇద్దరు జోకర్లకన్నా నేను నయం... గొప్పదాన్ని! ఆ విషయాన్ని మీరు కూడా ఒప్పుకునే రోజు రానేవస్తుంది" అంది మైథిలి.

గోవిందరావు నవ్వేశాడు- "చూద్దాం... ఆ రోజురానీ!" అన్నాడు.

పైకి డాంబికంగా అలా అన్నాడు కానీ అనుకొన్నది సాధించుకోగల దిట్ట మైథిలి అన్న సంగతి అతనికి తెలీందిగాదు. అయినా నవ్వుతూ అడిగాడు- "ఈ పవిత్ర భారతదేశంలో పుట్టావు నువ్వు! కానీ భారత మహిళకు ఉండాల్సిన ఆదర్శ లక్షణాలులేవు! కారణం ఏమిటి?"

మైథిలి నవ్వేసింది -- "ఏలక్షణంలేదు నాలో చెప్పండి.. చూద్దాం!"

"చెప్పాలంటే ఎన్నో ఉన్నాయి, కానీ మచ్చుకు ఒక్కటి చెప్తాను - ఈ దేశంలో మహిళకు తనకన్నా భర్త సుఖసౌఖ్యాలు ముఖ్యం. అతని గౌరవ ప్రతిష్టలు ముఖ్యం. అతని కోసం ఏంచెయ్యమన్నా చేస్తుంది ఈ దేశంలో స్త్రీ. కానీ నువ్వు... నువ్వు దానికి పూర్తి విరుద్ధం! నీకు భర్త గౌరవంకన్నా మంత్రిపదవి మిన్న!" గోవిందరావు సూటిగా అన్నాడు.

మైథిలి నవ్వింది - "నిజమే... ఈ ఒక్క విషయంలో మీ అంచనాలు, ఊహలూ, ఉద్దేశాలూ అన్నీ నిజం. నాకు రాజకీయాల్లో రాణించాలని ఉంది. రాణిని కావాలని ఉంది - రాజుగారి భార్యగా కాదు, ఏకచ్ఛత్రాధిపత్యం వహించే రాణిగా బతకాలని ఉంది. అలాటి ఉద్దేశం ఉండటం తప్పని నేను అనుకోను. ఆ ఉద్దేశ సాఫల్యానికి నేను అనునిత్యం శ్రమి

స్తూనే ఉంటాను. నా శ్రమకు తగ్గ ఫలితం లభించి తీరుతుందనే నానమ్మకం కూడానూ! మీరడగలేదుగానీ మీకు చెప్పాల్సిన సలహా కూడా ఒకటుంది నాదగ్గర - మీ శిష్యపరమాణు వుల్లో పనికొచ్చే ఘటం ఒకటి కూడా లేదు. వాళ్లవల్ల మీకు అపకీర్తేతప్ప కలిగే లాభం ఏదీ ఉండదు. గుది బండల్లాటి యాభైమంది మంత్రులు ఉండటంకన్నా చాకుల్లాటి మంత్రులు పదిమంది ఉంటేచాలు - అది మీకు గౌరవప్రదం, రాష్ట్రానికీ శ్రేయస్కరం!''

''రాష్ట్రంలో నిన్ను మించిన మంత్రి కాగల వ్యక్తి ఇంకొకరెవ్వరూ లేరని నీ అభిప్రాయం!''

''అభిప్రాయం కాదు... అది నిజం!''

''అయి వుండొచ్చు! అయినాసరే యాభై గుదిబండలతో నేను ఏడాది ఈ గద్దెమీద ఉండగలను కానీ.... భార్యకు కూడా మంత్రి పదవి వంచానన్న పేరుతో వారంరోజులు కూడా పదవిలో ఉండలేను. అందుకే..... ఆఖరిసారి చెప్తున్నా- నువ్వో, నేనో మన ఇద్దరిలో ఎవరో ఒకరే మంత్రిగా ఉండటం సాధ్యపడు తుంది తప్ప- ఇద్దరమూ ఒకేసారి మంత్రు లుగా ఉండటం జరగదు!''

మైథిలి చిరునవ్వుతో అంది- ''పోనీండి... అవసరమైతే అదే జరగనీయండి!'' అనే సింది.

గోవిందరావు ఉలిక్కిపడ్డాడు- ''అంటే, నువ్వు మంత్రిని కావాలని, నా పదవికి ఎసరుపెడతావా, ఏం?''

''యుద్ధంలో, ప్రేమలో అధర్మం ఏదీలేదని ఒక సామెత. దానికి రాజకీయాల్ని కూడా కలపండి! నేను గద్దె ఎక్కాలంటే, మీరు దిగటం ఒక్కటే మార్గమైతే, ఏంచేస్తాం.... అలాగే జరుగుతుంది మరి! మీరు పడిపోవాలనికాదుగానీ, నేను మాత్రం గద్దెఎక్కాలనే నా ప్రయత్నం నేను చేస్తుంటాను! మీ మంత్రివర్గంలో ప్రతి ఒక్కరికన్నా నేను మిన్న అని నిరూపించుకొంటాను.... చూస్తుండండి!'' అంది మైథిలి.

గోవిందరావుకు ఆ క్షణంలో మైథిలిని చూస్తే భయంవేసింది. కౌరవుల పతనంకోసం నిండుసభలో శపథం చేస్తున్న ద్రౌపదిలా ఉంది మైథిలి గోవిందరావు కళ్లకు.

ఆడది అనుకోనేకూడదు, అనుకుందంటే సాధించలేనిదిలేదు- ఆ సంగతి గోవిందరావుకు తెలీందిగాదు.

ముఖ్యమంత్రిగా గోవిందరావుకు ముందూ వెనకా ఎందరో భద్రతా దళ సభ్యుల కాపలా నిరంతరం అహర్నిశలూ ఉంటుంది. అయినా ఆ క్షణంలో ఒక్కసారి గోవిందరావు భద్రతా రాహిత్యంతో భయపడ్డాడు. మైథిలిని ఓ కంట కనిపెట్టిచూడమని పోలీసులకు, సి.ఐ.డి.లకు ఆదేశాలు ఇద్దామా? - అని ఓ క్షణం ఆలోచించాడు కూడా.

కానీ ఆ తర్వాత ఆ ఊహ తనకే సిగ్గుగా అనిపించి ఊరుకుండిపోయాడు.




దాదాపు నెలరోజుల తర్వాత వాచస్పతికి ఫోన్ వచ్చింది మళ్ళీ. చాలా పరిచితమయిన గొంతు అది. గతంలో ఒకసారి ఫొటోల గురించి గుర్తుచేసిన గొంతు అది.

వాచస్పతికి ఆ గొంతు వినగానే ఒక్కసారి ఒళ్ళంతా గగుర్పొడిచింది. ''కిందటిసారి మీరిచ్చిన వార్తతో వారంరోజులు ఆస్పత్రిలో చేరాను. ఈసారి ఏం చేస్తారో... మీ దయ, నాప్రాప్తం!'' అన్నాడు నవ్వుతూ.

''మీకు ఎవరికీ దొరకని స్కూప్స్‌లాంటి వార్తలు ఇస్తోంటే మీరు ఇలా అంటారేమిటి? వద్దంటే చెప్పండి... ఇంకో విలేకరికి చెప్తాం!''

వాచస్పతి తడబడ్డాడు-- '' నా ఉద్దేశం అదికాదు, ఏదో సరదాకు అన్నాను... చెప్పండి!'' అన్నాడు ఎపాలజెటిక్‌గా.

''ఏం చెప్పమంటారు. మీరు రాష్ట్రప్రజలకు కళ్ళూముక్కుల వంటివారు. ఎక్కడ ఏ చెడు జరుగుతున్నా చూడాల్సిన బాధ్యత మీకుంది. దాని వాసన పట్టాల్సిన డ్యూటీ మీది.

అయినా మీరు సావకాశంగా నిమ్మకునీరెత్తిన ట్లుగా వుంటున్నారు. ఏమీ ఎరగనట్లు ఊరు కుంటున్నారు. మరి ఈ దేశం ఎలా బాగుపడు తుందో, ప్రగతి పథాన ఎలా నడుస్తుందో చెప్పండి?"

"జరిగిందో, జరుగుతున్నదో చెప్పండి" దాదాపు ప్రాధేయపడుతున్నట్లుగా అన్నాడు వాచస్పతి.

అవతలి గొంతు నవ్వింది– "ఎందుకు లెండి, మీకు చెప్పటం. చెప్పి మళ్ళీ మిమ్మల్ని అవస్థలపాలుజెయ్యడం"

"అహ... అలాకాదు, చెప్పి తీరాలి మీరు... నామీదఒట్టు!!"

"మంచిమాట– ఇది మీకు నేను చేస్తున్న సహాయం, అది గుర్తుంచుకోండి! మీరు నామీదే ఒట్లువేసే ప్రయత్నాలు చెయ్యటం ఏమంత శ్రేయస్కరంకాదు, భావ్యమూకాదు!"

"ఒప్పుకొంటున్నాను... ఇప్పుడు చెప్పండి!" అన్నాడు వాచస్పతి.

"చూడటానికి కళ్ళుండాలేగానీ, ఎక్కడ జరగటం లేదండీ అన్యాయాలు, అక్రమాలు! ఎక్కడెక్కడో దేనికీ? మీరు రోజూ రాస్తున్న వార్తలలో ఉన్నది ఏమిటి? అక్షరాలు. ఆ అక్షరాల్ని నేర్పే విద్యాలయాల్ని చూడండి. కావాల్సినంత కుళ్ళు మీకు దర్శనం ఇస్తుంది. అది కాకపోతే, రోజూ మీరు తినేతిండి.... అదేనండి ఆహారశాఖలో చూడండి, అక్కడంతా అన్యాయమే. మీ అన్నంలో మీ పంటి కిందపడే రాళ్ళలాగ ఆ శాఖలో మీకు అక్రమాలు, అన్యాయాలు కనబడటంలేదా? వెతికి చూడండి. ఓ ఇరవై నాలుగ్గంటలు టైం ఇస్తున్నా– ఆ టైంలో మీరు ఆ రెండు రంగాల్లో కనీసం ఒకదాంట్లో జరిగే అన్యాయాన్ని నాకు చెబితే, రెండోది మీకు చెబుతా! మీరు కనుక ఈసారి ఫెయిలయితే ఈ వార్తలన్నీ ఇకమీద వేరే పత్రికలో వస్తుంటాయ్"

వాచస్పతి ఉలిక్కిపడ్డాడు– క్షణం తర్వాత ఆ ఉలికిపాటును సర్దుకొంటూ అన్నాడు నవ్వుతూ– "మొదటి పరీక్షలో ఫెయిలవగానే... అవననుకోండి, అయినా ఒక్క పరీక్షలో ఫెయిలయినంతమాత్రాన అంత పెద్ద శిక్ష కూడదండి!"

"ఆలోచిద్దాం. ముందు మీరు ప్రయత్నించి చూడండి" ఫోన్ డిస్కనెక్ట్ అయింది.

వాచస్పతి క్షణం ఆలస్యం చేయలేదు. లైబ్రరీలో విద్య, విద్యా సంస్థలు పేరుమీదున్న ఫైళ్ళన్నిటినీ తీసుకొన్నాడు. ఒక్కొటీ చదవటం మొదలుపెట్టాడు. తను చదువుతున్నదంతా పాతకాలంనాటి కథలే కావచ్చు. వాటివల్ల ఈరోజు తన ప్రయత్నాలకు ఏ ప్రయోజనమూ వుండకపోవచ్చు. అయినాసరే... తను చదువుకొని, పాతవన్నీ గ్రహించుకొని మరీ సిద్ధమయి వుండటం అవసరం. ఏ క్షణంలో ఏది అవసరమొస్తుందో... ఫైళ్ళు తిరగేస్తూనే వాచస్పతి గతంలో తాను తయారుచేసుకొన్న పాయింట్లన్నిటినీ స్ఫురణకు తెచ్చుకున్నాడు.

ఆ తర్వాత బయలుదేరాడు– ఊరిమీదకు.

దాదాపు వీధికొకటి వెలిసాయి ప్రాథమిక పాఠశాలలు ఈ రాష్ట్రంలో. బిడ్డపుట్టినరోజునే కిండర్‌గార్డెన్‌లో సీటుకు రిజిస్ట్రేషన్ చేసుకోవాల్సినరోజులివి. కన్నబిడ్డలకు నాలుగక్షరాలు నేర్పిపెడితే ఆ తర్వాత తమ బతుకు తాము బతుకుతారు ఆ బిడ్డలు- అన్న ఉద్దేశంతో కష్టపడో, నష్టం భరించో తల్లిదండ్రులు ఏదో ఒక స్కూల్లో పడేస్తున్నారు తమ పిల్లల్ని. అవకాశం అలాటిది. ఎంతగా దోచుకోదల్చుకున్నా దోచుకోగల సదవకాశం. తాము దోపిడీ అయిపోతున్నామని తెలిసీ గతిలేక, దానికి తలఒగ్గుతారు తల్లిదండ్రులు. ఇలాటి దోపిడీ చేసేందుకు ఏర్పడ్డవే ఈ వీధిబడులు– పేరుకు మాంటెస్సోరీలు, కిండర్‌గార్డెన్‌లు- మళ్ళీ మాట్లాడితే పబ్లిక్ స్కూళ్ళంటారు. నాణ్యతలోమాత్రం బందెలదొడ్లు అనుకొన్నాడు వాచస్పతి.

హైస్కూళ్ళు, కాలేజీలు కూడా అసంఖ్యాకంగానే వున్నాయి ఈ నగరంలో. తేలికగా చెయ్యగలిగింది సంఖ్యలో తక్కువగా వున్నదీ విశ్వవిద్యాలయాలు మాత్రమే. వాటినుంచి తన పరిశోధన ఆరంభించటం మంచిదనుకొన్నాడు.

అనుకోవటమే తడవు... అటు కదిలాడు.

ఊరికి దూరంగావుంది విశ్వవిద్యాలయం ఒకనాటి గత వైభవచిహ్నాంగా మిగిలిన సమున్నతమైన సముదాయం. లోపలికివెళ్ళేరోజున వెన్నముద్దల్లా అమాయకులుగా వుండేవారు, లోపలికివెళ్ళి తిరిగివచ్చేలోపు తమలాగే కరుడుగట్టిపోతారు దేనికీ కొరకరాని కొయ్యలే అవ్





తారు- అన్న దానికి నిదర్శనంగానా అన్నట్లు నిలబడి నిశ్శబ్దంగా, నిస్తబ్దంగా వున్నాయి ఆ భవనానికివున్న శిలా స్థంభాలు! దేశంలో పడిపోతున్న విద్యాప్రమాణాలను తామెలాగూ కాపాడలేం, కనీసం విద్యాలయాలైనా పడిపోకుండా కాపాడతాం- అన్నట్లుగా బరువంతా మోస్తూ కూడా బాధ్యత తెలిసిన తల్లిదండ్రుల్లా వున్నాయి ఆ స్థంభాలు.

మెట్లెక్కి పైకివెడితే... తరగతులు జరిగే గదులు... శ్రద్ధగా చదువుకొంటే పైకివెళ్ళగలవన్నట్లు....

మెట్లకింద- సెల్లార్ గదులున్నాయి. చదువుకొన్నవారు పైకిపోయేందుకు మార్గాలున్నట్లే, చదువుకోనివారు అధోగతులపాలవుతారన్నట్లు... చదువుకొని వెళ్లేవారికి మరోదారేదీ లేదన్నట్లు... సెల్లార్ గదులు రహస్యంగా కింద నక్కి ఉన్నాయి.

- ఆ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్లున్నారు గానీ వాళ్లు దేన్నీ ప్రొఫెస్ చెయ్యరు. అయినా ఏళ్లుమీరుతున్నకొద్దీ ఒళ్లు ఊరిపోయే పద్ధతిలో అధికారపు గద్దెల్లోకి చేరిపోతారు. అక్కడ టీచర్లున్నారు. విద్యార్థులున్నారు. అందరూ తమ పేర్లకు కళంకంలా మిగిలినట్లున్నారు.

-వాచస్పతి ఆ విశ్వవిద్యాలయంలో జరుగుతున్న అక్రమం కోసం, అన్యాయం కోసం పేరు పేరునా ప్రతి విద్యార్థినీ అడిగినతీరులో ప్రతి స్థంభాన్నీ తడిమిచూసి అడిగాడు.

ఏమీ లాభంలేకపోయింది. వార్తలు ఇలా దొరకవు. అవి దొరికే వస్తువులు కావు. అవి ఎదురొచ్చే స్నేహితులు కావు. ఆప్యాయంగా కాళ్లను చుట్టుకొనే కుక్కపిల్లలు 'వు. వార్తలు... విచ్చు కత్తులు, కనిపించవు. ప్పుడో ఎక్కడో నిగూఢంగా దాగివుంటాయి. వాటికోసం వెతికినప్పుడు కనిపించవు. ఏమరుపాటున ఉన్నప్పుడు గుండెల్లో గుచ్చుకొంటాయి. ఎక్కడో ఎవర్నో బాధిస్తాయి. ఎక్కడో ఎవరికో స్వాంతన కలిగిస్తాయి. ఎన్నడో తప్పిపోయిన బిడ్డడిలా సమయానికి కనిపించి, ప్రేమ చిగురింపజేస్తాయి.

అలాంటి వార్తలు... ఇప్పుడు వాచస్పతికి ఏవీ ఎదురు రాలేదు. మొదటిసారిగా వాచస్పతికి ఒక్క నిజం స్పష్టంగా తెలిసింది. వెతికితే దొరికేవికావు వార్తలు అని-

నిరాశ ఆదరంగా అతన్ని చేరదీసుకొన్న తర్వాత వాచస్పతి మెట్లుదిగాడు. మెట్లు దిగుతూ ఆలోచిస్తోంటే... అక్కడ జరిగేవన్నీ అక్రమాలేనన్న నిజం వాచస్పతికి తట్టింది.

ఒకటా రెండా... ఎంట్రన్స్ పరీక్షల్లో దగా, అడ్మిషన్లలో దగా, చదువుల్లో దగా, పరీక్షల్లో దగా... ఎక్కడ లేదు దగా? ఇది దగాలఆలయం... దగాకోర్ల నిలయం! ఇలాంటిచోట తను అక్రమాలకోసం వెతుక్కోవటం అంటే... గొంగళిలో వెంట్రుకల్ని వెతుక్కున్నట్లే!!

-ఎంత తెలివితక్కువ పనిచేస్తున్నాడు తను. ఇంత తేలికగా ఫూల్ అయిపోయాడేం?

-జీవితంలో మహామహా గొప్పవాళ్ళం అనుకున్న జనం అంతా ఎక్కడోఒకచోట గోతిలోనడనే పడతారట. తను ఈనాడు ఇక్కడ పడ్డాడు! అతిచిన్నదైన వలలో... ఆరడుగుల మనిషి తను- అవలీలగా పడిపోయాడు.

-వాచస్పతికి ఒక్కసారి నవ్వొచ్చింది. ఆ భవనం అంతా ప్రతిధ్వనించేలా నవ్వాలనిపించింది. అతనికి ఒక్కసారి ఏడ్వాలనిపించింది. ఆ భవనంలోని జనం అంతా సానుభూతి తెలిపేందుకు పరిగెత్తి వచ్చేలా ఏడ్వాలనిపించింది...

వాచస్పతి మెట్లుదిగాడు. కింద సెల్లార్‌కు వెళ్లే వైపు మళ్లాడు. ట్యూబ్‌లైట్ల వెలుగులో ఆ చీకటి గుహ చిరువెలుగుల్ని నింపుకొంది. వీలైనంతగా నిజాల్ని వెలికి తీసేప్రయత్నం చేస్తున్నట్లుగా అనిపించాయి ఆ చిరుదీపాలు.

-మెదడంతా పూర్తి ఖాళీ అయినట్లుగా ఉంది అతనికి. ఇంత అర్థరహితంగా తను ఏనాడూ తిరిగిన గుర్తులేదు అతనికి.

అలా తిరుగుతూ అక్కడున్న నోటీస్‌బోర్డు దగ్గరకొచ్చాడు వాచస్పతి. కనీకనబడని రీతిలో ఆ బోర్డులోపల కొన్ని కాగితాలు, దుమ్ముకొట్టుకు పోయినట్లు కొన్ని ప్రకటనలు... ఏమీ తోచక ఒక బోర్డుమీదున్న వైర్‌మెష్‌ను నెమ్మదిగా వేళ్లతో తట్టాడు. శతాబ్దాల నిశ్శబ్దాన్ని చీలుస్తున్నట్లుగా ఆ మెష్ చిన్నగా నవ్వడి చేసింది. రవ్వంత దుమ్ముకిందకు పడింది. ఇంకొంత ధూళి అతని కళ్లల్లోకి చిమ్మబోయింది, కానీ అతను ఒక్కడుగువేసి ఆ ప్రమాదం తప్పించుకొన్నాడు.

ఆ తర్వాత నెమ్మదిగా ముందుకు కదిలాడు. నిర్వికారమైన చర్యఅది. ముందుకో అడుగువేసి, ఆ సన్నని వైర్ మెషెలోంచి అవతలవున్న అక్షరాలను కూడబలుక్కొనే ప్రయత్నం చేశాడు.

'రాజకీయ విజ్ఞానశాస్త్రం' విభాగం వారి నోటీస్ అది. డాక్టరేట్‌పట్టా ఇచ్చేందుకు ముందు జరిగే లాంఛనాల పరీక్షలకు సంబంధించిన ప్రకటన అది- 'భారతదేశంలో గ్రామీణ రాజకీయాలు- ఒక సంక్షిప్త పరిశీలన' అన్న అంశంమీద పరిశోధనచేసి సిద్ధాంతవ్యాసాన్ని సమర్పించిన విద్యార్థి నీలాంబరరావుకు మౌఖిక పరీక్ష... పద్ధెనిమిదోతేదీ ఉదయం...

నీలాంబరరావు... ఈ పేరెక్కడో విన్నట్లుగా అనిపించింది వాచస్పతికి. కొత్తరకం పేరది. అదే సుబ్బారావు, సూర్యారావు, వెంకటరావు, వెంకటేశ్వరరావు వంటి ఏ పేరైనా వాచస్పతికి గుర్తుపెట్టుకొనేవాడుకాదు

కానీ నీలాంబరరావు... కొత్తరకంపేరు... ఎక్కడో పరిచయం ఉన్నట్లుగానే తోచింది. మస్తిష్కం ఆమూలనుంచి ఈ మూలవరకు ఒక్కసారి కదిపాడు వాచస్పతి. బ్రెయిన్ కంప్యూటర్‌లో కార్డ్సు అన్నీ అటూఇటూ కదిలాయి. కనెక్ట్ అయింది... నీలాంబరరావు... అవును-

ఆ నీలాంబరరావే... ఇంటిపేరు కూడా అదే.

-వాచస్పతి ఉలిక్కిపడ్డాడు. ఒక్కసారి 'యురేకా' అని అరిచినంత సంతోషసంబరాలతో నిండిపోయాడు.

వాచస్పతి... ఈసారి మెట్లు ఎక్కలేదు పరుగుతో వాటిని దాటాడు.

నికార్సయిన నిజంలాంటి, చురుక్కుమనే ఎండకాస్తున్న వాతావరణంలోకి వచ్చాడు. ఆ నిజాన్ని అంతవరకు గోప్యంగా దాచిన ఆ విశ్వవిద్యాలయం గోడలు ఇప్పుడు నిశ్శబ్దంగానే ఉన్నాయి. జరిగినదానికేకాదు, జరగబోయేదానికీ మేమే సాక్షులం అన్నట్లుగా నిటారుగా నిలబడి ఉన్నాయి.

ఆ మెట్లమీదనిలబడి, ఆ భవనాన్ని ఇంకోసారి చూసుకొని వాచస్పతి వెనుదిరిగాడు- భుజంమీద కొత్త నిజంతో, కొంగొత్త బాధ్యతతో!!

పత్రికాఫీసు ప్రాంగణంలోకి రాగానే వాచస్పతి పరుగునవెళ్లి లైబ్రరీలో ఫైలు తీశాడు.

నీలాంబరరావు పేరుమీదున్న ప్రతి అక్షరాన్నీ పట్టిపట్టి చదివాడు. ఏ చిన్నపొరబాటు చేసినా- కిందటిసారిలాటి పొరపాటు ఈసారి వాళ్లు చెయ్యరు. సున్నంలోకి ఎముక మిగల్చకుండా కీర్తిశేషుడిని చేస్తారు తనను! అందుకే తను పొరబాటు చెయ్యడు. పప్పులోకాలువెయ్యడు! అడుగు అతి జాగ్రత్తగా వేస్తాడు!

-వాచస్పతి తన ఆయుధాల్ని అన్నిటినీ చక్కగా ఆ లైబ్రరీలో పదునుపెట్టుకొన్నాడు. మర్నాడు మరొక్కసారి ఎందుకైనా మంచిదని వెళ్లి ఆ విశ్వవిద్యాలయంలో డాక్టరేట్‌పట్టా పొందేందుకు తగిన అర్హతలన్నిటినీ అర్థం చేసుకొన్నాడు.

అన్నీ సరిచూసుకొని... అక్షరాయుధాన్ని సంధించి వదిలాడు. మర్నాడు- ఆ వార్త పత్రికలో మొదటిపేజీలో వస్తుంది.

రాష్ట్ర పౌరపరిపాలనశాఖ మంత్రి శ్రీ నీలాంబరరావుకు ఇక పరిపాలనాయోగ్యత ఉండదు!

వాచస్పతి దెబ్బకు కూలుతున్న రెండో మంత్రివర్యుడాయన.

★ ★ ★

'నీలాంబరరావు డాక్టరేట్ పట్టా కథ 'వార్తావని' పత్రికలో పతాకశీర్షికలో బద్దలయింది. కనీసం రెండేళ్లపాటు ఏ విరామంలేకుండా విశ్వవిద్యాలయంలో పరిశోధన చేస్తేగానీ సిద్ధాంత వ్యాసం విశ్వవిద్యాలయానికి సమర్పించే అర్హత రాదు ఎవ్వరికైనా. ఈ నిబంధన సంగతి అందరికీ తెలుసు. అయితే ఈ దేశంలో నియమాలు, నిబంధనలు అన్నీ సామాన్యజనానికే తప్ప మాన్యజనానికి కాదు.

వారికి ఈ దేశంలో నియమాలు వర్తించవు. ఏ నిబంధనలూ అడ్డురావు. శాసించే మనుషులదీ దేశం. వారిని శాసించగల శాసనమేదీ లేదు ఈ గడ్డమీద.

లేకుంటే ఏమిటి? ఎన్నికల తర్వాత ఎన్నికల గురించి, ఎన్నికల మధ్య తన గురించి మాత్రమే ఆలోచించుకొనే రాజకీయనాయకుల్లో ఒకడైన నీలాంబరరావుకు భారతదేశం గురించి, అక్కడి గ్రామీణ రాజకీయాల గురించి ఆలోచించేంత ఓపిక ఎక్కడిది? తీరిక ఎక్కడిది?? అవే లేనప్పుడు ఇక పరిశోధనకు సమయం ఎక్కడిది?




-అయినా గోడమీద నోటీసులు అబద్ధమాడవు. నిజాన్ని గొంతెత్తి చెప్తున్నాయి. పట్టించుకొనేవారెవరైనా ఉన్నారా-- అని ఒక్కొర్నీ పట్టిపట్టి అడుగుతున్నాయి.

వాచస్పతి విన్నాడు వాటి మొర. ఊరూవాడా ఏకమయ్యేలా అక్షరాలా దండోరా వేశాడు. గంటల్లో అది రాష్ట్రమంతా ప్రతిధ్వనించింది.

ఆ ప్రతిధ్వనులు విన్నాడు గోవిందరావు.

అతనికి ఆ వార్త విన్నాక ఆగ్రహం అంచులుదాటింది. కళ్లు ఎరుపెక్కాయి.

ఎదురుగా నీలాంబరరావు వుండివుంటే- భగ్గున భస్మమయిపోయి వుండేవాడు ఆ కోపానికి.

పర్సనల్ సెక్రటరీని పిలిచి నీలాంబరరావుకు ఫోన్ చేయించాడు. రాజీనామా పంపమని ఆదేశించాడు. అవకతవకలతో విశ్వవిద్యాలయం కీర్తిప్రతిష్టలను మంటగలుపుతున్న వైస్‌ఛాన్సలర్‌ను సస్పెండ్‌చేస్తూ ఆదేశాలు జారీచేశాడు- అప్పటికి గోవిందరావుకు కోపం కొంచెం తగ్గింది.

మైథిలి అప్పుడు చేరింది భర్త దగ్గరకు- "ఇప్పుడైనా..." అంటూ నవ్వేస్తూ, తన మనసులోని కోరిక బయటపెట్టింది మళ్లీ.

గోవిందరావు తల వూపాడు అడ్డంగా- "నీకు తెలీదు. అది మంచి సాంప్రదాయం కాదు. మన కుటుంబానికి మంచిదికాదు"

మైథిలి నవ్వేసింది. "మంచి సంప్రదాయం... మనదేశంలో! తండ్రి చనిపోతే కొడుక్కు పట్టంగట్టే దేశమిది! తల్లి చనిపోతే కొడుకు, కన్నీళ్ళయినా తుడుచుకోకుండా గద్దెనెక్కే దేశమిది!! ఈ దేశంలో అవన్నీ సత్సంప్రదాయాలా? అర్హతలున్న నాకు మంత్రి పదవిని ఇవ్వటం దుష్టసంప్రదాయమా?"

"మైథిలీ... నీకు తెలీకకాదు నువ్వీ పనులు చేస్తున్నది. నీకు అన్నీ తెలుసు. అయినా కావాలని..."

"అవును... పదవికావాలని, ముఖ్యమంత్రి భార్యగాకాదు-- నాకు నేను మంత్రిణిగా బతకాలని..."

"కానీ చెప్తున్నా కదా, అది మనకు మంచిది కాదు! నువ్వు పదవి కోరితే, నీకది నేను అందిస్తే, ఇద్దరమూ పదవుల్ని పోగొట్టుకోవటమే అవుతుంది తప్ప..."

"అలా జరగదు! ఈ దేశరాజకీయాల్లో ఒకరి పాపాలు మరొకరికి అంటవు! ఎవరి మంచిచెడులు వారికే!"

గోవిందరావు ఏదో అనబోయి ఊరుకొన్నాడు- ఒక్కోసారి నోరెత్తి మాట్లాడటంకన్నా నోరెత్తకపోవటం మంచిదన్న ఉద్దేశంతో.

మైథిలి అది గ్రహించింది. గ్రహించి నెమ్మదిగా అంది- 'ఈ వార్త'లాటి పత్రికలు ఇంకో రెండు వుంటే ఇప్పటికే మీ మంత్రులందరి సంగతులూ బట్టబయలు అయివుండేవి"

"అవునూ! నాకు తెలీక అడుగుతున్నా- ఈ పత్రికా విలేకర్లకు ఇలాటి సంగతులన్నీ ఎలా తెలుస్తాయంటావ్?"

మైథిలి చిరునవ్వులు చిందించింది- "ఏమో... మీరు మీ సిఐడిలను పెట్టి కనుక్కొనే ప్రయత్నం చెయ్యండి వాళ్లుండగా నాకెందుకూ ఆబాధ"

"ఏదో ఒకటి చెయ్యాలి... లేకపోతే ఈ పత్రికలపోరు తట్టుకోవటం కష్టం"

-గోవిందరావు ఆ మాట పైకి అనలేదుగానీ అదిమాత్రం మిగిలిన అందరు మంత్రుల గుండెల్లోనూ ప్రతిధ్వనించింది. ఆభయాన్నే వారు గోవిందరావుకు స్పష్టంగా చెప్పారు.

"ఎందుకంత భయం మీకు? మీరు నిజాయతీగా ఉంటే చాలు, ఎన్ని పత్రికలైనా ఏంచేస్తాయి? చెడుచేసే మంత్రులు, చెడువర్తన వుండేవాళ్లూ భయపడటం సహజం, మీకెందుకు భయం?" గోవిందరావు ఉపశమన వాక్యాలు పలుకుతూ అన్నాడు.

"అలాకాదండీ- మీకు తెలీంది ఏముంది? ఎక్కడెక్కడి విషయాలో బయటకు తవ్వుతోంటే ఎలాటివారికైనా ఏదో ఒక లొసుగు బయటపడుతూనే వుంటుంది మరి! మీరే కొంచెం శ్రద్ధతీసుకొని... బెదిరించో, లాలించో ఏదో ఒకటి చెయ్యాలి! మిగిలినవాళ్లమాట ఎలావున్నా ఆ ఒక్క పత్రికవాళ్ళకన్నా చెప్పండి!"

గోవిందరావు నవ్వాడు- "నేను చెప్పేది ఏమిటండీ! మీ అంతట మీరే ఒకసారి చెప్పారుగదా-- రామనాథంగారు రాజీనామా చేసినరోజునే ఆ పత్రికవాడికి దెబ్బలుతగలటం ఏదో యాధృచ్ఛికంగా జరిగిందని నేను అనుకో

వటం లేదు...అసలు విషయం మీకు తెలీందీ కాదు, మీరు ఊహించుకోలేనిదీ కాదు..."

అందరికీ అది అర్థమయింది.

"అయితే అతని విషయం మమ్మల్నే చూసుకోమంటారా?" ఇంకో మంత్రిగారి ప్రశ్న.

"అతన్ని చూసుకోమని, ఏమైనా చేసుకోమని చెప్పను నేను. అతణ్ణి చూస్తే మొండిమనిషిలా వున్నాడు. తెలివైనవాడిలాగానూ వున్నాడు. తెలివితేటలున్నవాడికి మొండితనమూ ఉంటే మనం కొంచెం జాగ్రత్తగా ఉండటమే మంచిది. తొందరపడకండి అన్నదే నా సలహా. జాగ్రత్తగా ఉండండి. వెయ్యి కళ్ళు మిమ్మల్ని గమనిస్తుంటాయనేది గుర్తుంచుకోండి... ఇంకోమాట— ఇలాటి సంఘటనలు ఇంకొకటి, రెండు జరిగితే చాలు, నా పీకమీదకు ఉరి వస్తుందని వేరే చెప్పనక్కర్లేదు అతని మాటలెలా వున్నా ఇకమీదట నేనే మీమీద కొంచెం నిఘావేసి వుంచుతాను! నిక్కచ్చిగా చెప్తున్నాను— నా ఉనికికి ప్రమాదంవచ్చే ఏ పరిస్థితినీ నేను భరించను. ప్రమాదంతెచ్చే ఏ వ్యక్తినీ క్షమించను. గుర్తుంచుకోండి! స్పీడు తగ్గించి నిదానంగా బతకండి!!" అన్నాడు గోవిందరావు.

హితవాక్యాలు చెప్తున్నట్లు చెప్తూనే, బెదిరింపులు కూడా కలిపేశాడాయన.



ఆ సంగతి అందరికీ తెలుస్తూనే వుంది.

ముఖ్యమంత్రి చెప్పింది తమ మంచికేనని అందరూ గుర్తించారు.

---అయితే గోవిందరావు మాత్రం ఇంకోలా భావించటంతో వచ్చింది ముప్పు-- ఇందరు మంత్రులు చెప్తున్నప్పుడు ఆ విలేకరిని పిలిచి ఒక్కసారి కొంచెం 'కదిపి' పంపితే మంచిది గదా అనుకున్నాడు. అనుకొన్నదే తడవు-- వాచస్పతికోసం మొదలయింది వేట.

సియంగారి పేషీ నుంచి కబురొచ్చింది వాచస్పతికి. "మిమ్మల్ని సియంగారు స్వయంగా కలుసుకోవాలనుకుంటున్నారు!" అన్నది ఆ రాయబార వాక్యం. కలుసుకోవటం కూడా సెక్రటేరియట్‌లో సియంగారి ఛాంబర్స్‌లోకాదు, ఏకంగా సియంగారి 'హర్త' భవనంలోనే.

శారద ఆ పిలుపు విని భయపడింది.

"ఎందుకు పిలిపిస్తున్నారు మిమ్మల్ని?" అడిగింది శారద.

"కారణం ఏదైనా కావచ్చు..."

"అని మీరనుకొంటున్నారేమోగానీ, నాకలా అనిపించటంలేదు. రామనాథంగారి రాజీనామా వెంటనే ఎవరో మిమ్మల్ని ఆస్పత్రిపాలు చేశారు. నీలాంబరరావుగారి రాజీనామా తర్వాత ఈ పిలుపు... వాటికీ ఈ పిలుపులకూ ఏ సంబంధమూ లేదంటారా... మీరు చెప్పండి"

---తన మనసులోని ఉద్దేశాన్ని అంత సరిగ్గా భార్య పసిగట్టటం అతనికి నచ్చలేదు. అయితే అది పైకి ప్రకటించక అన్నాడు-- "ఉంటుందేమో, చూద్దాం!"

"మీరు అంత ఈజీగా తీసుకోకండి ఇటువంటి విషయాలు-- ఎందుకో నాకు ఈ వ్యవహారాలేవీ నచ్చటంలేదు. సుఖాన వుండే ప్రాణాన్ని దుఃఖాన వేసుకోవటమే అనిపిస్తోంది! ఒకవేళ ఆయన మిమ్మల్నిగనక ఇలా ఎందుకు చేస్తున్నావ్ అంటే చిన్నతనం ఫీలవక 'సారీ' అనేయండి! ఇంకెప్పుడూ ఇలాటి దుందుడుకు పనులు చేసి పీకలమీదకు తెచ్చుకోనని చెప్పండి!"

వాచస్పతి అన్నిటికీ తలవూపాడు.

---శారద చెప్తున్నది వింటుంటే నిజమే అనిపించసాగింది అతనికి. ఎందుకొచ్చిన శ్రమ ఇది! ఎవరికోసం చేస్తున్న సేవ ఇది! ఎవరు గుర్తిస్తారు తనను! గుర్తించి ఏంచేస్తారు తనకు వాళ్ళు??

---ఇదంతా అర్థంలేని పని. ఏదో తల వంచుకుపోయేవాళ్ళదే ఈ ప్రపంచం. కడుపులో చల్ల కదలకుండా కూర్చోగలిగితేనే ఈ దేశంలో మనగలిగే ఓపిక వుంటుంది. లేకపోతే---

రామనాథం రాజీనామా తర్వాత తనపై గూండాలు దాడి జరిపినప్పుడు ఎవరు తనకు తోడు నిలిచారు? ఎవరు తనకు అండ అయినారు? ఒక్కరు... ఒక్కరంటే కనీసం ఒక్కరు--- తనకు 'అయ్యో... ఇలా జరిగిందేం?' అన్నారా? ఎవరికి పట్టింది తనకు ఏం జరిగినా? అలాగే... అచ్చం అలాగే... తానూ చేస్తాడు-- ఈ ప్రపంచం ఎలాపోతే తనకేం... తనూ పట్టించుకోడు!

నీతినియమాల్ని ఈ ప్రజలు నిలువులోతుల్లో పూడ్చిపెట్టనీ-- దొంగలంతా కలిసి ఊళ్ళు పంచుకున్నట్లు ఈ రాజకీయ నాయకులందరూ కలిసి ఈ దేశాన్ని దోచుకొనితిననీ... తనకేం!-- తనూ మిగిలిన కోట్లాదిమందిలాగానే తలవంచుకు బతుకుతాడు!!

వాచస్పతి అలా ఆలోచించుకుని వెళ్లాడే కాని, అక్కడికి వెళ్ళేసరికి ఏదో తెలీని ఆవేశం అతన్ని ఆవహించింది.

---ఈ దేశం మీ సొంతసొమ్ము కాదు. సలుగురూ వాటాలు వేసుకొని స్వాహా చేయటానికి ఇది వీరి తాత తండ్రులు సంపాదించిపెట్టిందీకాదు. ఇది వేలాది, లక్షలాదిమంది స్వాతంత్ర్యయోధుల రక్తతర్పణంతో సముపార్జించుకొన్నది. ఈ దేశాన్ని ఏలే హక్కు వీరికి ఉందేగానీ భోజనంచేసే హక్కు వీరికి లేదు. పత్రికా రచయితగా వీరిని వెయ్యికళ్లతో కనిపెట్టి ఉండటం తన విధి. వీరు వేసే ప్రతిఒక్క అడుగూ కనిపెట్టి వుండాల్సిన బాధ్యత తనది. స్వార్థంకోసం వీరు ఏ చర్య తీసుకొన్నా దాన్ని ప్రజలముందుకు తెచ్చి దోషుల్ని శిక్షించటం తన పవిత్ర కర్తవ్యం. ఈ కర్తవ్యపాలనలో తను వెనుకంజ వెయ్యడు. ఏ కష్టాలు రానీ, ఏ నష్టాలు రానీ!!

ఆ సంగతే తేల్చి చెప్పదల్చుకున్నాడు వాచ

స్పతి.

—గోవిందరావు వాచస్పతిని చూసి ముందు ముచ్చటపడ్డాడు. ముప్ఫయిసంవత్స రాలలోపు వయసు. ఉరకలువేసే ఉత్సాహం. వరుగులుదీయించే పట్టుదల. ఆదర్శం ఊపిరి. కర్తవ్యం కంటిచూపు– ఇన్ని లక్షణాలు సాధారణంగా ఈమధ్యకాలంలో ఎవరిలోనూ కనపడటంలేదు. ఈ దేశం ఇంకా నిలిచి వుందంటే– ఇదిగో... ఇలాటి యువతరమే దానికి కారణం- అనుకున్నాడు గోవిందరావు. అంతలోనే తన కర్తవ్యమూ గుర్తుకువచ్చింది.

సాదరంగా ఆహ్వానించాడు లోపలికి.

"మీ పత్రికను నేను చూస్తూనే వున్నాను. చాలా బాగుంటోంది!" అన్నాడు గోవిందరావు ఉపోద్ఘాతంగా.

వాచస్పతి నవ్వి ఊరుకున్నాడు.

"...ముఖ్యంగా మీ రిపోర్ట్స్! నాకు తెలీక అడుగుతాను, ఎలా సంపాదిస్తారు అలాటి వార్తలు, విశేషాలూ మీరు...! మీరంటే నాకెంతో ఈర్ష్యగా కూడా వుంటోంది. నాకు ప్రభుత్వప రంగా ఇంత సిబ్బంది అండదండలు వున్నాయి. అయినా... వాళ్లెవరూ తెలుసుకోలేని సంగతులు, సమాచారాలు నేను మీ పత్రిక ద్వారా తెలుసుకుంటున్నాను. దానికి నేనెంతో రుణపడి వున్నాను"

"మీ అభిమానానికి కృతజ్ఞతలు..." వాచ స్పతి నెమ్మదిగా అన్నాడు.

"అయితే ఒక్క విషయం... ఇలా అంటు న్నానని, మీతో ఇంత నిర్మొహమాటంగా, నిజా యితీగా మాట్లాడుతున్నానని ఏమీ అనుకో కండి. మీకు తెలీంది కాదు– వయసులో మీరు చిన్నేకావచ్చు, కాని మీకున్నంత అనుభవం చాలామందికి ఉండదన్నది నిజం. అందుకే ఇలా చెప్తున్నాను.. ప్రతి మనిషికీ ఏదో ఒక బలహీనత ఉంటుంది. కొందరికి పదవిమీద మోజు ఉంటుంది, కొందరికి కీర్తిమీద, ఇంకొందరికి కాంత– తప్పితే కనకం మీద! మరికొందరికి ఇంకోరకమైనదేదో ఉండితీరు తుంది. వీటిని, ఈ వ్యక్తిగతమైన బలహీనతల ను అచ్చులోకితెచ్చి వారికి ఉచ్చు బిగించటం ఏం బాగుంటుందో చెప్పండి... ఎందుకో నాకీ పద్ధతి నచ్చుటంలేదు" గోవిందరావు నెమ్మదిగా అన్నాడు.

—వాచస్పతికి అర్థం అయింది– గోవింద రావు ఏంచెప్తున్నాడో, ఏం చెప్పదల్చుకొన్నాడో.

"పత్రికా రచయితగా, విలేకరిగా నా బాధ్య తండీ అది!" అన్నాడు వాచస్పతి సంజాయి షీ ఇస్తున్నట్లు.

"నిజమే... మీ బాధ్యత గురించి నేనేమీ అనటం లేదు. అయితే ఇలా ప్రతివారి బలహీ నతల గురించీ మీరు రాస్తూపోతే, అది ఎవరికి లాభం చేకూరుస్తుందో ఆలోచించండి! వ్యక్తిగ తంగా వారి బలహీనతల గురించి మీరు రాయాల్సింది కాదేమో! పాలనాపరంగా వాళ్ళు ఏమైనా చెడుదారులు తొక్కినా, అడ్డదారులు పట్టినా అవి... మీరు పట్టించుకోవటం మంచిది!"

"మీకు తెలీందికాదు సార్... మనిషి ఒక స్థాయి దాటాక, అతనికి సామాజిక జీవితం, వ్యక్తిగత జీవితం అంటూ వేరువేరుగా ఉండవు. వ్యక్తిగా ఉన్నతస్థాయిలో ఉండలేని వాడికి, సామాజిక నాయకత్వం చేపట్టేహక్కు, అధికారం ఉండవు... ఉండకూడదు! అందుకే ఈ విషయాల్ని నా రిపోర్ట్స్‌లో చూపిస్తున్నా ను!" అన్నాడు వాచస్పతి.

"మీరనేది నిజమే! అయినా ఎలాటివారి కైనా ఒక్క అవకాశం... తప్పు దిద్దుకోగల అవకాశం ఇవ్వటం మంచిదేమోకదా! అందు కే ఇకమీదట మీరు మీ రిపోర్ట్స్‌లో ఇలాటి సంగతులు ఏవైనా బయటపడితే వాటిని నా దృష్టికి తెండి. వాటిపై పరిశీలన జరిపిస్తా, తగినచర్యలు తీసుకొంటా! అంతేకానీ, మీరు ఏకంగా వాటికి వార్తారూపం ఇవ్వకండి!"

-వాచస్పతి ఉలిక్కిపడ్డాడు.

తను సేకరించిన వార్తల్ని ముందుగా ఈయనకు చూపించాలట? ఈయన వీటిమీద చర్యలు తీసుకొంటారట.

బాగుంది... మరైతే ఇంక పత్రికా విలేకరిగా ఉద్యోగం దేనికీ...

ఏకంగా ఏ ప్రభుత్వోద్యోగిగానో చేరి, రిపోర్ట్స్ రాసి, వాటిని ఫైళ్లల్లోపెట్టి శ్రీవారికి పంపితే సరి... ఈ వార్తలెందుకు, ఈ వార్తాపత్రిక లెందుకు??

-ఆ మాటే అన్నాడు వాచస్పతి– "పత్రికల్లో ఏది రావాలో, ఏది రాకూడదో నిర్ణయించుకోవా

ల్సింది మేమండి! మీకు కావాలంటే, ఇలాటి అంశాలన్నిటిపైనా నివేదికలు సమర్పించేందుకు వేరుగా ఎవరినైనా నియమించుకోవచ్చుగదా?''

వాచస్పతి అన్నది గోవిందరావుకు ఇంకోలా తోచింది. క్షణం ఆగి అన్నాడు గోవిందరావు-- ''మీఅంత సామర్థ్యం ఉన్నవ్యక్తి దొరికితే అలాగే చేద్దును! ప్రభుత్వానికి ఉద్యోగులే కళ్లు, చెవులు! ప్రజలకు-- మాకూ మధ్య వారే వారధులు. అయినా ఆ సంగతి గ్రహించి పనిచేస్తున్నవారులేరు... పోనీ, ఒకపని చెయ్యకూడదూ... మీరు... మీరే మాదగ్గర పనిచెయ్యవచ్చుగదా, ఏ పిఆర్ఒ గానో, కాకుంటే సమాచార శాఖలో ఉన్నత ఉద్యోగిగానో... మీకు ఏది నచ్చితే అది... మీరు ఊఁ అంటే ఆ ఏర్పాట్లు చేస్తాను...'' అన్నాడు గోవిందరావు.

వాచస్పతికి నవ్వొచ్చింది- మొదట బెదిరించి చూశాడు. ఇపుడు లంచంఇచ్చే ప్రయత్నం చేస్తున్నాడు. ఒక్క ఉద్యోగాన్ని తనకు ఎరచూపించి, నోరుమూసే ప్రయత్నం చేస్తున్నాడు.

ఈ దేశంలో కొందరైనా ఇంకా నీతినిజాయితీలతో బతుకుతున్నారని నిరూపించాలని నిర్ణయించుకొన్నాడు వాచస్పతి.

ఆ మాటే అన్నాడు నెమ్మదిగా.

''సారీసర్... ఆఫర్ బాగుందికానీ, నాకది సమ్మతంకాదు! ఇపుడు నేను చేస్తున్న ఉద్యోగమే నాకు బాగుంది! ఇందులో కలుగుతున్నంత తృప్తి నాకు ఇంకెందులోనూ లభిస్తుందని నేను అనుకోను! అయినా మీరేమీ అనుకోనంటే ఒకమాట అడుగుతా- మీరు నాకింత ఆశచూపి, నా కలాన్ని మూయించే కంటే, మీ మంత్రుల్ని కొంచెం జాగ్రత్తగా ఉండమనొచ్చుగదా! తప్పులు చేసేవార్ని సరిదిద్దటంపోయి, నాచేత తప్పులు చేయించటం సరైన పద్ధతి కాదేమోనండి!''

-వాచస్పతి అన్నది గోవిందరావుకు ఛెళ్లున తగిలింది. అయినా రాజకీయనాయకుడుగాబట్టి నవ్వు ముఖానికి పులుముకొంటూ అన్నాడు- ''మీరనేది నిజమే! కానీ తప్పులు చేసేది ఎవరో తెలీటంలేదుగదా! ఆ పని మీరు చేసిపెడితే మంచిదంటున్నాను!''

వాచస్పతి నవ్వేశాడు- ''ఆ విషయంలో నా సహాయం మీకెప్పుడూ ఉంటుంది సార్! రాష్ట్రంలో ఎక్కడెక్కడో ఏదో జరిగితే చెప్పలేనుగానీ, కనీసం ఇక్కడ, ఈ రాజధానిలో మీ మంత్రులు ఏంచెప్తున్నా ఏంచేస్తున్నా అది మీ దృష్టికి తెస్తాను. అయితే ఒక్క విషయం- అదీ మా పత్రికాముఖంగానే జరుగుతుంది''

''అంటే... మీ పద్ధతిని మీరు మార్చుకోరన్నమాట!'' ''గోవిందరావు కంఠస్వరం కొంచెం తీవ్రంగానే ఉంది.

''ఏం చెయ్యను... ఆ విషయంలో నేను చాలా నిస్సహాయుడిని! నాకు నా వృత్తిపట్ల ఆరాధనాభావం ఉంది, నా విధిపట్ల విపరీతమైన భక్తిశ్రద్ధలు ఉన్నాయి!'' వాచస్పతి దృఢంగా అన్నాడు.

''మంచిదే! కానీ మీరే ఆలోచించండి! మీరు ఇలా మీకు తోచినట్లు రాస్తూపోతోంటే... ఎవరోఒకరు తీవ్రంగా రియాక్ట్ అయ్యే ప్రమాదం కూడా ఉంది!''

వాచస్పతి నవ్వాడు- ఇది మరింత స్పష్టమైన బెదిరింపు-- ''మీరన్నదికూడా నిజమేనండి! అలా జరిగింది కూడా నా విషయంలో!''

''ఎప్పుడు... ఏమయింది?'' ఆదుర్దాగా అడిగాడు గోవిందరావు.

''రామనాథంగారు రాజీనామా చేసినరోజున...ఒంటరిగా ఇంటికి వెళుతోంటే నామీద దాడిజరిగింది! వారంరోజులు ఆస్పత్రిలో ఉన్నాను నేను!'' అన్నాడు వాచస్పతి.

''మరికనేం, నేచెప్పలా... మీది చాలా ప్రమాదకరమైన పద్ధతి! కిందటిసారి దాడినుంచి మీరు బతికి బయటపడ్డారు! కానీ...ఏమో, ఏంచెప్పగలం? మీకు మా రక్షణ ఉంటుంది గానీ, అనుక్షణం ఈ రాష్ట్రంలో ఉన్న ప్రతివారినీ కంటికిరెప్పలా కాపాడటం నాకేకాదు, ఎవరికైనా అసాధ్యమే! ఆ స్థితిలో మీకు ఇంకా తీవ్రంగా ఏమైనా జరగొచ్చు. కొంచెం జాగ్రత్త ఉండమనే నా విజ్ఞప్తి. ముఖ్యంగా మీరు కొంచెం బ్రేకులు వేసుకొంటూ వెళ్ళటం మంచిదని నా సలహా!''

ఈదేశంలో ఏమైనా జరుగుతుందనే దానికి ఇదో నిదర్శనగా తోచింది వాచస్పతికి. లేకుంటే-రాష్ట్ర ముఖ్యమంత్రి ఏమిటి, ఏకంగా ఓ జర్నలిస్టును ఇంటికి పిలిచి ఇలా బెది




రించటం ఏమిటి? రాలిపోయేకాలం వచ్చినపుడు చెట్టు, కుక్కమూతిపిందెల్ని కాస్తుందని సామెత!

ఈరాష్ట్రంలో ఇదే జరుగుతోందా?

చూద్దాం!

-అయినా ఇలాటి బెదిరింపులకు బెదిరిపోతే ఎలా? తప్పుచేసే ప్రతివారూ తమను బెదిరిస్తూనే ఉంటారు, తమ తప్పు కప్పిపుచ్చుకునేందుకు ప్రయత్నాలు చేస్తూనే ఉంటారు! అలాటివి బయటపెట్టటమే తమ కర్తవ్యం!

వాచస్పతి లేచి నిలబడ్డాడు-''మీ సలహాకు, సూచనలకు థాంక్స్! కానీ ఒక్క విషయం సార్! తప్పు జరిగేచోట సరిదిద్దే ప్రయత్నాలు చెయ్యండి. ఇలా తప్పుల్ని మీదృష్టికి తెచ్చే మమ్మల్ని బెదిరించటం ఏమంత శ్రేయస్కరంకాదు...మీరిలా నన్ను బెదిరించారని ఒక్క వార్త వేస్తేచాలు, ఎంత సంచలనం రేగుతుందో ఆలోచించండి!''

గోవిందరావు నవ్వాడు-''బెదిరిస్తున్నావా నన్ను? అవన్నీ ఆలోచించుకోకుండా నేనా పని చేశానని నువ్వు అనుకొంటే అది పొరపాటు! నేను బెదిరించానని ఏం రుజువుచూపించగలవ్ నువ్వు? ఆరోపణ చెయ్యటంకాదు, దాన్ని రుజువుచేసుకోవటంలో ఉంటుంది అంతా! రామనాథంగారి రాజీనామా రోజున ఏంజరిగిందో, ఎవరు చేయించారో నీకు తెలుసు! కాని ఎందుకు అది రుజువుచెయ్యలేకపోయావ్ చెప్పు మిస్టర్ వాచస్పతీ. ఈ లోకంలో అందరూ ఫూల్స్‌కాదు- కొందరుమాత్రమే ఫూల్స్! అది కూడా ఒకసారి...రెండోసారి తప్పుచేసేటపుడు ఎవడైనా జాగ్రత్తపడతాడు. రామనాథమూ అదేపని చేశాడు! ఈసారి నీ విషయంలో ఎవరైనాసరే ఇంకా జాగ్రత్తగానే ఉంటారని నేను వేరే చెప్పనక్కర్లేదు!'' గోవిందరావు ఆగాడు.

అంతక్రింతంవరకు 'మీరు' అంటూవచ్చిన గోవిందరావు ఇపుడు 'నువ్వు' అనటం గమనించాడు వాచస్పతి. తెలిసో తెలియకో పరిస్థితి కొంచెం అవాంఛనీయమైన మలుపుల్ని చేరుకొంది. ఇపుడు దాన్ని సరైన దారిలోకి మళ్ళించే ప్రయత్నం ఏంచేసినా ఫలించదన్నది నిజం!

''సార్...చివర్న ఒక్కప్రశ్న...రేపు నామీద ఏ హత్యాప్రయత్నమో జరిగిందనుకోండి! మీరు ఆ విషయంలో ఏం చర్యలుతీసుకొంటారు?''

గోవిందరావు నవ్వాడు: ''ఎందుకండీ అంత భయపడుతూబతకటం! నా ఆఫర్ ఇంకా ఉంది- వచ్చేయండి... సుఖశాంతులతో జీవించండి!''

వాచస్పతి నవ్వాడు-''నా ప్రశ్నకు అది సమాధానంకాదు!''

గోవిందరావు చిన్నగా అన్నాడు: ''మీ ప్రశ్నకు సమాధానం కావాలా...అయితే వినండి! ఇది ప్రజాస్వామ్యదేశం. ఇక్కడ ఆఖరికి కోర్టులలోనైనాసరే, సాక్ష్యం ఉంటేనే మీమాట చెల్లుతుంది! మీమీద ఏ హత్యాప్రయత్నమో జరిగితే... దానిగురించి విచారణ జరిపిస్తాం! మీరు చేసే ఆరోపణలనుబట్టి, మీరు చూపే సాక్ష్యాలనుబట్టి, దొరికే ఇతర ఆధారాలనుబట్టి చూసుకుంటుంది కోర్టు ఆపైన జరగాల్సిన చర్యలన్నీ!!''

''థాంక్సండీ..మీవైపునుంచి ఆమాత్రం సాయం ఉంటుందన్న హామీ ఉంటేచాలు..నాకదే కొండంత ధైర్యం. చూస్తూ ఉండండి... ఇంకా ఎలా విజృంభిస్తానో...మరి సెలవ్‌సార్'' అంటూ వాచస్పతి సెలవుతీసుకొన్నాడు.

గోవిందరావు వాచస్పతి వెళ్ళిపోయాక ఆలోచనల్లో పడ్డాడు.

తప్పు చేశానా- అన్నభయం ఒక్కసారి గోవిందరావు మనసులో కదలాడింది. ఈ పత్రిక విలేకరులు బహుప్రమాదకారకులు. అందులోనూ ఈ వాచస్పతి! అవులిస్తే పేగులు లెక్కపెట్టగల ఇలాటి విలేకరులు నిజానికి పక్కలో బల్లాలు; పాములు. ఇలాటివాళ్ళకు ఆమడ దూరంలో ఉండటం అన్నిటా శ్రేయస్కరం.

ముఖ్యంగా తను...

-గోవిందరావుకు ఎందుకో తన గతం మనసులో కదిలింది. ఆ దృశ్యాల్ని చెరుపుకునే విఫలయత్నం చేశాడతను. భయపెట్టే గతం తనకూ ఉంది నీడలా. అది వర్తమానంలోకి రాకుండా జాగ్రత్తపడటం అవసరం. అది వర్తమానంలోకి వస్తే...తన భవిష్యత్తు చిందరవందర అవుతుంది!

ఆ ప్రమాదం జరగకూడదు అనుకొన్నాడు గోవిందరావు.



'హర్ష' మెట్లుదిగుతున్న వాచస్పతి ఆలోచన లు మరోలా ఉన్నాయి.

కొడితే ఏనుగుకుంభస్థలమే కొట్టాలన్నట్లుగా, ఈ మంత్రుల చిలక్కొట్లు దండగ. తనను బెదిరించిన గోవిందరావుకు, ఆ గురివిందకు కిందనున్న నలుపును వెతుకుతాడు తను! దీన్ని ప్రజల ముందుకు తెస్తాడు! ప్రజల ముందు ఈ రాజకీయనాయకుల మచ్చల్ని బహిర్గతంచేస్తాడు! ఓట్లబలంతో గద్దెనెక్కిన ఈ నీచులకు నిజానికి ఆ గద్దెల్ని తాకే అర్హతకూడా లేదన్న సంగతి తాను స్పష్టంచేస్తాడు!!

★ ★ ★

వాచస్పతి వెళ్ళిపోయాడుగానీ అతను పరోక్షంగా చేసిన హెచ్చరికల ప్రతిధ్వనులన్నీ ఆ గదిలో ఉండనే ఉన్నాయి. ఎటు చూస్తున్నా గోవిందరావుకు అతనే కనపడసాగాడు. ఆ ప్రతిధ్వనులే వినిపించసాగాయి.

'చూస్తూ ఉండండి... ఎలా విజృంభిస్తానో!' అంటూ తొడగొట్టి ఛాలెంజ్ చేసి మరీ వెళ్లాడు వాచస్పతి.

ఎలా విజృంభిస్తాడో... ఊహించుకోవటం కష్టంగా ఉంది. అయినా వీళ్ళు వార్తలెలా సంపాదిస్తారో... వీళ్ళకు అంత కీలకమైన సమాచారాల్ని ఎవరు అందిస్తారో... ఇంత బలగం ఉంది తన వెనక! ఇంత ప్రభుత్వం, ఇంత అధికారం ఉన్నాయి తన వెనక! అయినా... అందరికందరూ పనికిమాలిన జనం! ఒక్క చిన్న సమాచారాన్ని తన ముందుకు తేలేని చవటలు. ఒక్క వాచస్పతిలాటివాడు ఉండి ఉంటే...—భాగుండిపోయేను గీత—' అనుకొన్నాడు గోవిందరావు.

లాలించి చూశాడు. పదవిని ఆశ చూపించాడు. బెదిరించాడు. ఆఫ్టరాల్, తన సామ దానభేద దండోపాయాలన్నీ ఆ విలేకరి ముందు పనికిరానివయ్యాయి. ఈ బెదిరింపులకు లొంగలేదు సరికదా... విజృంభిస్తానని చెప్పాడు. ఏం చేస్తాడో, ఏమో!

—అద్దాల మేడలో నివసించేవాళ్ళు ఎదురింటి మీద రాళ్ళు వెయ్యకూడదట. తన వెనకున్నది అద్దాల మేడలాటి గతం. ఏ ఒక్కరు తొంగి చూసినా దాన్ని పసిగట్టినా అది కుప్పకూలిపోతుంది. తను పొరబాటునే అయినా ధైర్యం చేసి వాచస్పతిలాటి విలేకరిని అదిలించాడు. అలా కదిలిన తీగ తన గతమనే డొంకనే కదిలిస్తే...

—గోవిందరావుకు ముచ్చెమటలు పోశాయి— తన గతాన్ని తల్చుకోగానే!

—ఎవరి దృష్టినీ పడకుండా కాపాడుకొస్తున్న గతమది!

తనను అమాంతం పాతాళంలో పాతిపెట్టగల గతమది!!

అప్పటికి తనింకా ఇంత పూర్తి సైజు రాజకీయవేత్త కాలేదు! పిల్లకాకిగా ఉన్న రోజులే అవి!!

ఆ రోజుల్లోనే తనకు పరిచయం అయింది శకుంతల!

—పార్టీ ఆఫీసులో అది ప్రారంభమయింది. తను పార్టీ ఆఫీసులోనే రేయింబవళ్ళు గడుపుతున్న రోజులవి. ఎలక్షన్స్ ఇంకా ఇరవైరోజులున్నాయి. పార్టీ తరపున మునిరత్నం పోటీ చేస్తున్నాడు. ఆయనకు సాయంగా ఆఫీసులోనే ఉంటూ, ఓటర్ల లిస్టులోంచి పేర్లన్నీ కాపీ చేస్తూ, ఓటర్లకు అందించటానికి స్లిప్పులు తయారుచేయటం తన పనిగా ఉండేది!

—వీలుంటేనే ఇంటికి వెళ్ళటం, లేకపోతే రాత్రిళ్ళు కూడా అక్కడే ఉండిపోవటం!!

—శంకుతల ఆ పార్టీ ఆఫీసులో పని చేస్తుండేది. రోజూ ఉదయమే వచ్చి నీళ్ళుపట్టటం, ఆఫీసంతా శుభ్రంగా తుడవటం— మళ్ళీ పదింటికి వచ్చి అక్కడ పని చేసే వారికి కాఫీ, టీలు అందిస్తూ సాయంత్రం వరకు ఉండటం-- శకుంతల పని.

ఆ రోజు...

గదిలో ఏదో అలికిడి అవుతున్నట్లనిపించి, ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు గోవిందరావు. మంచాన్ని ఒక చేత్తో పట్టుకొని నుతారంగా వంగి, మంచం కింద ఊడుస్తోంది శకుంతల. ఆ వంగటంలో అదో రకమైన వయ్యారం ఉన్నట్లు అనిపించింది అతనికి. వంగి ఊడుస్తున్న ఆ పనిమనిషి అందాలన్నీ పైట కింద నుంచి గమ్మత్తుగా ఊరిస్తున్నాయి.

గోవిందరావు మత్తంతా క్షణంలో దిగిపోయింది.

ఒక్కసారి కళ్ళు మూసుకున్నాడు. అయినా




శకుంతల అందాలు అతన్ని కళ్ళు మూసుకోనివ్వలేదు. అనాలోచితంగా- నిద్రలో అటు తిరుగుతున్నట్లుగా దొర్లుతూ శకుంతల ఒంటి మీద చెయ్యేశాడు గోవిందరావు.

శకుంతల తలెత్తింది. గోవిందరావు ముఖంలోకి పరీక్షగా చూసింది. నిద్రలోనే పడిందా చెయ్యి అన్న రీతిలో నెమ్మదిగా తీసి మంచంమీద పెట్టింది.

--గోవిందరావుకు కొంచెం ధైర్యం వచ్చింది.

ఈసారి ఇంకొంచెం ధైర్యంగా ఆమె మీద చెయ్యేసి నెమ్మదిగా నొక్కాడు.

శకుంతల ఉన్నట్లుండి తలెత్తింది మళ్ళీ. గోవిందరావుకేసి సాలోచనగా చూసింది. అతనిది దొంగ నిద్రేనని కనిపెట్టినట్లుగా. చీపురు అక్కడే పడేసి గదిలోంచి బయటకు నడిచింది.

అతనికి భయమేసింది.

బయటకు వెళ్ళి ఆమె ఎవర్ని అయినా పిలుచుకు వస్తే...? ఏమైనా అల్లరి చేస్తే... ఎలా ఈ విపత్తు నుంచి తప్పించుకోవటం...?

క్షణం ఆలోచించాడు గోవిందరావు.

ఆలోచిస్తున్న కొద్దీ మతిపోయినట్లయిందతనికి. భయం నలుమూలలనుంచీ అతన్ని భయపెట్టసాగింది. ఇంకా ఆ గదిలోనే ఉంటే పిచ్చెక్కిపోతుందేమోనన్న సందేహంతో- లేచాడు.

పరుగులాంటి నడకతో గది దాటాడు. ఆఫీసు దాటాడు. వీధి దాటాడు. ఊరుదాటాడు.

ఊరి చివరనున్న బండరాళ్ళెక్కి కూర్చున్నాడు. దూరం నుంచి చూస్తే ఊరంతా నిశ్శబ్దంగా ఉంది. కానీ తనకు తెలుసు... ఊళ్లో... శకుంతల వెళ్ళి తన మొగుణ్ని పిలుచుకొచ్చి ఉంటుంది. వాడు పార్టీ ఆఫీసుముందు నిలబడి నానా రభస చేస్తుంటాడు. బండ బూతులు తిడుతుంటాడు. వందలాదిమంది అక్కడ నిలబడి చోద్యం చూస్తోంటే. పార్టీ తరపున పోటీ చేస్తున్న మునిరత్నం తన తరపున క్షమాపణ చెప్తుంటాడు. సాయంత్రం... బహిరంగసభలో ప్రతిపక్షం అభ్యర్థి మునిరత్నం పార్టీనీ, పార్టీ కార్యకర్తల నీతినిజాయితీలను తూర్పారపడుతుంటాడు. శ్రమించి బతుకు గడుపుకొనే శకుంతలవంటి శ్రామిక జీవి మీదే అందరిముందు అత్యాచారం జరిగితే, ఈ దేశం ఏం కావాలని అతను ప్రశ్నిస్తుంటాడు. సభకు హాజరైన అందరూ నిజమే సుమా! అన్నట్లు తలలూపుతారు. ఎన్నికలలో మునిరత్నం ఓడిపోతాడు, ఘోరంగా, ఘోరాతి ఘోరంగా... అంతా తన వల్లనే...!

ఒక్కసారి ఆలోచనలను విదిలించుకొన్నాడు గోవిందరావు.

ఊళ్ళో ఏం జరుగుతోందోనన్న ఆలోచన అతన్ని నిలబడనివ్వలేదు. బండరాళ్ళమీంచి దిగాడు. ఈరోజు కాకపోతే, రేపైనా వెళ్ళి వీళ్ళను ముఖతా కలవాల్సిందే తను. గత్యంతరంలేదు. అది తప్పనిసరి అయినప్పుడు ఇంకా ఆలస్యం దేనికీ, జరిగేదేదో ముందే జరిగిపోతే మంచిదన్న భావానికి వచ్చాడు--

అడుగులో అడుగు వేసుకొంటూ పార్టీ ఆఫీసు ఉన్న వీధిలోకి వచ్చాడు. వీధంతా నిశ్శబ్దంగా ఉంది.

బహుశా- లోపల గొడవపడుతున్నారు కాబోలు, అనుకొన్నాడు.

గుండెలు అరచేత్తో పట్టుకొని కదిలాడు.

అరుగెక్కి- ఆఫీసులోకి నడిచాడు.

ఆఫీసంతా మామూలుగా వుంది. ఎక్కడా ఏ గొడవా వున్న సూచనలేదు. లోపలికి నడిచాడు. పనిలేకపోయినా ప్రతి గదిలోకీ వెళ్ళాడు. కావాలని అందరి ముఖాలలోకి పరిశీలనగా చూశాడు.

--ఎక్కడా ఏమీ తేడా లేదు!

కనీసం తేడావున్నట్లు లేదు!!

'హమ్మయ్య!' అనుకొన్నాడు గోవిందరావు.

కానీ... అందరూ గొడవను తన రాకకోసం ఎదురుచూస్తూ వాయిదావేశారేమోనన్న అనుమానం కలిగింది. శకుంతల కనిపిస్తేగానీ... దీర్ఘంగా నిట్టూర్చుకోలేడు తను.

మనసంతా ఆందోళనలతోనిండీ వున్నా పైకి నిబ్బరంగా వున్నట్లు కనిపించే ప్రయత్నం చేస్తూవెళ్లి తన యథాస్థానంలో కూర్చున్నాడు గోవిందరావు. ఓటర్ స్లిప్పులు అందుకొని రాయటం ప్రారంభించాడు.

అయిదు నిమిషాల తర్వాత గదిలోకి వచ్చింది శకుంతల.

ఏమీ జరగనట్లే మామూలుగా పలక

రించింది- "బాబుగారూ... టీ తెచ్చిపెట్టనా?" అనడిగింది.

గుండెలమీంచి కొండల్నిదింపినంత తేలికగా ఫీలయ్యాడు గోవిందరావు. తలవూపాడు తెచ్చిపెట్టమన్నట్లుగా.

శకుంతల వెళ్లిపోయింది. కానీ అనలైన ప్రశ్నలు అప్పుడే తలెత్తాయి. తను చెయ్యివేసింది అనలు శకుంతల గుర్తించిందోలేదో - లేకపోతే - తను వేశాననుకుని భ్రమపడుతున్నాడో...

ఏమైతేనేం, గండం గడిచింది. అది చాలనుకున్నాడు.

మధ్యాహ్నంవేళ ఆఫీసులో అందరూ లంచ్‌కి వెళ్లినప్పుడు భయంతో తను కాలం గడుపుతున్నపుడు వచ్చింది శకుంతల - నెమ్మదిగా.

అటూఇటూ చూసి దగ్గరగా వచ్చింది.

"ఏమో అనుకొన్నా... అయ్యగారు రసికులే!" అంది చిన్నగా నవ్వుతూ.

శకుంతల దగ్గరకురాగానే గోవిందరావు గుండెల్లో గుబులు ఆరంభమయింది. ఏముంది ఈ ఆడదానిలో మహత్యం అనుకొన్నాడు. గదులు తుడుచుకుని బతికే అథమస్థాయి ఆడది... తనమీద ఇంతటి ప్రభావం చూపిస్తోందేమిటీ అనుకొన్నాడు.

ప్రశ్నలు ఎన్నో తలెత్తుతున్నా - వాటిని నొక్కిపట్టి నవ్వాడు.

ఆ ప్రశ్నలన్నిటికీ సమాధానం ఇస్తున్నట్లు, వేయి సమ్మోహనాస్త్రాలను ఒకేసారి సంధించి వదిలినట్లు - చిరునవ్వు నవ్వింది శకుంతల.

"ఆశ ఉంటే అలాగా చెప్పేది?" అని గమ్మత్తుగా ప్రశ్నించి, చిన్నగా అంది మళ్లీ-- "రాత్రి ఇక్కడే పడుకోండి!"

--గోవిందరావుకు భయమేసింది. ఎంతధైర్యంగా చెప్తోంది ఆ సంగతి! ఎవరైనా విని వుంటే?... గుటకలువేశాడు.

శకుంతల - గదిలోంచి వెళ్లిపోబోతూ - ఉన్నట్లుండి లోపలికివచ్చి - గోవిందరావు పెదవులమీద గాఢంగా ముద్దుపెట్టుకొంది. దెబ్బకు ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు! అనుకోని పరిణామం అది!! రెండు నిమిషాల తర్వాతకు



గోవిందరావు మామూలుమనిషి అయ్యాడు. ఒక్కసారిగా అతనికి వెయ్యిఏనుగుల బలం వచ్చినట్లుంది. నేలకు నాలుగడుగుల ఎత్తులో నడుస్తున్న రీతిలో ఫీలయ్యాడు.

పగలంతా సాయంత్రం ఎపుడవుతుందా అ ఎదురుచూస్తూవచ్చాడు గోవిందరావు. సాయంత్రంకాగానే రాత్రి ఎపుడవుతుందా అని చూడసాగాడు.

రాత్రి ఏడయింది. పార్టీ అభ్యర్థి మునిరత్నంవచ్చి ఎన్నికల ప్రచారంలో ప్రోగ్రెస్ గురించి సమీక్షించాడు. తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి కొన్ని సూచనలు ఇచ్చాడు. రోజూ ఆయన ఏంచెప్తారా, ఎలా ఈ ఎన్నికల రణరంగంలోంచి విజేతలమయి బయటపడతామా అని జాగ్రత్తగా ఆయననోటినుంచి వెలువడే ప్రతి అక్షరాన్నీ మననులోనే ముద్రించుకొంటూవచ్చిన గోవిందరావుకు ఆరోజు మాత్రం చాలా చికాకుగా అనిపించసాగింది. 'ఎందుకొచ్చిన సమీక్షలివన్నీ' అని విసుగ్గా మననులో అనుకొన్నాడు.

మునిరత్నం మాట్లాడటం అయిపోయిన అరగంటకు సమావేశం ముగిసింది. ఆ తర్వాత మరో అరగంట పిచ్చాపాటీ, అప్పటికి గడియారం తొమ్మిది వదయిందని చెప్పింది.

'ఈరాత్రి ఇక తెల్లవారదుకాబోలు!' అనుకొంటూ ఉన్నపుడు - అందరూ పార్టీఆఫీసు నుంచి బయటకు నడిచారు.

గోవిందరావు మాత్రం అక్కడే ఉండిపోయాడు.

ఈసారి చాపవేసుకుని దానిమీద పరుపువేసుకొని తలగడమీద తలపెట్టుకొని పడుకొన్న గోవిందరావుకు కంటిమీద కునుకురానేలేదు చాలాసేపటివరకు.

--శకుంతల వస్తుంది. వస్తే... ఏంచేయాలి తను?- అన్న ఆలోచనకు పలుసమాధానాలు వెతుక్కుంటూ అలాగే అలనటతో నిద్రపోయాడు.

-రాత్రివేళ ఎప్పుడో...

ఒంటిమీద ఏదో పాకుతున్నట్లయి ఉలిక్కిపడ్డాడు గోవిందరావు. ఆ మత్తులోనే అతనికి తెలిసింది పక్కనే ఉన్నది శకుంతల అనీ, తన ఒంటిమీద ఉన్నది ఆమె చెయ్యి అని! నిద్రమత్తంతా దెబ్బకు కరిగిపోయింది.

శకుంతలకేసిచూశాడు - కలలోంచి దేవత

ఎవరో కరుణించి తిన్నగా పక్కలోకి వచ్చేసిన ట్లుగా అనిపించిందతనికి. ఆబగా ఆమె అందాలను అందుకొన్నాడు. అప్పటికి ఎరగని కొత్తకొత్త రుచులు ఆనందంగా జుర్రుకోసాగాడు.

సహకరించసాగింది శకుంతల.

--విందు భోజనం పూర్తయ్యాక గదిలోని అతి చిన్న బెడ్‌లైట్ వెలుగులో ఆమె ఒంటి మీద వేలితో రాస్తున్నపుడు - అప్పుడు గుర్తొచ్చింది గోవిందరావుకు - "ఇలా వచ్చేశావ్‌గదా, మీ ఆయనకు తెలిస్తే?" అనడిగాడు.

"ఎలా తెలుస్తుంది?"

"ఒకవేళ ఇక్కడికి వచ్చేస్తే...?"

"రానీ - ఇక్కడే నరికిపోగులుపెట్టేస్తా! నువ్వంటే నాకేంభయం?" గోముగా అంది శకుంతల.

ఆ క్షణంలో శకుంతల అంటే చెప్పలేనంత ఇష్టం ఏర్పడింది గోవిందరావుకు. పార్టీ ఆఫీసులో కాలక్షేపం చేయటానికి వచ్చిన తనకు శకుంతల అనుకోకుండా లభించిన వరంలా తోచింది. అవసరమైతే శకుంతల అన్నట్లుగానే శకుంతల మొగుడు నర్సిములును నరికిపోగులు పెట్టయినాసరే, ఆమె అందాలు సొంతం చేసుకోవాలనుకొన్నాడు.

అనుకొన్నాడేకానీ - అలాగే చేయాల్సివస్తుందని కలలోకూడా ఊహించుకోలేదు గోవిందరావు.

-వారంరోజులపాటు రోజూ రాత్రిపూట శకుంతలతో కార్యక్రమం అతని దినవారీచర్య అయిపోయింది. చీకటిపడేసరికి అవురావురుమంటూ శరీరం - శకుంతల సాన్నిహిత్యాన్ని కోరేది. శకుంతల దగ్గరకురాగానే ఆబగా అల్లుకుపోయేవాడు గోవిందరావు.

అలా వారంరోజులు గడిచిపోయాయి.

---అనుకోకుండా ఆరోజు జరిగిన సంఘటన గోవిందరావు జీవితాన్నే మార్చేసింది.

ఊరి మధ్యలో వుంది శివాలయం. దాని ముందునుంచి వెడుతున్న రాజేశ్వరి అనే టీచర్‌మీద గుళ్లోంచి ఎవరో నీళ్ళు చల్లారు. అంతే... నిప్పంటుకొంది ఊళ్లో!!

"నేను నీళ్ళు బయటకు పారబోసినమాట [illegible]! ఆవిడమీద నేను పొయ్యలేదు!" [illegible] పూజారి.

[illegible]... కావాలని తనమీద చల్లిన నీళ్ళే ఆ[illegible] అంటుంది రాజేశ్వరి. "అమ్మా... క్షమించు, పొరబాటయింది!" అని ఒక్కమాట అనేస్తే మామూలు రోజుల్లో ఆ గొడవ సమసిపోయేటంతటి చిన్న విషయం అది.

కానీ అది ఎన్నికల సమయం.

మాటామాటా పెరిగి చివరికి-- పార్టీ ఆఫీసు వరకు వచ్చింది గొడవ. మునిరత్నంగారికి చెప్పి . ఆయనేం చెబితే అది అన్న ధోరణిలో అక్కడికి వచ్చిన జనంలో ఆవేశాలు పెరిగాయి. రాజేశ్వరి భర్త వేరే పార్టీవాడు కావటంవల్లనే ఈ గొడవంతా జరిగిందన్న భావం చాలా మందిలో ఏర్పడిపోయింది.

ఆవేశాలు సరిహద్దులుదాటిపోతోంటే, వాటిని సర్దటానికి వచ్చిన మునిరత్నం-- ఆ పరిస్థితికి తట్టుకోలేక మాట్లాడుతూ మాట్లాడుతూ వున్నట్లుండి కుర్చీలో కూలబడ్డాడు.

దాంతో మునిరత్నంకు గుండెపోటు వచ్చిందని ఒకవంక కొందరు ఆందోళన చెందుతుంటే, మరోవైపు మిగిలినవారు ఇదే సమయమనుకొని చెలరేగిపోయారు.

దొమ్మీ ప్రారంభమయింది.

---చేతికందిన కర్రలు, రాళ్ళు, సైకిల్ చైనులు-- ఒకటేమిటి అన్నీ అక్కడ వీరవిహారం చేస్తున్నాయి.

గోవిందరావు నివ్వెరపోయి నిలబడ్డాడు. మనిషిని రాజకీయాలు నడిపిస్తోంటే, మతులు ఎలా స్థానభ్రంశం చెందుతాయో అర్థంచేసుకునే ప్రయత్నం చేస్తూ అలానే వుండిపోయాడు చాలాసేపు.

-- ఉన్నట్లుండి ఒక రాయి వచ్చి తగిలింది గోవిందరావు తలకు. చిన్న కంకరరాయి కావడంతో-- బతికిపోయాడుగానీ లేకపోతే అక్కడే కుప్పకూలిపోయి వుండేవాడు. రాయి తగిలిన చోట చేత్తో తడుముకుంటే చేతికి వెచ్చటి రక్తం తగిలింది. దాంతో అతనిలోనూ తెలీని రాక్షసత్వం చోటుచేసుకుంది.

పార్టీ కార్యాలయం లోపలికి వెళ్లి చేతికందిన కర్ర తెచ్చాడు. బయటకు రాగానే ఎదురొచ్చిన వ్యక్తిమీద బలం అంతా వుపయోగించి ఆ కర్రతో కొట్టాడు. ఆ దెబ్బకు 'అమ్మా' అంటూ పడిపోయాడా వ్యక్తి.




కాళ్లదగ్గర పడ్డ వ్యక్తిని చూసి నివ్వెరపోయాడు– అతను శకుంతల మొగుడు నర్సిములు. అతనికేసి చూస్తోంటే గోవిందరావుకు తన ఆస్తిని దోచుకొంటున్న దోపిడీదొంగలా కనిపించాడతను. ఆవేశం కట్టలు తెంచుకొంది. ఎత్తిన కర్ర దించకుండా. నర్సిములు ఒంటి మీద కొడుతూనే వుండిపోయాడు.




అరగంట గడిచింది. పోలీసులు వచ్చి పరిస్థితి అంతా అదుపులోకి తీసుకొచ్చారు. జరిగింది ఏమిటో అందరికీ తెలుసుగానీ, ఆ చిన్న సంఘటనకే ఇద్దరి ప్రాణాలు పోవటం అందర్నీ ఆశ్చర్యంలో ముంచింది. చనిపోయిన ఇద్దరిలో ఒకడు నర్సిములు.

"ఈ ఊళ్లో గతంలో ఎప్పుడూ ఇలాటివి జరగలేదు. దొమ్మీలేమిటి ఈమాత్రం గొడవకే? అంటూ మునిరత్నం చెప్పలేనంత బాధపడ్డాడు. అంతకుమునుపెన్నడూ ఎరగని వ్యాకులంతో ఆ రాత్రే కన్నుమూశాడు మునిరత్నం.

ఎవరూ ఊహించుకోని సంఘటన అది.

అందరి దృష్టీ మునిరత్నంమీదే కేంద్రీకృతం కావటంతో, నర్సిములు మృతికి దొమ్మీని కారణంగా పేర్కొనటంతో-- గోవిందరావు అనుకోకుండా ఆ ఊబిలోంచి బయటపడిపోయాడు.

మునిరత్నం మరణంతో ఆ నియోజకవర్గంలో ఎన్నిక కౌంటర్‌మాండ్ అయిపోయింది. ఆర్నెల్ల తర్వాత జరిగిన ఎన్నికల్లో పోటీచేసేందుకు ఆ పార్టీ అభ్యర్థిగా గోవిందరావు ఎంపికయ్యాడు.

అంతే... ఆ తర్వాత ఆయన మళ్లీ ఎప్పుడూ వెనుదిరిగి చూడనేలేదు. రాజకీయంలో నేర్చుకున్న తొలి అక్షరాలే హత్య - అక్రమ సంబంధం కావటంతో గోవిందరావుకు అప్పుడపుడూ ఆత్మ కలుక్కుమంటూనే వుంటుంది గానీ– దాన్ని ఎప్పటికప్పుడు మందలిస్తూ దాని నోరు మూయ్యటాన్ని కూడా అతను అలవాటు చేసుకున్నాడు.

★ ★ ★

చాలారోజుల తర్వాత గుర్తుచేసుకొన్నాడు గతాన్ని గోవిందరావు. ఆ గతం అందమైనదికాదు. అది పదిసార్లు నెమరువేసుకోదగ్గదికాదు. పైకి చెప్పుకోదగిందీ కాదు. తనకు మాత్రమే పరిమితం కావాల్సిన గతమది.

ఆ గతం గుర్తొస్తే-- మనసొకసారి ఛెర్నాకోలాతో ఛెళ్లున వర్తమానాన్ని లాగి కొట్టినట్లు అనిపిస్తుంటుంది గోవిందరావుకు.

తన మంత్రుల్లో ఒకరి తర్వాత ఒకరుగా, అందరి జీవితాల్లోకీ తొంగిచూస్తూ వారిని బజారులోకి లాగుతున్న వాచస్పతి... చివరకు తన జీవితంలోకి వచ్చేస్తే...??

—ఆ గతం వర్తమానంలోకి వస్తే... తనకు భవిష్యత్తు వుండదు! ఇంతకాలం నిర్మించుకొంటూ వచ్చిన జీవితమూ వుండదు ! కీర్తిప్రతిష్టలూ వుండవు! తనను అలాంటి విషయాల్లో అగ్గిలాటివాడుగా భావిస్తున్న మైథిలి ముందు తలెత్తే అవకాశం కూడా వుండదు.

అలాటి క్షణాల్లో--

తనకు ఆత్మహత్య వినా గత్యంతరం వుండదు!

--ఈ దేశంలో ఆత్మహత్య చేసుకొన్న తొలి ముఖ్యమంత్రిగా తనప్పుడు రికార్డు సృష్టించినవాడవుతాడు!!

కానీ—

అలాటి రికార్డు తనకొద్దు!!

తన గతం తనతోనే మరణిస్తే చాలు! కనీసం అది వాచస్పతి దృష్టికి రాకుంటే చాలు-- అనుకొంటూ దేవుడికి దణ్ణంపెట్టుకొన్నాడు గోవిందరావు.

★ ★ ★

గోవిందరావు దగ్గర్నుంచి రాగానే వాచస్పతి తన పరిస్థితినంతా జాగ్రత్తగా బేరీజువేసుకున్నాడు.

ఎటుచూసినా పరిస్థితి కత్తిమీద సాములాగే

అనిపించిందతనికి.

కోరి కొరివి తో తలగోక్కుంటున్నాడాతను?

తన ఈ నాటి ప్రవర్తనవిధానం ఏయే ఫలితాల్నిస్తుందో భవిష్యత్తులో తెలుస్తుందే తప్ప ఇప్పుడు ఊహించుకోగలిగేది కాదు.

- వాచస్పతి ఆలోచనల్లో ఉండగా అతనికి ఫోన్‌వచ్చింది - "మీరా?" అన్నాడు వాచస్పతి పలకరింపుగా.

"ఏమిస్తానన్నారు సియంగారు?"

"నా పని నన్ను చేసుకోనిస్తే అదే పదివేలని చెప్పాను!"

"మంచిమాటన్నారు!"

"సరేకానీ... ఒక్కమాట- మీతో ఇంతకాలంనుంచీ నాకు పరిచయం ఉంది. కానీ... మీరెవ్వరోనాకు తెలీదు. ఒక్కసారి మీరెవ్వరో తెలియజెప్తే, నన్నింతవాడిని చేసినందుకైనా, నా కృతజ్ఞతలు చెప్పుకొంటాను. ఏదో చిన్న రిపోర్టర్‌గా ఉన్నవాడిని. సంచలన విలేకరిగా తీర్చారు. మీరెవరో చెప్తే...."

"తగిన సమయంలో అదీ తెలుస్తుంది!"

"ఇంతకీ మీకు ఈ సంగతులన్నీ ఎలాతెలుస్తున్నాయి? దీనికీ జవాబు చెప్పరా? పోనీ, ఇంకోటి..... గోవిందరావుగారి గురించి ఏమైనా తెలిస్తే చెప్పండి... చిన్నచిన్నవారిని దెబ్బకొట్టటం దండగ! కొడితే ఆయన్నే కొట్టాలి!" నవ్వుతూ అన్నాడు వాచస్పతి.

"ఆయన గురించా? ఆలోచిద్దాం... తగిన సమయం వచ్చినపుడు అదీ చెప్తాను! అయితే ఒకమాట, మీరు మాత్రం కొంచెం జాగ్రత్తగా ఉండండి! ఈలోగా మిగిలిన వారి సంగతీ ఆలోచించండి. సచ్ఛీలురు, సచ్చరిత్రులూ ఈ మంత్రివర్గంలో ఒక్కరూ లేరన్నది వరసగా రుజువు చేస్తూ రండి!"

- ఫోన్ డిస్కనెక్ట్ అయిపోయింది.

వాచస్పతి ఫోన్‌కేసే చూస్తూ ఉండిపోయాడు - ఏ ఆశాలేకుండా తనకెవరో సహాయం చేస్తున్నారనుకోవటం తెలివితక్కువ! అవతలి వ్యక్తి తనను ఎక్స్‌ప్లాయిట్ చేస్తోంటే, తాను అవతలి వ్యక్తిని ఎక్స్‌ప్లాయిట్ చెయ్యటంలో తప్పుందని అనుకోనవసరంలేదు! -- ఇది నిజానికి ఎక్స్‌ప్లాయిటేషన్ కూడా కాకపోవచ్చు. ఒకరి కొకరు సహాయపడటం కూడా కావచ్చు.

కానీ...... ఈరోజుల్లో అయాచితంగా, నిస్వార్థంగా ఎవరూ ఎవరికీ సాయపడరన్నది నిజం. అయినా, తాను ఇంతవరకూ ఎక్కడా అవతలి వ్యక్తికి ప్రత్యక్షంగా సహాయంచెయ్యనేలేదు. తన పని తాను చేసుకొంటూ పోతున్నాడు. పనిలోపనిగా అవతలి వ్యక్తికి లాభం చేకూరితే చేకూరవచ్చుగాక!!

- రెండు నెలల కాలం ఇట్టే గడిచిపోయింది. ఆ తర్వాత కాలంలో రెండు సంఘటనలు జరిగాయి. రెండూ ఒకదానికొకటి సంబంధంలేనివే అయినా, ఆ రెండూ రాష్ట్ర రాజకీయాలలో కీలకమైన పాత్ర వహించాయి -- ఒకదానికి కర్త వాచస్పతి కావటం విశేషం!

- వాచస్పతి ఆనాడు ఉదయం యధాలావంగా పత్రిక తిరిగేస్తోంటే కనబడింది ఆ ప్రకటన.

దేశంలో ప్రజలందరికీ కూడు, గుడ్డ, నీడా సమకూర్చటం ఈ ప్రభుత్వం విధి. కొన్ని విషయాల్లో ఈ ప్రభుత్వం నిజాయితీగానే ప్రవర్తిస్తోందన్నది అందరికీ తెలుసు. అయితే ఆశించిన ఫలం ఎవరికైతే దక్కాలో వారికి దక్కటం లేదంటే అది వేరేమాట -- దానికి కారణాలు వేరే ఉన్నాయి. వైకుంఠపాళిలో నిచ్చెనలు ఎక్కాలని ఆశించే జనం కోట్లాదిగా ఉంటే, పైకెక్కేవారిని కాటువేసి, గుటుక్కున మింగేందుకు సిద్ధంగా ఉన్న పాముల్లాటి నాయకులూ చాలా మందే ఉన్నారు.

సమృద్ధిగా కూడూ, గుడ్డా సమకూర్చటం ఎలాగూ జరగటంలేదు. గనుక, ఎలాగో నీడనైనా సమకూర్చటం మంచిదన్న సదాశయంతో ప్రభుత్వంవారు పలు సంస్థల్ని బతిమాలో, భయపెట్టో - కొన్ని నిధుల్ని రుణాలరూపేణా సంపాదించుకొంటున్నారు. వాటి ఆధారంగా కొన్ని ప్రదేశాలను గుర్తించి, వాటిలో పలు ఆదాయపు వర్గాలవారికి గృహనిర్మాణాన్ని చేపడుతున్నారు. అలా గృహనిర్మాణం చేపట్టిన ప్రదేశాల్లో ఒక్కటి - గుంటుపల్లి.

గుంటుపల్లి - రాజధానికి పదిహేను కిలోమీటర్ల దూరంలో ఉంది. వంద గడపలతో ఉండే ఆ పల్లి, కాలక్రమేణా ఇపుడో పెద్ద ఊరయింది. రాజధానిలో ఉండే వనరుల కారణంగా రాజధాని చుట్టూ ఎన్నో పరిశ్రమలు రూపుదిద్దుకొన్నాయి. పరిశ్రమలు పెరిగితే వాటికోసం,




వాటిలో ఉద్యోగాలకోసం రాజధాని చేరే జనాభా కూడా పెరుగుతుంది. వీరంతా రాజధాని నడిబొడ్డులో కాపురంపెట్టడం కష్టం కాబట్టి, పరిసర ప్రాంతాలలో నివాసం ఏర్పాటుచేసుకొంటారు. ఇదిగో ఇలా పెరిగింది గుంటుపల్లి. అక్కడే వెయ్యి ఎకరాల స్థలాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకొని, గృహనిర్మాణం చేపట్టింది.

- అక్కడ ఇళ్ల నిర్మాణం పూర్తయింది. ఎవరికి ఇళ్ళు కావాలో, వాటికోసం దరఖాస్తులు పెట్టుకోమంటూ వచ్చిన ప్రకటన అది!! మొత్తం రెండువేల ఆరొందల ఇళ్ళు నిర్మించినట్లు ఆ ప్రకటన చెప్తోంది.

వాచస్పతికి ఆ ప్రకటన చూస్తోంటే -- అందులో ఏదో కుంభకోణం జరిగి ఉంటుందని అనిపించసాగింది. సిక్త్స్‌సెన్స్ అన్నది ఉంటుందని వాచస్పతికి తెలుసుగానీ అదిలా ఉంటుందని, దాని గొంతు ఇంతలా మనసులో ప్రతిధ్వనిస్తుందని అతనికి తెలీదు. తొలిసారిగా అతనికా అనుభవం అయింది. ఎందుకో - ఆ ప్రకటన వెనక్కు వెళ్లి పరిశోధన చేపట్టటం మంచిదనిపించింది. అలా అనిపించాక – వాచస్పతి క్షణం ఆలస్యం చెయ్యలేదు.

ముందుగా లైబ్రరీకి వెళ్ళి గృహనిర్మాణ సంస్థ కార్యకలాపాలకు సంబంధించిన అంశాలన్నీ చదివాడు. గృహనిర్మాణం జరపటానికి చేపట్టే స్థలసేకరణ, దానికి ఇచ్చే నష్టపరిహారం వంటి అంశాలన్నీ అర్థంచేసుకొన్నాడు. గృహనిర్మాణానికి కాంట్రాక్టులు పిలిచే పద్ధతి, ఇచ్చే పద్ధతి- ఆ తర్వాత గృహాల నిర్మాణానంతరం వాటిని సామాన్య ప్రజలకు కేటాయించే విధానం- అన్నీ కూలంకషంగా అర్థం చేసుకొన్నాడు.

గృహనిర్మాణ సంస్థ కేంద్ర కార్యాలయానికి వెళ్ళి గుంటుపల్లి గృహనిర్మాణ పథకానికి సంబంధించిన వివరాల సేకరణకు పూనుకొన్నాడు.

అప్పటికే వాచస్పతికి మంచి రిపోర్టర్‌గా, అతని పత్రికకు మంత్రులను ఇంటికి పంపించగల శక్తిస్థోమతలున్న పత్రికగా పేరు రావటంతో అతను వివరాలు అడిగేసరికి అందరూ ఉలిక్కిపడ్డారు. అధికారులు ఒకరి ముఖాలు ఒకరు చూసుకోవటం ఆరంభించేసరికి- వాచస్పతికి తెలిసిపోయింది- ఆ పథకంలో ఏదో కుంభకోణం జరిగిందని.

తెలుసుకోవాల్సిందంతా- అదేమిటన్నదే!

వార్తల సేకరణకు విలేకరికి కావాల్సింది- 'నోస్ ఫర్ న్యూస్' అంటారు. వార్తలెక్కడ ఉంటాయో ఊహించి చెప్పగలగటం, అక్కడ వార్తల కోసం అన్వేషణ జరపటం- విలేకరికి వెన్నతోపెట్టిన విద్య అయివుండాలి. వాచస్పతికిపుడు అది ఉగ్గుపాలతోనే అలవాటయిన కూసు విద్య అయింది.

గుంటుపల్లి రాజధానికి సమీపంలోనే ఉండటంతో ఆ గృహాల వక్కనుంచి వేలాది కాదు, లక్షలాదిమంది ప్రజలు అటూఇటూ తిరిగే ఉంటారన్నది నిజం.

అయినా-

ఎవ్వరూ ఊహించనిది వాచస్పతి ఊహించగలిగాడు.

ఫలితమే- మనసులో సిక్స్‌త్ సెన్స్ చిన్నగా చెప్పిందికాస్తా వార్తా పత్రికలో పతాక శీర్షికకు ఎక్కదగిన వార్తగా రూపొందుతోంది.

గృహ నిర్మాణ పథకాలకు రాష్ట్రప్రభుత్వం పూర్తిగా తన జేబులోంచి తీసిన డబ్బే ఖర్చుపెట్టదు. కేంద్రప్రభుత్వం, కేంద్రప్రభుత్వ సంస్థలు ఎన్నో ఈ పథకాలకు డబ్బు రుణరూపంగా ఇస్తుంటాయి. ఈ రుణాలు పొందటానికి పథకానికి సంబంధించిన అన్ని విషయాలూ కేంద్ర ప్రభుత్వ సంస్థలకు తెలియజేయాల్సి ఉంటుంది. కేంద్రానికి పంపిన వివరాలలో గుంటుపల్లిలో రెండువేల ఆరొందల యాభై ఇళ్ళ నిర్మాణ పథకానికి రుణం కోరుతున్నట్లుగా ఉంది.

–కానీ ప్రకటనలో మాత్రం ఉన్నవి రెండు వేల ఆరొందల ఇళ్ళే!

పథకం కాగితాలలోంచి కార్యరూపంలోకి వచ్చేసరికి యాభై ఇళ్ళు జారిపోవటం అసాధ్యం! అంటే... అసలు ఎన్ని ఇళ్ళు నిర్మించారో చూసుకోవటం అవసరం. అడిగితే చెప్పని విషయాన్ని స్వయంగా అన్వేషించి తెలుసుకోవటం మంచిది.

వాచస్పతి గుంటుపల్లికి పయనమయ్యాడు– మండుటెండులో, నిర్మానుష్యంగా ఉన్న ఆ వేలాది ఇళ్ళ మధ్య ఒంటరిగా మసలుతూ ఒక్కో బ్లైపుకు చెందిన ఇళ్ళుఎన్ని రూపుదిద్దుకొ




న్నాయో- ఓపిగ్గా లెక్కపెట్ట నారంభించాడు.

లెక్క పూర్తయ్యేసరికి-- సరిగాయాభై ఇళ్ళు ప్రకటనకన్నా అధికంగా నిర్మితమయినట్లు స్పష్టమయింది. వార్తా పత్రికలో వచ్చిన ప్రకటనలో ఏయే సైపు ఇళ్ళు ఎన్ని కేటాయిస్తున్నారో వాటి సంఖ్యా కూడా ఇచ్చారు గనుక-- వాచస్పతి పని తేలికయింది.

పథకం మొదలయ్యేరోజుకు, పూర్తయ్యేరోజుకు మధ్యకాలంలో ప్రజల ముందునుంచి మాయమైనవి- యాభై ఇళ్ళు. అన్నీ పేరుకు మధ్యాదాయ వర్గాలకు చెందినవే అయినా, నిజానికి ఆ ఇళ్ళకు అటూఇటూ కూడా మిగిలిన ఖాళీ స్థలాన్ని లెక్కలోకి తీసుకొంటే అవన్నీ ఉన్నతాదాయ వర్గాలకు చెందినవే అవుతాయి.

—వాచస్పతి ఉలిక్కిపడ్డాడు.

మళ్ళీ వెనక్కు గృహనిర్మాణ సంస్థ ప్రధాన కార్యాలయానికి చేరాడు. తిన్నగా సంస్థ అధిపతితో ఇంటర్వ్యూ కోరాడు. ఆయన ఇంటర్వ్యూ ఇవ్వటానికి సిద్ధమేగానీ, వచ్చేనెలకు కానీ తనకు అంత ఖాళీ ఉండదని చెప్పాడు. వాచస్పతికి తెలుసు- అది తనను కలుసుకొనేందుకు ఇష్టంలేక వేస్తున్న వేషమని.

ఇంక మిగిలింది ఒకే పద్ధతి- అది ఏమిటో వాచస్పతికి తెలుసు.

ప్రతి ఆఫీసులోనూ ఆ ఆఫీసుపట్ల ఏదో కారణంవల్ల అయిష్టతో, అసహ్యమో పెంచుకొన్న వ్యక్తులు కొందరు ఉండనే ఉంటారు. ఆ కారణం ఏదైనా కావచ్చు- పైఅధికారిపట్ల కోపమో, తనకు అన్యాయం జరిగిందన్న భావమో- ఇదేదో కాకుంటే జరుగుతున్న అన్యాయాలపట్ల బాధో... ఏదో ఒకటి! సాధారణంగా తమకు అన్యాయం జరిగిందన్న భావనలో ఉండేవారే అధికం. అలాటివారిలో ఒకర్ని ఏరుకోవాలి, బుజ్జగించాలి, లాలించాలి. అవసరమొస్తే ఏదో లంచం ఇవ్వటమో, ఆశ చూపటమో చెయ్యాలి! అసలు నిజాలు అపుడు వాటంతటవే బయటకు తన్నుకొస్తాయి.

అలాటి వ్యక్తి కోసం వాచస్పతి నాలుగురోజులు అన్వేషించాల్సి వచ్చింది. రోజూ ఉదయమే పదింటికి ఆ ఆఫీసుకు వెళ్ళి రెండు మూడు గంటలు గడిపేవాడు. అసంతృప్తి నిండినవ్యక్తి ఏదో ఒకక్షణంలో బరస్ట్ అయితీరతాడు. అలాటి క్షణాల్లో పట్టాలి అతన్ని.

వాచస్పతి ప్రయత్నాలన్నీ అయిదోరోజు ఫలితమిచ్చాయి.

ఆరోజు--

పాన్‌షాప్ ముందు ఉన్నట్లుండి ఏదో ఘర్షణ ఆరంభమయింది. 'ఎక్కడ గొడవ ఉండునో అక్కడ వాచస్పతి ఉండును' అన్నరీతిలో వాచస్పతి అటు కదిలాడు.

అక్కడ- ఒక నలభై- నలభై అయిదేళ్ళ వ్యక్తి ఇంకొకణ్ణి పట్టుకొని బండబూతులు తిడుతున్నాడు. మధ్యమధ్యలో నాలుగు తరతమభేదాలకు తన వద్ద తావు లేదన్నట్లుగా ఆ పాన్‌షాప్ వాడికీ వడ్డిస్తున్నాడు. వాచస్పతికి అయిదు నిమిషాలకు అసలు సంగతి అర్థమయింది-- పాన్‌షాప్‌వాడు అతనికి కాక అతని తర్వాత వచ్చిన వ్యక్తికి ముందుగా పాన్ ఇచ్చాడు. ఇలా 'అగ్రతాంబూలం' ఇంకోరికి అందటంతో ఇతను బుసలుకొడుతున్నాడు... విషం కక్కుతున్నాడు.

వాచస్పతికి ఆ చిన్న విషయంలో తగువు అర్థంలేదనిపించింది. అందుకే అందరూ చూస్తూ ఊరుకొన్నా తను ఊరుకోలేకపోయాడు. అడుగుముందుకు వేశాడు. నెమ్మదిగా అన్నాడు-- "ఏమిటి సార్... ఇంత చిన్న విషయానికి కూడా..."

వాచస్పతి మాటింకా పూర్తికాలేదు. అవతలి వ్యక్తి తలెత్తాడు. గట్టిగా అరుస్తున్నట్లుగా అన్నాడు-- "చిన్న విషయమా ఇది! మీకేం తెలుసండీ ఇక్కడ జరుగుతున్నది! అసలు ఆ అయిదంతస్థులపైనుంచి ఇదిగో ఈ కిందనున్న పాన్‌షాప్ వరకు అంతా అన్యాయమే! ఎవడికివాడు ఎదుటివాణ్ని నాశనంచేద్దామనే చూస్తున్నాడు... ఆఫ్టరాల్, వీడెంత... మేం నమిలిపారేసే పాన్‌లంత ఖరీదు చెయ్యడు! వీడిక్కూడా మేం లోకువే! వదలనండీ... చూస్తున్నా, ఏరోజు దొరుకుతుందా అవకాశం అని" ఇంకా మాటల్ని ఈటెల్లాగ వదులుతూనే ఉన్నాడు.

--వాచస్పతికి ఆ క్షణంలో తనముందున్న వ్యక్తే తనకు కావాల్సినవాడనిపించింది. పట్టుకొన్న అతని చేతిని వదలకుండా -- నెమ్మదిగా ఏవేవో నాలుగైదు మాటలు చెప్తూ ముందుకు

నడిపించాడు. ఆఫీసు కాంటీన్‌లోకి లాక్కెళ్లాడు. కూల్‌డ్రింక్ తెచ్చాడు.

"మనం చదువుకున్నవాళ్లం! ఇలా రోడ్డు మీద పడితే ఏంబాగుంటుంది చెప్పండి?" అన్నాడు వాచస్పతి అనునయంగా.

అవతలి వ్యక్తి క్షణం ఆగాడు-- "నిజమేనండీ! అది నాకు తెలుసు. కానీ ఇదిగో, ఇక్కడ -ఈ గుండెల్లో మంట అలాటిదండీ -- ఏంచేస్తాను... దాన్ని ఆర్పుకోలేను. అందుకే ఇలా ఆవేశంతో కేకలేస్తాను!" అంటూ ఆగి తర్వాత, అన్నాడు-- మీకు తెలీదా సార్! ఇక్కడ అంతా ఒక పద్ధతి ప్రకారం జరుగుతోంది దోపిడీ! ఆ దారిదోపిడీగాళ్లకు ఎవడు పక్కవాద్యాలతో బాజాభజంత్రీలు మోగిస్తుంటే వాడికే ఇక్కడ పెద్దపీట వేస్తున్నారు. అదేమిటని అడిగినందుకే నామీద యాక్షన్ తీసుకొన్నారు. అందుకే నాకీ కడుపుమంట!"

"అసలు ఏం జరిగిందండీ? అన్యాయం





జరిగితే పైఅధికార్లకు చెప్పుకోవాలిగానీ ఇలా పాన్‌షాప్‌వాళ్లతో గొడవపడితే ఏంఒరుగుతుంది మీకు– బజార్లో రభసతప్ప, పదిమంది ముందూ చులకన అవటం తప్ప"

"నిజమే... కానీ పైఅధికార్లు ఎవరు? చిన్నవాడు లింగాన్ని మింగితే పైవాడు గుడిని మింగుతున్నాడు. ఎవరికి చెప్పుకొంటాం కష్టాలిక! రోడ్డుమీదపడితే, ఏదేవుడైనా వినకపోతాడా అనిపిస్తుంది. నలుగురూ ఈ విషయం విని ఈ గాజుకొంపల్లో ఉండేవారి నెత్తిమీద

నాలుగు రాళ్లు విసరరా అనిపిస్తుంది! అందు కే కావాలని వారంపదిరోజులకోసారి అలా అరు స్తుంటాను'' అన్నాడు ఆ వ్యక్తి.

''అంత మాత్రాన సమస్యలన్నీ పరిష్కారం అవుతాయా?''

''అవవు ! కానీ మీకో నిజం చెప్తానుసార్ — ఈ దేశంలో పెద్దతలకాయలన్నీ సంతృప్తితో త్రేన్చి తిరుగుతున్నవే! ఎటొచ్చీ అవి తింటు న్న తిండి అంతా తమ కంచాలలోదేనన్న సంగతి చిన్న తలకాయలవారికి తెలీడంలే దు-- అదే దౌర్భాగ్యం!!''

''దేన్ని గురించి చెప్తున్నారు మీరు?''

''ఒకటేమిటండీ — దేనిగురించైనా చెప్పగ లను నేను! ఇక్కడ జరుగుతున్న నేరాలు... అవి నేరాలకింద లెక్కకు రావీ దేశంలో! హత్యలు, మానభంగాలు, దొంగతనాలు, దో పిడీలు మాత్రమే ఈ దేశంలో నేరాలు! అవి నీతి, ఆశ్రిత ప్రీతి, ఎదుటివాణ్ని సజీవంగా నమిలిమింగెయ్యటం - ఇవేవీ నేరాలు కావు ఇక్కడి చట్టాల ప్రకారం! అవి ఘోరాలు. అలాటి ఘోరాలు వందలుకాదు, వేలుకాదు, లక్షలు లక్షలు జరుగుతున్నాయి ఈ భవ నంలో! అన్నీ ఒకటొకటిగా చెప్పగలను. కానీ... ఏంజరుగుతుంది చెప్పండి! ఎవరు పట్టించు కొంటారో చెప్పండి!!''

వాచస్పతి నెమ్మదిగా అడిగాడు-- ''ఒకరు కాదు, వందలమంది మీరు చెప్తున్న దాన్ని పట్టించుకునేలా చేస్తాను. నాకు నిజం చె ప్పండి-- ఇక్కడ జరుగుతున్న అన్యాయాలను ఒకటొకటిగా బట్టబయలుచేద్దాం!''

అవతలివ్యక్తి ఉలిక్కిపడ్డాడు - ''మీరేం చేస్తారో? అసలు ఎవరు మీరు? సిఐడీయా? విజిలెన్సా... ఎవరు మీరు?''

వాచస్పతి నవ్వాడు-- ''మీరు చెప్పిన రెండు డిపార్ట్‌మెంట్‌లవాడినికాను. అంతకు మించినవాడిని. ప్రజల మనిషిని-- నేను రిపో ర్టర్‌ను!'' అంటూ వాచస్పతి జేబులోంచి తన గుర్తింపు కార్డుతీసి చూపించాడు.

అవతలివ్యక్తి అది తీసుకొని చూసి తిరిగి ఇచ్చేశాడు.

అది మడత పెట్టుకొని, జేబులో పెట్టు కొంటూ అన్నాడు -- ''ఇప్పుడు చెప్పండి...''

''చెప్తాను... కానీ ఒకటే షరతు! నా పేరె క్కడా బయటకు రాకూడదు. మీరా హామీ ఇస్తే చెప్పటమేకాదు, సాక్ష్యాలు కూడా అందిస్తాను!''

వాచస్పతి నవ్వాడు-- ''పత్రికల గురించి మీకు తెలియదేమోగానీ... ఏ పత్రికా విలేకరీ తనకు లభించిన సమాచారం ఎక్కడినుంచి లభించిందో ఎవరికీ చెప్పాల్సిన పనిలేదు. తన సమాచారానికి సోర్స్ ఎవరో, ఏమిటో ఏ విలేకరీ-- ఆఖరికి కోర్టులో కూడా చెప్పాల్సిన అగత్యంలేదు. సమాచారం తప్పా రైటా అన్న దే ప్రశ్న. అంతకుమించి దాని తెరవెనక తతంగానికి వెళ్లే హక్కు ఈ దేశంలో ఎవరికీలే దు-- మీకా భయం అక్కర్లేదు!''

''అయితే సరే... ఇక్కడొద్దు సాయంత్రం మా ఇంటికి రండి. మీకు నేను సాక్ష్యాలు కూడా చూపిస్తాను'' అన్నాడు సెలవు తీసుకొంటూ-- తన అడ్రసు ఇచ్చి.

వాచస్పతి లేచాడు.

కాంటీన్లోంచి బయటికొస్తూ అడిగాడు-- ''అ సలు మీతో ఇంత పరిచయం పెరిగింది కానీ మీ పేరు తెలీలేదు నాకు!''

''నా పేరు...'' ఆగాడు అతను. ''మీరే అన్నారు మీకు సమాచారం తప్పో రైటో ము ఖ్యంగానీ సోర్స్ కాదని! ఈ సోర్స్ పేరు మీకెందుకులెండి!'' అంటూ నవ్వేశాడు అవ తలివ్యక్తి.

వాచస్పతి అతనివంక ప్రశంసాపూర్వకంగా చూశాడు ''మీ పేరు చెప్పనక్కర్లేదు. కానీ అది తెలుసుకోవటం పెద్ద కష్టమేమీ కాదు. అయినా మీ నోటినుంచే పేరు తెలుసుకొంటే బాగుంటుందని అడిగా...''

''మీరా షాపు దగ్గరికి వెళ్లి నాపేరు అడిగితే చాలు, అతనే చెప్తాడు. అది నాకు తెలీకకాదు. అయినా ఊర్కే అన్నాను. అన్నట్లు నాపేరు దిగంబరరావు''

''నాపేరు మీకు తెలును-- వాచస్పతి!'' అన్నాడు వాచస్పతి వీడ్కోలు తీసుకొంటూ.

దిగంబరరావు పేరుకు సరిగ్గా సరిపోయేట ట్లు నిజాల్ని దిగంబరంగా నడివీధుల్లో ఉంచా లనే కోరిక ఉన్నమనిషి.

--వాచస్పతి చిన్నగా నవ్వుకొన్నాడు.

ఆ సాయంత్రమే దిగంబరరావు ఇంటికి




వెళ్ళాడు వాచస్పతి. అప్పటికే దిగంబరరావు వాచస్పతికోసం ఎదురుచూస్తూ వున్నాడు. వాచస్పతిని చూడగానే అతని ముఖం విశాలమయింది.

"రండిసార్... రండి" అన్నాడు ఆదరంగా ఆహ్వానిస్తూ.

వాచస్పతి ఇంట్లోకి నడిచాడు.

చిన్న ఇల్లు. ఒక డ్రాయింగ్ రూం, ఒక బెడ్ రూం, కిచెన్. ఇల్లు చిన్నదే అయినా పొందికగా ఉంచుకొన్న తీరుతెన్నులు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

వాచస్పతి తమ ఇంటిని పరిశీలనగా చూడటం గమనించి అన్నాడు దిగంబరరావు– "ఇల్లు చిన్నదే అయినా కన్వీనియెంట్‌గా వుంటుందని తీసుకొన్నాం. అద్దె కొంచెం ఎక్కువే– మూడొందల యాభై. కాని ఏంచేస్తాం? తక్కువ ఇచ్చినా ఇళ్ళు దొరుకుతాయి గానీ వాటిలో ఒకటేమిటి, ఎన్నో ఎంచుకోవాల్సి వుంటుంది. కరెంట్ మీటరు, వాటర్ మీటర్, బాత్‌రూం, లెట్రిన్... అన్నీనూ! దానికన్నా ఇది నయం!"

వాచస్పతి తలవూపాడు– అవునన్నట్లు.

అద్దెఇళ్ళ అగచాట్లు తనకు తెలీనవికావు చదువుకొనే రోజుల్లో ఖచ్చితంగా పదింటికి కరెంట్ ఆఫ్ చేసేసేవాడు ఆ ఇంటి ఓనర్. 'పరీక్షలయ్యాబాబూ' అంటే 'అయితే నాకేం!' అనేవాడు. 'చదువుకోవాలి లైటుంచండి' అంటే 'ఆఖరి రోజుల్లో చదివి ఏంరాస్తావ్‌లే!' అని నవ్వేవాడు. అతననేది నిజమే అయినా... ఆరోజుల్లో చదువుకొన్నది ముఖ్యమేగదా! కానీ ఏంచేస్తాడు తను... అద్దెకున్నవాడు యజమానికి లోకువ.

అందుకే– తలవంచుకొని, షరతులకు ఒప్పుకొని బతికేవాడు– అద్దె ఎక్కువ ఇచ్చుకోలేడు గాబట్టి. కానీ... ఇప్పుడు... అద్దె రవ్వంత ఎక్కువ ఇవ్వటానికి సిద్ధపడ్డవాళ్ళకు మంచి ఇళ్ళేలభిస్తున్నాయి! అది మేలేగదా!!

వాచస్పతి అదే అన్నాడు నవ్వుతూ–

"నేనొప్పుకోనండీ– అసలు ఎవడికైనా అద్దె ఇంట్లో బతకాల్సిన ఖర్మ ఏమిటండీ? అందరూ సొంత ఇళ్ళు కట్టుకోలేరు. కట్టుకోగలిగిన స్థోమత అందరికీ వుండదు. ఈ సంగతి మన ప్రభుత్వాలకు తెలుసుగదా! అందుకేగదా, ఈ హౌసింగ్ బోర్డులలాటివి పెట్టింది. మరి... వాటివల్ల ఏంజరుగుతోంది? ప్రభుత్వానికివుండే సదుద్దేశాల్ని కొందరు దౌర్భాగ్యులు తమ సొంతం చేసుకుంటున్నారు. అందుకేనండీ, అవన్నీ చూస్తూ ఊర్కోలేక... ఇదిగో ఈ దారిని పట్టాను!" అన్నాడు దిగంబరరావు.

"గుంటుపల్లి గురించి చెప్పండి!" అన్నాడు వాచస్పతి తిన్నగా విషయంలోకి వచ్చేస్తూ.

దిగంబరరావు లేచాడు. ముందుగా వీధి తలుపు వేసేశాడు. ఆ తర్వాత లోపలికి వెళ్ళి ఒక ఫైలు తెచ్చాడు. ఫైలు మీద 'సీక్రెట్' అని ఉంది. దాన్ని వాచస్పతి బల్లమీద పెట్టాడు. "చూడండి!" అన్నాడు.

వాచస్పతి ఫైలు విప్పాడు.

–ఒక్కో కాగితం తిప్పుతున్నకొద్దీ, వాచస్పతికి జ్ఞానోదయం అవుతున్నట్లుగా అనిపించింది- ఒక్కో కాగితమూ ఈ దేశంలో పెద్దల బుద్ధుల్ని పదిమందికీ స్పష్టం చేస్తున్నట్లుగా ఉన్నాయి. గుంటుపల్లి పథకంలోంచి జారిపోయిన ఆ యాభై ఇళ్ళూ ఎలా పెద్దల చేతుల్లోకి చేరిపోయాయో క్రమంగా అర్థం అవుతూ వచ్చింది వాచస్పతికి.

ఉన్నవాటిలో యాభై ఇళ్ళను ప్రజల దృష్టికి తేకుండా ముందే 'తమ'వారికి కేటాయింపులు జరుపుతున్న ఆర్డరు కాగితాలవి! 'డిస్క్రెషన్' పేరు మీదుగా జరుగుతున్న మోసమది!!

వాచస్పతికి ఆ కాగితాల్లో ఉన్న అడ్రసులు చూస్తోంటే మతిపోతోంది. దొరతనంగా లక్షలు గడించిన వ్యక్తులుగా లోకంలో చాలామణి అవుతున్న పెద్దలువాళ్ళు. దొంగతనంగా ప్రజల కళ్ళల్లో దుమ్ముకొట్టి చౌకలో మంచి ఇళ్ళు కొట్టేస్తున్న ప్రబుద్ధులువాళ్ళు!! ఒకరా, ఇద్దరా– అన్ని రంగాలకూ చెందిన ప్రముఖులందరూ వున్నారు. ఆ కాగితాల్లో దూరిన దొంగల్లో. సంగీత, సాహిత్య, రాజకీయ, సాంఘిక... ఒకటేమిటి, అన్నిరంగాలకు చెందినవారూ వున్నారు. నోటినిండుగా నీతులు చెప్పేవారే కంటినిండుగా మట్టి గొడుతున్నారు.

వాచస్పతి గుటకలు మింగాడు.

ఈ ఇళ్ళ కేటాయింపుల వెనుక గృహనిర్మాణ శాఖమంత్రి హస్తం వుండనేవుంది!– ప్రతి ఫైలులోను రెండు భాగాలు ఉంటాయి.

ఒకవైపు కరస్పాండెన్స్, రెండోవైపు నోట్స్. బయటివారు రాసిన ఉత్తరాలను చదివి, అందులోని 'పాయింట్స్'ను క్లుప్తంగారాసి, పై అధికారుల ఆజ్ఞలు పొందటం జరుగుతుంది. ఆ ఆజ్ఞలను అనుసరిస్తూరాసే ఉత్తరాలు. దానికి మళ్ళీ బయటివారు రాసేవీ– అన్నీ 'కరస్పాండెన్స్' వైపు పెడతారు. పాయింట్స్ రాసి పైవారి ఆజ్ఞలు పొందే భాగాన్ని 'నోట్స్' అంటారు. నోట్ ఫైల్లో గృహనిర్మాణ శాఖ మంత్రి 'డిస్క్రెషన్ ఉపయోగిస్తూ, వీరికి గృహాల కేటాయింపు జరపవచ్చు'నని రాశారు. దానికి తన ఆమోదముద్ర తెలిపారు.

వాచస్పతి అంతా చదివాడు. దానికి అరగంట పట్టింది. క్షణం తర్వాత ఫైలు మూశాడు.

"అదండీ సంగతి!" అన్నాడు దిగంబరరావు.

"చాలా ఆశ్చర్యంగావుంది. నమ్మబుద్ధికావటంలేదు!" అన్నాడు వాచస్పతి.

"ఈ ప్రపంచమే ఇలావుంది సార్! ఎదుటివాడి నెత్తిమీద కాళ్ళుపెట్టి తాము పై అంతస్థుకు వెళ్ళాలనుకొనే రకం వీళ్ళు! ఇలాంటివాళ్ళను నాలుగు నిలువుల లోతున పాతెయ్యాలి!"

"మనం చెయ్యగలమా ఆ పని? ఒకటా, రెండా... చూస్తోంటే అన్ని రంగాల్లోనూ కనిపిస్తున్నారు!"

"నిజమేసార్.... మీలాంటి వాళ్ళుంటే పట్టుకోవడం కష్టంకాదుసార్! మనదేశంలో జర్నలిజం పెద్దగా పెరగలేదుగానీ విదేశాల్లో అయితే ప్రభుత్వాల్నే కూల్చిపారేస్తున్నారు– మీకు తెలీంది ఏముంది. వాటర్‌గేట్ కథ అదే– ఇప్పుడు వాల్థీమ్ కథా అదే!"

–వాచస్పతికి ఆ రెండు ఉదంతాలూ గుర్తొచ్చాయి. వారెక్కడ? మనమెక్కడ? ఎందుకొచ్చిన పోలికలివి! పేరుకు ఒకటే వృత్తి అయినా వారికి ఉన్న దీక్షాదక్షతలు తమకెక్కడివి??

–అయినా... దిగంబరరావు... ఉదయం పాన్‌షాప్ దగ్గర గొడవపడిన వ్యక్తేనా ఇతను? అప్పట్లో రోడ్‌సైడ్ వేగబాండ్‌లాగా అనిపించాడు.




ఇప్పుడు దేశంలో అన్యాయాలకు, అక్రమాలకు గురవుతున్న లక్షలు... కోట్లు నోరులేని, నోరున్నా ఏమీ చెయ్యలేని వారి ప్రతినిధిలా ఉన్నాడు. తనుగనుక... మాట తప్పి ఈ సమాచారం అందించింది దిగంబరరావేనని ఒక్కమాట చెబితేచాలు... అయిపోతుంది అతని కథ. ఉద్యోగానికి తప్పదు ఎసరు. అయినా ధైర్యంచేసి చెప్తున్నాడు! ఒక్కోవచ్చినిజాన్ని బయటపెడుతున్నాడు.

"కొంచెం జాగ్రత్తగా ప్లాన్ చెయ్యండిసార్! దెబ్బకు మా సంస్థ రూపుమారిపోవాలి. పైవాళ్ళు కొందరు బలి అయితే తప్ప కిందివాళ్ళకు బుద్ధిరాదు! మీతోబాటూ నేనూ వస్తా. ఈ ఫైల్లోని కాగితాలన్ని జిరాక్స్ తీయించుకోండి. ఫైలు ఇచ్చేయండి. తీసుకెళ్లి ఎక్కణ్నించి తెచ్చానో అక్కడ పెట్టేస్తా! ఈపని చేసింది నేనని ఎవ్వరూ గ్రహించలేరు!"

వాచస్పతి ఆశ్చర్యంగా అడిగాడు– "ఈ ఫైలు మీ చేతిలో ఎలాపడింది? దీనిమీద సీక్రెట్ అని రాసి ఉందిగదా?"

దిగంబరరావు నవ్వాడు– "భలేవారుసార్ మీరు! మా ఆఫీసు సంగతి మీకుతెలీదు. అక్కడ అన్ని ఫైళ్లూ రహస్యమే అయినా అన్ని సంగతులూ బట్టబయలే. ఈ సంగతి రేపు మీపేపర్లో వచ్చినా– ఎవ్వరూ నన్ను అనుమానించరు! పైవాళ్లంటే మా ఆఫీసులో అందరికీ మంటే. ఏ ఒక్కరైనా ఈపని చేసే అవకాశం ఉందని అందరికీ తెలుసు. అందుకే... 'ఎవరు ఎవరు' అని చెవులు కొరుక్కుంటారేతప్ప... అంతకుమించి ఏమీ చెయ్యలేరు"

వాచస్పతి క్షణం ఆగి అన్నాడు– "మీతో ఇంత పరిచయం పెరిగిందిగాబట్టి అంటున్నా ఈమాట! డిపార్ట్‌మెంటుకు ఒక్కరు, ఒక్కరున్నా చాలు మీలాంటివాళ్ళు. ఈ అవినీతిని ఎదుర్కోవటానికి! నాకు మీరెంతో విలువైన సమాచారం ఇచ్చారు. కాదనను! కానీ దానివల్ల మీ ఉద్యోగానికి ఎసరువచ్చేటట్లయితే... పోనీండి, మనిద్దరిమధ్యా చర్చంతా మర్చిపోదాం! మీ ఉద్యోగంకన్నా నాకు ఈవార్త ముఖ్యం అనిపించటంలేదు!"

దిగంబరరావు నవ్వాడు– "భలేవారండీ మీరు, ఇంత అవస్థపడింది ఇందుకా! నాకేంకాదుసార్... మీకెందుకూ ఆ భయం"

–వాచస్పతి ఇంక సంశయించలేదు.


మీము అడుగగానే మాదేశానికి పెట్రోలును సరఫరా చేసినందుకు ధన్యవాదాలు.
ప్రతిగా మీదేశానికి ఏంకావాలి?
లక్ష టన్నులు
నాగార్జున సిమెంట్
MAM 91

లేచాడు- తిన్నగా తన ఆఫీసుకు చేరి, ఆఫైలునంతా జిరాక్స్ కాపీలు తీయించాడు. మళ్లీఫైలు యథాతథంగా దిగంబరరావుకు అందించాడు.

"మీరు ఈ ఫైలు పెట్టేయగానే నాకు ఫోన్ చేయండి. అంతవరకూ ఆగుతాను. ఆ తర్వాత సంధిస్తా ఈ బ్రహ్మాస్త్రం!" నవ్వుతూ అన్నాడు వాచస్పతి

"అది మీ ఇష్టం. కానీ" ఆగిపోయాడు దిగంబరరావు.

"చెప్పండి" అన్నాడు వాచస్పతి."

నా బాధంతా ఒక్కటే- జరిగిన అన్యాయాన్ని మనం సర్దలేకపోవచ్చు. ఇకమీదట ఇలాంటివి జరగకుండా ఉంటే అదేచాలు! - మా ఆఫీసులో ఒకరిద్దరు దీనివల్ల దెబ్బతినొచ్చు. ఇలాంటి ప్రమాదం ఉందని తెలిసినా వారీపనికి సిద్ధపడ్డారంటే... వారి ధైర్యం చూడండి! వాళ్లను దెబ్బకొడితే ఇకమీదట ఎవరూ ఇలాంటి ధైర్యం చెయ్యరు. పేదవాడికి అన్యాయం చేసేముందు ఆ దెబ్బ తనకూ తగులుతుందేమోనని ఆలోచింపజెయ్యాలి అందర్నీ! అదే నా ఈ ప్రయత్న లక్ష్యం"! అన్నాడు దిగంబరరావు.

వాచస్పతికి దిగంబరరావు శిఖరాలమీద వ్యక్తిలా కనిపించాడు.

ఎందరున్నారు ఈ దేశంలో ఇలా ఆలోచించేవారు?

ఇంతటి చైతన్యం అందరిలోనూ ఉంటే ఎంత బాగుంటుంది??

-దిగంబరరావు లాటి మనుషులు ఈ దేశంలో తక్కువమందే ఉండొచ్చుగాక, కానీ వారి ప్రయత్నాలు, ఆశయాలు, కష్టాలూ, నష్టాలూ ఏవీ వృధాకావని తాను నిరూపిస్తాడు. మిగిలిన వారిలో దాగివున్న దిగంబరరావులకు ఎనలేని ప్రోత్సాహం అందిస్తాడు.

ఈనాడు చిన్నగా తలెత్తుతున్న అల రేపు తుఫానులా ఉప్పెనలా చెలరేగి అవినీతిని, అక్రమాన్ని ముంచెత్తుతుంది.

నాడు- ఈ దేశం పవిత్రంగా కల్మషరహితంగా స్వచ్ఛంగా కళకళలాడుతుంది. ఒకర్ని ఒకరు మింగే మనుషులతోకాక, ఒకరికోసం ఒకరై బతికే మంచి మనసులతో ఈ దేశం నిండుతుంది.

ఆ రోజుకోసమే- తన తపస్సు!!

-వాచస్పతి తనకు అందిన సమాచారాన్ని జాగ్రత్తగా ఇంకోసారి పరిశీలించి చూసుకొని... వారం రోజుల తర్వాత అచ్చుపోసి వదిలాడు!!

అది చాలామందికి ఉచ్చులా బిగియసాగింది.




ప్రాథమిక విచారణ సైతం జరగలేదు ఆ విషయంలో. రాంప్రసాద్ అప్పటికే వరుసగా మూడు మంత్రివర్గాల్లో గృహనిర్మాణ శాఖనే నిర్వహిస్తూ వచ్చిన మంత్రి! కనుక అన్ని అవకతవకలకూ ఆయనే బాధ్యుడు అన్న కారణం ఒకటి, నోట్‌ఫైల్‌లో ఆయనే స్వహస్తాలతో రాసిపెట్టిన ఆర్డర్‌ల కారణంగానూ- నేరం ఇంకొకరిమీదకు తోసి పారేసే వీలులేకపోయింది. 'డిస్క్రెషనరీ పవర్స్' వున్నమాట వాస్తవమే అయినప్పటికీ వాటిని వినియోగించుకోవటం అరుదుగా జరగాలేతప్ప ఇంత అధికంగా, అక్రమంగా జరగరాదని అందరూ విమర్శలు రువ్వారు.

-గోవిందరావు రాంప్రసాద్‌కు కబురంపి పిలవనైనా పిలవలేదు. పీయస్‌కి చెప్పి రాజీనామా పంపమని కబురుపెట్టారు.

రాంప్రసాద్ రాజీనామా చేశారు.

-ఆ దెబ్బతో వాచస్పతి పత్రిక "వార్త"కు మంచి పేరు వచ్చింది. వరసపెట్టి మంత్రుల్ని పడగొడుతున్న ఆ పత్రిక అంటే ప్రజలందరూ గౌరవం పెంచుకున్నారు. రాజకీయాల్లో వున్న వారంతా భయం నింపుకొన్నారు.

పత్రికా ఆఫీసులో వాచస్పతి అంటే అందరి




కీ గౌరవం పెరిగింది. ఇది వరకటికన్నా ఇపుడు వాచస్పతికి ఎక్కువ సౌకర్యాలున్నాయి. నేడో రేపో అతనికి ప్రమోషన్ ఇస్తారని అందరూ అనుకొంటున్నారు.

ఇంత జరుగుతున్నా వాచస్పతి దృష్టిమాత్రం ఫోన్‌మీద వుంది. ఏక్షణంలో అది మోగుతుందో అని ఆసక్తిగా ఎదురుచూడసాగాడు.

-ఫోన్‌లో పలకరించి ఆప్యాయంగా మాట్లాడి, కొంత కూపీలు అందిస్తున్నదెవరో.. తెలీకపోయినా వాచస్పతికి మాత్రం ఆ వ్యక్తిపట్ల ఆదరాభిమానాలున్నాయి. పత్యక్షంగా ఏవో ఆధారాలు అందించో, పరోక్షంగా ములుగర్రతో పొడిచో- ఆ వ్యక్తి తనను సరైనమార్గంలో నడిపిస్తున్నపుడు తను కృతజ్ఞుడై వుండటంలో తప్పేముంది?– అనుకున్నాడు వాచస్పతి.

కానీ-

ఫోన్ఎక్కడా మోగలేదు.

రాంప్రసాద్ రాజీనామాతో గెలిచానన్న గర్వంవాచస్పతిలో నిండినా, ఫోన్‌మోగలేదని, అభినందనలు అందలేదన్న నిరాశమాత్రం మిగిలింది.

గోవిందరావుకు తన మంత్రులను చూస్తోంటే కంపరంపుడుతోంది. ఎవరు ఏక్షణంలో ఏపాడుపనిచేసి తనకు ఎసరుపెడతారో ఆయనకు అర్థంకావడంలేదు. మంత్రులందర్నీ భయంతో నింపి, సరైనదారిలో వుంచాలంటే ఆయనకొక్కటే మార్గం వున్నట్లు తోచింది.

వెంటనే ఆయన మంత్రివర్గ సమావేశం ఏర్పాటుచేశారు. సమావేశానికి హాజరైన అందర్నీ చూసి ఆయన తీవ్రమైన కంఠస్వరంతో మందలింపు ధోరణితో మాట్లాడారు- "ఈ దేశంలో రాజకీయాలు ఒకనాడు పవిత్రమైన బాధ్యతగా ప్రజలు, నాయకులు భావించేవారు. నైతికంగా శిఖరాల ఎత్తుల్లో ఉన్నవారు మాత్రమే ప్రజలకు నాయకత్వం వహించేందుకు ముందుకొచ్చారు. రోజులిపుడు మారాయి. నైతికంగా ఎంత పతనమైన వ్యక్తి అయితే రాజకీయాల్లో అంతబాగా పనికి వస్తాడనే అభిప్రాయం ఇపుడు పెరిగింది. నేను మీ గతం గురించి ప్రశ్నించను! కనీసం ఇపుడు... ఇకముందైనా జాగ్రత్తగా వుండండి. ప్రజలు, పత్రికలు మిమ్మల్ని వెయ్యికళ్లతో కనిపెడుతున్నాయన్న విషయాన్ని గుర్తుంచుకోండి. అది మీకు గుర్తుచేయటానికే నేను... ఇపుడు మీ రాజీనామాపత్రాలు తీసుకొంటున్నాను. ఇకపై ఏమంత్రిపై ఆరోపణలు వచ్చినా ఈ రాజీనామా పత్రాలను గవర్నర్‌గారికి పంపిస్తాను. అపుడు మీకు మాటమాత్రమైనా నేను చెప్పలేదన్న వాదు నామీద వెయ్యకండి!"

-మంత్రులంతా నివ్వెరపోయారు. గోవిందరావు చర్య తమపట్ల సందేహాలు వ్యక్తంచేస్తున్నట్లుగా కనిపిస్తున్నదే అయినా, ఎవ్వరూ ఎదురు మాట్లాడలేదు. మౌనంగా అక్కడికక్కడే తమ రాజీనామా పత్రాలురాసి ముఖ్యమంత్రికి అందించారు.

మంత్రివర్గ సమావేశం ముగిసింది.

ఆ తర్వాత- అసలుకథ ఆరంభం అయింది.

సెక్రటేరియట్ నుంచి బయలుదేరి మినిస్టర్స్‌కాలనీ తన అధికార నివాసగృహానికి చేరిన ఆర్థికశాఖామంత్రి సూర్యారావు- ముందుగా తన బెడ్‌రూంకు చేరారు. ఫోమ్ పరుపుమీద నడుంవాల్చినా ఆయనకు గుండె దడ తగ్గలేదు. ఎటుచూసినా ఆపదలు కమ్ముకొస్తున్నట్లుగా అనిపిస్తోంది. ఆలస్యం అవుతున్నకొద్దీ ప్రమాదం పెనుభూతమై తనను నాశనంచేస్తున్నట్లుగా భావించసాగాడు.

-ఆలోచనల పర్వం ముగించి సూర్యారావు నెమ్మదిగా లేచి ఫోన్ అందుకున్నాడు. ముందుగా వాణిజ్యపన్నుల శాఖమంత్రి ముత్తయ్యకి ఫోన్ చేశాడు.

"ఏం చేస్తున్నావయ్యా?" అనడిగాడు ముందుగా కుశల ప్రశ్నలాగ.

కుశలప్రశ్నలకు, కులాసా కబుర్లకు సిద్ధంగాలేడు ముత్తయ్య. ఆయనకు మీటింగులో ఆమాట విన్నప్పటి నుంచి ముచ్చెమటలు పోస్తున్నాయి. ఏక్షణంలో రాజీనామా కత్తి తన మెడపడుతుందో ఊహించుకోలేకుండా వున్నాడు. 'రాజీనామా పత్రం రాసి వుండకపోతే... ఎలా వుండేదీ పరిస్థితి' అని ఊహించుకొంటున్నాడు. కానీ రాసి ఇచ్చేశాక... రాసి వుండకపోతే– అని ఆలోచించటం అనవసరం అనిపించింది.

అప్పుడు వచ్చింది- సూర్యారావుదగ్గర నుంచి ఫోన్.

"తప్పుచేశామయ్యా!" అన్నాడు ముత్త య్యా 'ఏంచేస్తున్నావ్?' అన్న ప్రశ్నకు జవాబుగా.

"నువ్వూ అదే అనుకొంటున్నావా? నేనూ అలాగే అనుకొంటున్నా"

"ఊరికే అలా అనుకొని ఊరుకుండిపోతే లాభం ఏముంది చెప్పు?"

"ఏం చేద్దామంటావ్?"

"ఏంచేద్దామంటే... ఏమైనా చెయ్యాలి మరి... చెయ్యకపోతే ఎట్లా?" అంటూ ఆగిపోయాడు ముత్తయ్య.

ఫోన్‌కు అటూ ఇటూ ఉన్న ఇద్దరికీ తెలుసు - ఇద్దరి ఆలోచనల్లోనూ ఒకటే ఉంది? కానీ... ఇద్దరు - కేవలం ఇద్దరు ఏమీ చెయ్యలేరు. దానికి ఇంకొంతమంది అండదండలు కావాల్సి ఉంటుంది. ముందుగా వాటిని సమీకరించుకోవాల్సి ఉంది.

క్షణం ఆగిఅన్నాడు సూర్యారావు - "ఒక్కపనిచెయ్యి! బాగా నమ్మకం ఉండే మనవాళ్లను పిలువు. రేపు రాత్రి మనం అందరం కల్సికూచుందాం... ఏం చెయ్యాలో ఆలోచిద్దాం."

ముత్తయ్యకు ఒక్కసారి పట్టలేని సంతోషం కలిగింది - అనుకున్నట్లుగానే అన్నీ జరిగితే... ఈసారి రాష్ట్ర నాయకత్వం తనదవుతుందని అతని నమ్మకం. కులమత పరిధుల్లో సాగే రాజకీయ నిర్ణయాలు ఈసారి తనకు అదృష్టాన్ని పంచిపెట్టితీరాలని అతని విశ్వాసం. అన్ని కులాలవారు, అన్ని మతాలవారికీ అందింది ముఖ్యమంత్రి గద్దె. మిగిలింది ఒక్క తమ కులమే. రాజకీయంగా, ఆర్థికంగా ఇంతకాలమూ 'ఎదగని' తమ కులానికి ఈసారి పట్టాభిషేకం చేయాలని ఒత్తిడితెస్తాడు అధిష్టానవర్గంమీద. తమ కులంలో తను తప్ప ఇంకెవరు ఉన్నారు నాయకులు?

మనసులోని ఆలోచనల్ని పక్కన పెట్టి అన్నాడు - "ఇది గోవిందరావుకు తెలిస్తే..."

"తెలిస్తేకాదు - తెలియకుండా జాగ్రత్తపడాలి. అందుకే నమ్మకమైన వాళ్లను మాత్రమే పిలవండి అని చెప్పేది!"

"కలిసి... ఏం చేద్దాం?" ముత్తయ్య అమాయకంగా అడిగినట్లు అడిగాడు.

"ఏం చేద్దామా... మీకు తెలీనట్లు అడుగుతారేం?

అయినా ఏం చేద్దామో అపుడు ఆలోచిద్దాంలెండి!" అన్నాడు సూర్యారావు.

ఆ తర్వాత ఎక్కడ ఎప్పుడు ఎలా కలునుకోవాలో నిర్ణయించుకుని ఫోన్ పెట్టేశారు. ఆ తర్వాత మరో గంటసేపటివరకు ఆ ఇళ్ల నుంచి ఫోన్‌లు పలుచోట్లకు, పలువురికి వెళ్లాయి.

ఇదంతా అయిన మరో గంట తర్వాత... వాచస్పతి తన పనిచేసుకొంటూ ఉండగా అతని పక్క నిశ్శబ్దంగా ఉండి అతని పనితీరు గమనిస్తూవచ్చిన ఆ ఫోన్ ఉన్నట్లుండి మోగింది.

వాచస్పతి ఫోన్ అందుకున్నాడు.

"వాచస్పతిగారేనా? మీరేమిటి ఇంకా అక్కడే ఉన్నారు! రాష్ట్రంలో నిప్పు రాజుకొంటోంది!"

వాచస్పతి ఉలిక్కిపడ్డాడు.

"మీరనేది నాకు అర్థంకావటంలేదు!" అన్నాడు వాచస్పతి. క్షణం ఆగి మళ్లీ - "చూశారా - రాంప్రసాద్ రాజీనామానా వల్లే జరిగింది! ఒక్కపని నేను స్వయంగాచేసి చూపిస్తే, మీరు నాకొక సాయం చేస్తానన్నారు... గుర్తుందా?"

"గుర్తుంది... కాబట్టే ఈ ఫోన్. ఎవరికీ తెలీని రహస్యం చెప్తున్నా జాగ్రత్తగా వినండి. రేపురాత్రి..." అంటూ జరుగనున్న విందు సమావేశం గురించి ఫోన్‌లో వివరాలు వాచస్పతికి అందాయి.

వాచస్పతి నివ్వెరపోయి విన్నాడు. క్షణకాలం తర్వాత చిన్నగా నవ్వుకొన్నాడు. ఇలాటిదేదో జరుగుతుందని తాను ముందే ఊహించినా, అది ఇంత త్వరగా రూపుదిద్దుకొంటుందని మాత్రం అనుకోలేదు.

★ ★ ★

ఎంత తెలివైన వారయినా జీవితంలో తెలిసోతెలియకో ఒక్కోసారి తప్పటడుగులు వేస్తారు. ఎందరి జీవితాల్నో కాచివడపోసి పెద్దలు కనిపెట్టి ప్రకటించిన సత్యం ఇది.

వాచస్పతి చాల తెలివైనవాడు. జీవితంలో ఎన్నో శిఖరాల్ని అధిరోహించాలని ఆశించినవాడు. ఆ ఆశతోనే ఒక్కోమెట్టూ అధిగమిస్తూ ముందుకుపోతున్నవాడు. పైకి పోదలచినవు




డు- తనకేకాదు, ఎవరికైనా ఉన్నది ఒకే మార్గమని నమ్మినవాడు. ఆ మార్గం సన్మార్గం ఒకటేనని భావిస్తున్నవాడు.

అలాటివాడు కూడా ఓ తప్పటడుగు వేశాడు. అది అతని జీవితంలో ఊహించుకోలేని మలుపులకు కారణమయింది.

—తన శ్రేయోభిలాషినుంచి ఫోన్ వచ్చిన వెంటనే ఆ విషయంలో నిజానిజాలు తెలునుకోవాలనుకున్నాడు వాచస్పతి. కానీ ఎవర్ని అడుగుతాడు?

[illegible]ం చెప్పరా' అని ఎవరినైనా నిలదీసి [illegible]తే వాడు చెప్పే[illegible] అక్ష[illegible]లా అ[illegible]మేనన్న సంగతి అందరికీ తెలుసు. 'పవిత్రమైన ఈ భగవద్గీత సాక్షిగా అన్నీ నిజాలే చెప్తాను... అబద్ధాలు చెప్పను!' అంటూ మొదలు పెట్టేవాడు అప్పటికే 'నిజాలే చెప్తాను' అని ఒక అబద్ధం, 'అబద్ధాలు చెప్పనని' ఇంకో అబద్ధం ఆడనే ఆడేశాడు. ఇలా ఉంటుంది ప్రపంచం!

మరి ఎవర్ని అడగాలి నిజం చెప్పమని?

— అడగటంతో తన తెలివితక్కువతనం రుజువు అవుతుందేగానీ మరేమీ జరగదు.

వాచస్పతికి ఆ నిజం ఆలస్యంగా బోధపడింది. అందుకే ఊరుకుండిపోయాడు. ఆఫీసులో సైతం ఎవరికీ ఆ విందు సమావేశం గురించి చెప్పనేలేదు. ఈ విషయం తెలిసింది బహుశా తన ఒక్కడికే అయివుంటుంది. గతంలో కూడా ఫోన్ల సమాచారం తనకు మాత్రమే పరిమితమవుతూ వచ్చింది. ఇదీ అంతే అయివుండాలి! ఇలాటి 'స్కూప్'ను తను మరింత జాగ్రత్తగా ప్లాన్‌చేస్తాడు. ఒక్క దెబ్బతో ఈ రాజకీయ గోడమీద పిల్లుల్ని దెబ్బతీస్తాడు.

—వాచస్పతికి మర్నాటి సాయంత్రం వరకూ ఊపిరాడలేదు. వాళ్లు విందు చేసుకొంటున్న స్థలం తెలిసిపోయిందిగాబట్టి వాచస్పతి ... కొంచెం ధైర్యంచేశాడు.

పత్రిక యాజమాన్యం దగ్గరకువెళ్లి, వాచస్పతి 'ఒక స్పెషల్ న్యూస్ సేకరించటానికి తను కొంచెం ఖర్చు పెట్టాల్సి వస్తోంద'ని చెప్పి రెండువేల రూపాయలు డ్రా చేసుకొన్నాడు. వార్త 'స్కూప్' కానివక్షంలో ఆ డబ్బు వాపసు ఇచ్చేసేందుకు కూడా అతను అంగీకరించాడు. 'సాధారణంగా ఇలాటివి మేం ఒప్పుకోం, ప్రోత్సహించం, అయినా ... అంటూ యాజమాన్యం ఆ డబ్బుఇచ్చింది.

చేస్తున్నది తప్పుపని. అందుకే ధైర్యం అవసరం అయింది వాచస్పతికి. ఎంతో ధైర్యాన్ని కూడగట్టుకొని వాచస్పతి - విందు సమావేశం జరిగే చోటుకు చేరుకొన్నాడు.

అదొక అయిదు నక్షత్రాల హోటల్. భువిమీది స్వర్గం. రంభా ఊర్వశుల మొదలు [illegible]లో ఉండే స్వర్గసౌఖ్యాలన్నీ ఆ హోటల్‌లో [illegible]. అక్కడ ... సమావేశం అవుతున్నారు ఆరోజు ముత్తయ్య ప్రభృతులంతా. హోటల్‌లాటి పబ్లిక్‌ప్లేస్‌లో తాము పదిమందికీ కనిపించే ప్రమాదంవున్నా, అలాటిచోట అయితేనే అదికేవలం విందు సమావేశంగానే అందరూ అపోహపడే వీలుంటుందని వారు ఆ ప్రదేశాన్ని ఎంచుకొన్నారు.

—వాచస్పతి ఆ హోటల్‌లోనే ఓ రూమ్ బుక్‌చేసుకొన్నాడు. సాధారణంగా అలాటి పెద్ద హోటళ్లలో బేరర్లవంటి అల్పజీవులతో ఎవరూ మాటలు పెట్టుకోరు. అక్కడ ఎంతతక్కువ మాట్లాడినవారికి అంత ఎక్కువ గౌరవం. మానవత్వానికి ఎంతదూరంగా బతికితే, తోటిమనిషిలో మనిషిని గుర్తించటానికి ఎంత వెనకాడితే అంత గొప్పవాడు కింద అక్కడలెక్క. వాచస్పతికి అది తెలుసు.

—ఎదుట మనిషిని బుట్టలో వేసుకోవటానికి ముందుగా వారిభాషలో మాట్లాడటం మొదలు పెట్టాలి. దాంతో నగం గెలిచినట్లవుతుంది. ఇద్దరువ్యక్తులమధ్య ఒక భాషకు మించిన మంచివారధి లేదు. వాచస్పతిముందు ఆ అస్త్రాన్ని సంధించాడు. రూమ్‌సర్వీస్‌కు వచ్చేవారితో పరిచయం పెంచుకొన్నాడు. ఆ నమ్మకం కుదిరిందనుకొన్నాక తన మనసులోది బయటపెట్టాడు.

రూంబాయ్ వులిక్కిపడ్డాడు— "అమ్మో!" అన్నాడు.

"భయంలేదు... చాలా తేలిక! రూమ్‌టు రూమ్, వాల్‌టువాల్ కార్పెట్స్ ఉన్నాయి. రూమ్‌లో ఎక్కడైనా ఈ మైక్రోఫోన్ పెట్టు, చాలు. నాగదిలో రికార్డవుతుంది అక్కడ వాళ్లు మాట్లాడేది!" వాచస్పతి బతిమాలుతున్నట్లు అన్నాడు.





"వద్దండి... ఇలాంటివి నేనెప్పుడూ చెయ్యలేదు."

"ఎప్పుడూ చెయ్యాల్సిన అవసరం ఏముంది? ఈఒక్క సారిచాలు! నాపని చేసిపెడితే... ఇదిగో వెయ్యి రూపాయలు..."

వాచస్పతి ఊహ నిజమయింది - ఈ దేశంలో మనుషులందరికీ ఓ|వెల|వుంది. కొందరు పదులకు, కొందరు వందలకు, కొందరు వేలకు ... ధరలపట్టికలో తేడాలేతప్ప నీతినియమాల అడ్డంకులేమీలేవు.

అతను చాలా ఆలోచించాడు - అందరూ గదిలోకి చేరాక ఏం మాట్లాడుకొంటారో కావాలి ఈయనకు. ఈమైక్రోఫోన్ ఆ గదిలోపెట్టి, వైర్‌ను కార్పెట్‌కిందనుంచి ఈ గదిలోకి చేర్చితేసరి ... అక్కడ మాట్లాడింది ఇక్కడ రికార్డవుతుంది.

ఇంతే చాలు! దీనికి వెయ్యి రూపాయలు!! ఎవరికైనా తెలిస్తే.

ఎలా తెలుస్తుంది? తప్పుచేస్తున్న తనుచెప్పడు. తప్పు చేయిస్తున్న ఇతను చెప్పడు. కథ అక్కడితో ముగిసేటపుడు ఇక భయమెందుకు? ... వెయ్యి రూపాయలు వదులుకోవటం ఎందుకు?

—అతను చెయ్యిజాపాడు. ఆగదినుంచి ఈగదికి తీగలు అల్లుకొన్నాయి. వలదట్టంగా పర్చుకొంది. ఇక చేపలు పడటమే తరువాయి. —వాచస్పతి మెలుకువగా, ఆసక్తిగా తన ప్రయోగఫలితం కోసం ఎదురుచూడసాగాడు.

—సూర్యారావు ఆరోజు సాయంత్రం ముత్తయ్యకు మళ్లీ ఫోన్‌చేశాడు. 'మన వాళ్లందరికీ గుర్తుచెయ్యాల్సిందిగా, విందు భోజనానికి ఆహ్వానించాల్సిందిగా సూర్యారావు గుర్తుచేశాడు. ముత్తయ్య తనవారికీ, సూర్యారావు తనవారికీ, వాళ్లు తమవారికీ ... అంచెటపా పద్ధతిలో అందరికీ కబురందింది.

సాయంత్రం అయింది. వెలుగు కనుమరుగయింది. చీకటి ఆవరించుకొంది దట్టంగా - ముత్తయ్య మనసులో ఆశలాగ, సూర్యారావు గుండెల్లో కోరికలాగ, వాచస్పతి ఆలోచనల్లో భయంలాగ.

హెూటల్‌ముందు పార్క్ అవుతున్న కారుల్లోంచి ఒకరొకరు దిగటం ఆరంభమయింది. కారులోని మనుషులు హెూటల్లోపలకు. కార్లు హెూటల్ సెల్లార్‌లలోకి సర్దుకోసాగారు.

—వాచస్పతికి పక్కగదిలో సందడి క్రమంగా పెరగటం తెలుస్తూనేవుంది. గొంతులన్నిటినీ గుర్తుపట్టడం కష్టమే అవుతున్నా, కొన్నిటిని అతను తేలికగా గుర్తుపట్టగలిగాడు. ఇంకొన్నిటిని కష్టంమీద గుర్తుపట్టగలుగుతున్నాడు. ముందుగా ఒకర్నొకరు పలకరించుకోవటం, ఆ తర్వాత విందుగురించి చర్చించుకోవటం, ఆ తర్వాత 'అసలు సంగతి' గురించి ఒకర్నొకరు ప్రశ్నించుకోవటం - వాచస్పతికి వినిపిస్తూనే వుంది.

అందరూ అసలు విషయం చర్చలోకి రాగానే వాచస్పతి టేప్ ఆన్‌చేశాడు.

—గోవిందరావు తమదగ్గర రాజీనామాలు తీసుకోవటంతో వారి చర్చ ఆరంభమయింది. క్రమంగా చర్చలో ఒకటేమిటి, ఎన్నో అంశాలు తలెత్తనారంభించాయి. పార్టీ అధిష్టానవర్గానికి గోవిందరావుపైన వుండే విశ్వాసం గురించి కూడా వాళ్ళు చర్చించుకోవటం ఆరంభించారు.

—మనిషిలో ఆశ అన్నది పుట్టకూడదేగాని, పుట్టిందంటే అది ఎలాటి ఆలోచనల్ని తలెత్తేలా చేస్తుందో...

—భవిష్యత్తుపట్ల భయం అన్నది వుండకూడదేగానీ, అది వున్న తర్వాత మనిషి ఎంతకు తెగిస్తాడో...

—నీతినియమాలనేవాటికి నీళ్ళొదలనేకూడదుగానీ, వదిలితే మనిషి ఎంత పతనమయ్యేందుకు సిద్ధపడతాడో--

—అన్నీ వింటున్నాడు వాచస్పతి. గొంతులు వేరైనా, వాటి తీరులు ఒకేలా వున్నాయి; మనుషులు వేరైనా వారి ఆశలన్నీ ఒకేలా వున్నాయి; దారులు వేరైనా, వారి లక్ష్యాలన్నీ ఒకేలా వున్నాయి.

—ప్రజలముందు నీతినియమాల గురించి, నైతిక విలువల గురించి అనర్గళంగా ప్రసంగాలుచేసే ప్రముఖులంతా ఒంటరిగా వున్నపుడు, కనీసం తమవారిముందున్నపుడు, ప్రమాదం ఏమీలేదన్న ధోరణిలో సిగ్గువిడిచి, ఉచితానుచితాలు విస్మరించి నిస్సంకోచంగా మాట్లాడుతున్నారీక్షణంలో. వారందరిమధ్య మానవసహజమైన కాంక్ష నగ్నంగా నర్తిస్తోంది.

ఎదుటివాడిని నాశనం చెయ్యాలన్న అతి చిన్న బలహీనత వారినందర్నీ లోబర్చుకుంది.

—వాచస్పతి టేపు తిరగేసిపెట్టాడు.

తర్వాత కొన్ని నిమిషాలకు ఇంకో టేపు పెట్టాడు.

అప్పటికి అర్ధరాత్రి దాటింది.

విందు సమావేశం ముగిసింది. తాము జరిపిన చర్చలు, తీసుకున్న నిర్ణయాలు— భద్రంగా పక్కగదిలో వున్న వాచస్పతి టేప్‌రికార్డర్‌లో రికార్డ్‌అయి వున్నాయన్న సంగతి తెలియని వారంతా— హోటల్ మెట్లు దిగారు. కార్లెక్కారు. తమతమ ఇళ్లకు చేరారు— వాళ్లంతా తాము తీసుకున్న నిర్ణయాలను అమలుచేయదల్చుకున్న రోజుకోసం వేచిచూడటం ఆరంభించారు.

కానీ...

ఆలోపునే వాళ్లను వాచస్పతి చావుదెబ్బ కొడుతున్న సంగతి వాచస్పతికేగాక ఇంకొకరికీ తెలుసు—

ఆ రెండో వ్యక్తి... హోటల్లో వెయ్యి రూపాయలు తీసుకొని తీగలల్లిపెట్టిన బాయ్ కాదు... చాలాకాలంగా వాచస్పతికి ఫోన్‌చేస్తూ అతని పంథానీ, పద్ధతినీ నిర్దేశిస్తున్న తెరచాటు మనిషి!

అటు వాచస్పతి అక్కడ విందు సమావేశంలో వివరాలు సేకరిస్తోంటే ఇటు ముఖ్యమంత్రి భవనంలో— గోవిందరావు దంపతుల మధ్య వివాదంలాంటి ఘర్షణ జరుగుతూ వుంది.

మైథిలికి మొదటినుంచి వున్న అలవాటే అది— మనసులోనిమాట మనసులోనే దాచుకోకపోవటం. కుండ బద్దలుకొట్టినట్లు, ముఖంమీదే! కట్టెవిరిచి పొయ్యిలో పెట్టినట్లు అనెయ్యటం ఆమెకు అలవాటే! ఆరోజూ అదేచేసింది.

"రాంప్రసాద్ తర్వాత ఎవరు?" అనడిగింది మైథిలి.

గోవిందరావు తాను చదువుతున్న రిపోర్ట్ లోంచి తల పైకెత్తి చూశాడు. మైథిలి అన్నది అతనికి క్షణం అంతుబట్టలేదు. అది అర్థంచేసుకున్నాక నవ్వాడు— నవ్వి, "నేనిపుడు కొత్త పారిశ్రామిక విధానం గురించి కమిటీ రిపోర్ట్ చదువుతున్నా— అందుకే నీ ప్రశ్న అర్థంకాలేదు" అన్నాడు.

"ఇపుడర్థం అయిందికదా?" అంది రెట్టిస్తూ.

"బహుశా ఇంక ఆ అవసరం ఎవరికీ రాకపోవచ్చు"

"అదేం... అందరూ ఒకేసారి లక్షవత్తుల నోమేదైనా చేపట్టారా— నీతికి, నిజాయితీకి కట్టుబడి వుంటామని" నవ్వుతూ అంది మైథిలి.

"కాదు... అందరి రాజీనామాలు నేను సేకరించిపెట్టాను. ఏక్షణంలో ఎవరు తప్పుచేసినా ఆ క్షణంలోనే వారి రాజీనామా గవర్నర్‌గారి దగ్గరకు వెడుతుందని హెచ్చరించాను"

"అంటే... మీరిపుడు టెర్రరిస్టులన్నమాట"

ఉలిక్కిపడ్డాడు గోవిందరావు ఒక్కక్షణం.

—సరదాకు ఎవడో 'మీరు వెళ్తున్న రైల్లో బాంబు పెట్టాం' అని ఫోన్‌చేస్తే ఆ రైలు ఛాయలకు వారంరోజులు వెళ్లని జాతి మనది! అంతెందుకు, 'నీ మెడలో పామును నేనే వేశాను' అన్నా, 'నీ పాంటుజేబులో ట్రాన్సిస్టర్ బాంబు పేలేందుకు సిద్ధంగా వుంద'న్నా పై ప్రాణాలు పైపైనే పోగొట్టుకునే పిరికితనం నిండిన జాతి మనది. మెడలో పాముంటే దాని స్పర్శ తెలుస్తుందని, జేబులో బాంబుంటే కనీసం దాని బరువైనా తెలుస్తుందని క్షణమైనా ఆలోచించని ప్రజకు నాయకత్వం వహిస్తున్న గోవిందరావు 'టెర్రరిస్టు' అనేమాటకు సహజంగానే ఉలిక్కిపడ్డాడు.

"అదేమన్నమాట?" అన్నాడు గోవిందరావు.

"భయపెట్టి ఎదుటివాడిని లొంగదీసుకోవటం టెర్రర్ టాక్టిక్స్ అయినపుడు, మీరు టెర్రరిస్టు ఎందుకుకారో చెప్పండి?" అంది మైథిలి.

గోవిందరావు నవ్వాడు. క్షణం ఆగి అన్నాడు ఆత్మవిమర్శ చేసుకుంటున్నట్లు— "మైథిలీ... నువ్వు నా భార్య కావటం నా అదృష్టం!"

"మన ఇద్దరికీ పెళ్లయి ఇన్నేళ్లయింది. ఇప్పటికి కలిగిందా జ్ఞానోదయం— ఆమాట అంటున్నారు! అయినా ఎందుకంటున్నట్లు ఆ




మాట?" అడిగింది మైథిలి.

"నిజమే... నువ్వు నా భార్యవు అయ్యావు కాబట్టి సరిపోయిందిగానీ లేకపోతే... నువ్వే నా ప్రత్యర్థివి అయివుండి ఉంటే, ఈ పాటికి ఎప్పుడో నేనే రాజీనామా ఇచ్చి పారిపోయే పరిస్థితి ఏర్పడి ఉండేది!"

గోవిందరావు నవ్వుతూ అన్నా మైథిలికి ఆమాట ఎక్కడో తగిలింది. గోవిందరావు ఏ ఉద్దేశంతో ఆ మాట అన్నాడో తెలుసుకొనే ప్రయత్నం చేయబోయిందిగానీ అది ఫలించ లేదు.

క్షణం ఆగి అంది మైథిలి-- "అయినా నన్ను మీ మంత్రివర్గంలోకి తీసుకోరుగదా!"

గోవిందరావు చివాలున తలెత్తాడు— "అది జరగనిపని. ఎప్పుడో చెప్పాగదా- మంత్రివర్గంలో నువ్వో నేనో... మన ఇద్దరిలో ఒక్కరే ఉండాలి. మన ఇద్దరం ఉండేది జరిగే పనికాదు!"

"గట్టిగా అనకండి ఆ మాట! ఎక్కడో తథాస్తు దేవతలు ఉండి 'అస్తు' అన్నారంటే మీకు డేంజర్!"

గోవిందరావు తల ఊపాడు- "భారత స్త్రీకి భర్తే దైవం! నేను ఆశీర్వదించనిదే, నీకు ఏమేలూ జరగదు. గుర్తుంచుకో!" అన్నాడు నవ్వుతూ.

—ఆ తర్వాత ముఖ్యమంత్రిగారు కొత్త పారిశ్రామిక విధానానికి చెందిన నివేదికలో తలదూర్చారు- తన చుట్టూ ఏంజరుగుతోందో పట్టించుకోకుండా ఉండేందుకు అదే మార్గం.

మైథిలి మాత్రం అంతరాత్రివేళా- మనసులో ఆలోచనలు నింపుకొంటూ— తెల్లవారటంకోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

★ ★ ★

వాచస్పతి— పక్కగది ఖాళీ అయిపోయిన అరగంట తర్వాత తన గదిలో ఒకసారి అటూ ఇటూ కదిలాడు.

పక్కగదిలో వాళ్లు మాట్లాడుకొన్నది తల్చుకొంటేనే అతనికి ఇబ్బందిగా ఉంది. ఈ దేశంలో రాజకీయపక్షాలు ఒకప్పుడు క్రమశిక్షణకు మారుపేర్లుగా ఉండేవి. పార్టీకి ఆజ్ఞాంతం కట్టుబడి ఉండటం, పార్టీ విధానాలకు విధేయులై ఉండటం ఇక్కడి పార్టీ సభ్యులకు ప్రాణప్రదంగా ఉండేది. కానీ ఇపుడు - రోజులు మారాయి. విలువలు మారాయి. మనిషి ఎదగాల్సిందిపోయి, అగాధాల లోతుల్లోకి పతనం కావటం హెచ్చయింది.

లేకపోతే— అర్ధరాత్రిపూట విందు సమావేశాలపేరిట ఈ గోతులు తీయటం దేనికి? నైతికంగా ఇది తప్పు. ఇలాటివారు రాష్ట్రానికి నాయకత్వం వహించటం— ప్రజల దౌర్భాగ్యం.

అలా అనుకున్నాడేగానీ... వాచస్పతికి ఆ పరిణామం కొంచెం భయాన్నే కలిగించింది. ఈ విందు సమావేశం గురించి రాయటమా, మానటమా-- అతను నిశ్చయించుకోలేకపోయాడు. రాయకపోవటం వృత్తిపరమైన ద్రోహం అవుతుంది. జీవితంలో తన్నుతాను క్షమించుకోలేడు. రాస్తే... ఏంజరుగుతుందో... దెబ్బతిన్న ఈ 'విందునేతలు' తనను వదిలిపెట్టరు. దొంగచాటుగా దాడి చేస్తారు. ఎంతకైనా తెగిస్తారు.

—అయినా తన వృత్తి అలాటిది. రోట్లో తలదూర్చి ఇపుడు వెనుకాడటం తెలివితక్కువ. ఈ మాత్రం ప్రమాదం, ఇబ్బందీ ఉంటుందని తనకు ముందే తెలీదా?

—వాచస్పతి ముందుకే అడుగువెయ్యాలని నిర్ణయించుకొన్నాడు. వెంటనే పాడ్ తీసుకొని విందు సమావేశం తీరుతెన్నులు, హాజరైన వారిలో తెలిసిన, గుర్తు పట్టగలిగిన గొంతుల పేర్లు— అన్నీ రాశాడు. వారి నిర్ణయాలు, వాటి అమలు తీరు గురించి వారి ఆలోచనలు... అన్నీ రాసి 'రాష్ట్ర రాజకీయాల్లో కొత్తమలుపులు' అని శీర్షికపెట్టి... కలం మూసాడు.

—ఇలాటివార్త... ఇది స్కూప్ అం[illegible] కి వెంటనే వెయ్యాల్సిన ఆవశ్యకత లేదు. ఒక్క రోజు ఆగి... యాజమాన్యంలో పెద్దలు ఒకరిద్దరికి టేప్ వినిపించి అపుడు వార్తను వదిలితే మంచిది, అనుకొని వాచస్పతి, ఆ కాగితాల్ని తీసి ఇంటికి చేరాడు.

—ఇంటిదగ్గర శారద, అతన్ని చూడగానే ఏదో జరిగిందని పసిగట్టింది. భర్తముఖంలో ఇంతటి సంతృప్తి దర్శనం ఇవ్వటం శారదకు సంతోషంగానే అనిపించింది కానీ... భర్త ఏ




ప్రమాదం కొనితెచ్చుకొంటున్నాడోనన్న భయం ఆమె మనసులో లీలగా కదలాడింది.

అదే అంది నెమ్మదిగా — "మిమ్మల్ని చూస్తోంటే నాకు భయంగా ఉంటోంది!"

"ఎందుకు... ఎందుకూ భయం?"

"మీరు... అనవసరంగా జోరుగా వెళ్లిపోతున్నారని. కిందటిసారి వారం రోజులు ఆస్పత్రిలో ఉన్నారు. అయినా మీరు బ్రేకులు వేసుకోవటంలేదు. వెళ్లి ముఖ్యమంత్రిగారితో కూడా ఘర్షణకు దిగివచ్చారు. మీకెందుకీ జంజాటాలు? దేశంలో ఇన్ని కోట్లమంది ఈ గొడవలజోలికి పోకుండానే బతుకుతున్నారే వాళ్లలాగ మనమెందుకు బతకలేమో చెప్పండి! ఎందుకొచ్చిన బరువులూబాధ్యతలూ" అంది శారద అనునయ ధోరణిలో.

వాచస్పతికి ఆ మాటల్లో భార్య భయం అంతా స్పష్టంగా దర్శనం ఇచ్చింది. ఒక విధంగా ఆలోచిస్తే ఆమె అంటున్నదీ నిజమే. అది సగటు మనిషి మనస్తత్వానికి ప్రతిబింబం.

—ఆ భయాల్ని దూరంచేసే ప్రయత్నం చేపడుతూ అన్నాడు వాచస్పతి – "శారదా నువ్వనేది అక్షరాలా నిజం! ఈ దేశం ఏమయితేనేం, నాకెందుకు, నేనూ నా భార్యాపిల్లలు సుఖంగా వుంటే చాలునని అనుకోవటం వ్యక్తిగతంగా ఎవరికైనా మంచిదే. కానీ అది సమాజపరంగా ద్రోహం. ముఖ్యంగా పత్రికల్లో పనిచేసేవారు ఇలా అనుకోవటం మహాఘోరం. వార్త ప్రజల సొమ్ము. జరిగిందాన్ని ప్రజల దృష్టికి తీసుకెళ్లటం నా బాధ్యత. వార్తకు దూరంగా వుండటం నా బాధ్యతకు నేను దూరంగా వుండటమే అవుతుంది. తెలిసినదాన్ని ప్రజలకు తెలియజెప్పకపోవటం ఆత్మవంచన అవుతుంది. ఆ ఆత్మవంచన నాకు చేతకాదు"

శారద క్షణం ఊరుకొంది. తర్వాత నెమ్మదిగా అంది "మీ ఇష్టం. ఆత్మవంచన చేసుకోమని నేను అడగటంలేదు. అసలు అంత దూరం పోకుండానే తప్పుకోండి అనే నేను కోరుకొంటున్నది! ఆలోచించండి... ప్రమాదం వుందని తెలిసీ అటు ప్రయాణించటం, గుడ్డిగా కళ్లు మూసుకొని ముళ్లబాటలో నడవటం ఎవరికి మంచిదో మీరు చెప్పండి! ఇవన్నీ మీకు నేను చెప్పాల్సిన పనిలేదు మీకై మీరు నిర్ణయించుకోండి"

—వాచస్పతి నిర్ణయించుకున్నాడు - కష్టమే రానీ, నష్టమే రానీ ముందుకు పోవటమే తన ధ్యేయం. నిజాన్ని నిజంగా ధైర్యంగా చెప్పుకోలేకపోవటమే నిజానికి మనం చేసే అన్యాయం. తను ఆ అన్యాయం చెయ్యడు... తను అన్యాయం అయిపోయినాసరే!

ఆ నిర్ణయం తీసుకొన్నాక - వాచస్పతి ఇంక భార్యతో చర్చించలేదు.

పత్రికా కార్యాలయానికి వచ్చిన వాచస్పతి తాను రాసిన ఆ కాగితాలను మరోసారి చదువుకొని, అన్నీసరిగ్గా వున్నాయని నిర్ణయించుకొని, అపుడు దాన్ని యాజమాన్యానికి అందజేశాడు.

మధ్యాహ్నం వరకు ఆ సంఘటనను రిపోర్ట్ చేయటం గురించి తర్జన భర్జనలు జరిగాయి. ఆఖరికి అది వెయ్యాలని నిర్ణయించారు. - ఆ కాగితాల్ని కంపోజింగ్ సెక్షన్‌కు పంపి, వాచస్పతి బయటకు నడిచాడు. జేబులో ఉన్న టేప్ తీసుకొని తిన్నగా ఒక రికార్డింగ్ కంపెనీకి వెళ్లి దాన్ని మాస్టర్ టేప్‌గా రెండు టేపులు వేయించాడు.

ఇంటికొచ్చి, ఒక టేపును అతి భద్రంగా పాక్‌చేశాడు. దానిమీద 'శ్రీ గోవిందరావు, ముఖ్యమంత్రి' అని రాశాడు. అదే రేపు తెల్లవారుజాముకు ముఖ్యమంత్రికి అందుతుంది.

వాచస్పతి తనకు తెలియకుండానే - అగ్గిపుల్ల అంటించాడు. అగ్ని రేపు తెల్లవారుజామున అంటుకొంటుంది.

రాష్ట్రరాజకీయాల్లో మలుపులు భగ్గుమని మండుతాయి. కొన్ని తలకాయలు ఆ మంటకు ఆహుతి అవుతాయి.

—వేదికకు దూరంగా నిలబడి ప్రదర్శనను తిలకించే దర్శకుడిరీతిలో ప్రవర్తించే ప్రయత్నంచేశాడు వాచస్పతి.

రాత్రంతా ఆలోచనలతో సతమతమవుతూ వచ్చిన వాచస్పతికి - తెల్లవారుజామున వచ్చిన పత్రికలో ఆ వార్త చూసుకొన్నాక ని[illegible]వట్టింది సూర్యుడి ఎండకన్న తీవ్ర[illegible] కీయ వాతావరణం వేడెక్కుతోంటే వాచస్పతి అదేమీ పట్టించుకోకుండా పరుపుమీద నిద్రపోతున్నాడు.

బయట...

తెల్లవారుజామునే అలవాటు ప్రకారం సమాచారశాఖ అధికారులువచ్చి గోవిందరావుకు వార్తలు వినిపించివెళ్లారు. వింధు సమావేశాల గురించి రాసిన వార్త గోవిందరావులో సంచలనం సృష్టించింది... అలజడి కలిగింది.

కానీ - రాజకీయాల్లో ఆరితేరిన వ్యక్తి కావటంతో మనసులోని ఆలోచనలను పైకి రానివ్వలేదు. పెదవులమీది చిరునవ్వులు చెరగనివ్వలేదు. ఆరితేరిన నటుడులాగా నిశ్చలంగా వుండిపోయాడు.

గోవిందరావు ముందు పిఆర్వో బండరాయిలాగే నిలబడిపోయాడు. అనుకోని పరిణామం అది; ఆశించని సమాచారం అది.

"ఇది నిజమే అయివుంటుందా?" అని చాలాసేపటి తర్వాత గోవిందరావు నెమ్మదిగా ప్రశ్నించాడు.

అతను జవాబు ఇవ్వలేదు. కానీ ఆ వార్తలో ఆవంతయినా అబద్ధం ఉండే అవకాశంలేదనిపిస్తోంది. ఆ వార్త వాచస్పతి కాకవేరే ఎవరు రాసినా పట్టించుకోనవసరంలేదు. కర్ణాకర్ణిగా విన్నదాన్ని కూడా చెక్ చేసుకోకుండా వార్తలుగా చెలామణీ చేసే విలేకరులు ఎందరో ఉన్న మాట నిజం. కానీ... వాచస్పతి పద్ధతివేరు. గతంలో అతను రాసిన ఏ వార్తా పొల్లుకాలేదు.



దేనినీ ఆధారం లేకుండా రాయలేదు. ఏదీ అబద్ధం కాలేదు.

ఇది మాత్రం నీలి వార్తో, గాలివార్తో అయి ఉంటుందని అనుకోవటం ఎలా?

ఇదంతా పైకి అనకపోయినా ఆ మాటలన్నీ గోవిందరావు వినగలిగాడు. అతని మనసులో నూ అవే ఆలోచనలుండటం దానికి కారణం.

వాళ్ళా ఈ విషయం గురించి మౌనంగా ఆలోచిస్తున్న తరుణంలోనే- సెక్యూరిటీ గార్డు లోపలికి తొంగి చూశాడు. సెల్యూట్ చేసి చెప్పాడు- "ఎవరో ఈ పాకెట్ మీకు పంపారు సార్!" భక్తి ప్రపత్తులు, వినయ విధేయతలు అన్నీ ప్రస్ఫుటింపజేస్తూ అన్నాడు.

గోవిందరావు తలఊపాడు. ఆ సంజ్ఞ అర్థం చేసుకొని గార్డు ఆ పాకెట్ విప్పాడు. పాకెట్ లోపల వాచస్పతి పంపిన టేపుంది. దానికి చుట్టి చిన్న ఉత్తరం. గార్డు సగౌరవంగా ఆ కాగితాన్ని పిఆర్వోకు అందించాడు.

అతడు దాన్ని చదివి, ఆ విషయాన్ని జీర్ణం చేసుకోలేకపోతున్నట్లు గోవిందరావుకు అందించాడు.

"శ్రీ గోవిందరావుగారికి, సగౌరవ నమస్సులు. ఈ రోజు వార్త చూసే ఉంటారు. దానికి సాక్ష్యం మీకు పంపుతున్న ఈ టేప్. దయచేసి మీరొక్కరే వినండి! మీ విశ్వాసపాత్రుడు వాచస్పతి"

గోవిందరావు చదువుకొన్నాడు. తల పంకించాడు. దాన్ని అర్థం చేసుకొని అతను బయటకు కదలబోయాడు.

"మీరు బయట ఉండండి. వెళ్ళద్దు! లోపలికి ఎవర్నీ అనుమతించకండి!"

ఆజ్ఞ అయింది. అతను బయటకు నడిచాడు.

లోపల టేప్ ఆన్ అయింది. స్పీకర్‌లోంచి మాటలు నెమ్మదిగా రాసాగాయి. గోవిందరావు ముఖం జేవురించనారంభించింది.

మరోవైపు...

రోజూలాగే పేపరు చదివే సూర్యారావు ఆరోజు ఆ పేపరు చూడగానే ఉలిక్కిపడ్డాడు. 'రాష్ట్ర రాజకీయాల్లో మలుపులు'- ఇది చాలా పాతశీర్షికే అయినా లోపల ఉన్నది మాత్రం కొత్త సంగతులు నిండి ఉన్నవార్త అది. తమ పీకకు ఉరితగిలించే వార్త అది.

ఫైవ్‌స్టార్ హోటల్‌లో తాము మాట్లాడుకొన్నది యథాతథంగా కాకపోయినా, దాని సారాంశం అంతా ఆ వార్తలో ఉంది. గోవిందరావును గద్దెదింపేందుకు తగిన ప్రయత్నాలు చేపట్టాలని తాము తీసుకొన్న నిర్ణయాన్ని సైతం అక్షరాల్లోకి దింపేశాడు ఆ విలేకరి.

--ఎవరో?

--ఎలా తెలిసిందో?

--ఎలా తెలిసి ఉంటుంది? హోటల్లో ఉండే వాళ్ళు ఎవరో ఉప్పు అందించి ఉంటారు. దానికి కాస్త మసాలా పూసి రాసి ఉంటాడు ఈ వార్త. కానీ అలాలేదు. చర్చల్లో ఒకడిగా పాల్గొన్న తీరులో రాశాడీ వార్త. అంటే... తమలోనే ఎవరో ఒకరు అందించారా ఈ వార్త పత్రికల వాళ్ళకు?

ఏమో--

తెలీటంలేదు.

తెలుసుకోవటం మాత్రం అవసరం. పీకల మీదకు కత్తితెస్తున్న వ్యక్తి ఎవరో తెలుసుకోవటం తప్పనిసరి.

సూర్యారావు ఫోనెత్తాడు. ముత్తయ్య ఇంట్లో ఫోన్ మోగింది. ఇద్దరి గుండెల్లో నిండిన గుబులంతా ఆ తీగల మీద అటూఇటూ ఆందోళనగా ప్రవహించింది.

'ఏం చెయ్యాలి?... ఎలా ఎదుర్కోవాలి ఈ ప్రమాదాన్ని' అన్న ఆలోచనే ఇద్దర్నీ ఉక్కిరిబిక్కిరి చేసింది.

చేసేదేమీ లేదని నిర్ణయించుకొన్నాక, జరిగే పరిణామం ఏమిటో ఎదురు చూడటమే మంచిదని అనుకొన్నాక- ఆ వార్తను నీలివార్తగానే అందరూ పరిగణిస్తారని ఆశిస్తూ, ముఖ్యమంత్రి అడిగితే అందులో నిజం అసలేమీలేదని చెప్పి తప్పించుకోవాలని అనుకొన్నాక- అప్పుడు ఫోన్‌లు పెట్టేశారు.

ఇప్పుడు ఒకరితోఒకరు చర్చించుకోవటం లేదుగానీ, ఎవరికి వారు తామేం చెయ్యాలో, నేరం రుజువైతే -దాన్ని ఎదుటివారిమీదకు ఎలా తోసెయ్యాలో నిర్ణయించుకొనేందుకు తమవారితో చర్చలు, సంప్రదింపులు ఆరంభించారు.




రెండురోజుల క్రితం అందరూ ఒకటై ఎదురు తిరగాలని నిర్ణయం తీసుకొన్నవారు ఇపుడు ఆపద ఎత్తివచ్చాక ఎవరి జాగ్రత్తల్లో వారు ఉండనారంభించారు.




గోవిందరావు టేప్ వినటం పూర్తయింది.

చాలాసేపటివరకు ఆయన నిశ్చేష్టుడయి ఉండిపోయాడు. ఎందుకు చేస్తున్నారు వీళ్ళీ పని? ఏం తక్కువ చేశాడు తను? ఒకరా ఇద్దరా– ఏకంగా యాభై అయిదు మందికి మంత్రిపదవులిచ్చాడు. అర్హులు, అనర్హులు అందరూ ఉన్నారు అందులో.

అదే తను చేసిన తప్పు అయివుంటుంది.

తన పదవిని పదిలపర్చుకోవటానికి తాను అందర్నీ అందలమెక్కిస్తే వారికి లేని అధికారం చేతజిక్కింది. ఏదో వీరులం అని అనుకొంటున్నారు. వీరిలో సగంమంది నెత్తిన రూపాయిపెడితే అర్ధరూపాయికి చలామణీకారు. వీళ్లు... వీళ్లు తనకు ఎసరు తెచ్చేందుకు ప్రయత్నించే ఘనులు! వీరెంత... వీరి బతుకెంత? వీరికిందనుంచి ఒక్కసారి ఆ కుర్చీలాగి పారేస్తే కుదేలవుతారు. అయిపూ అజాలేని అగాథాలలోకి పడిపోతారు. ఊరూ పేరూలేని అనామకులకు తాను మంత్రిపదవినిచ్చి ఓ అడ్రసు సమకూర్చితే, ఇదా వాళ్లుచేసేపని? ఇదా వారు చూపే కృతజ్ఞత!

చూస్తాడు... వాళ్ల శక్తిస్థోమత లెంతో తేల్చిచెప్తాడు. ఒక చావుదెబ్బ కొట్టి, వారిని ఒదిలించుకొంటాడు.

–బజర్ నొక్కాడు.

అంటే గదిలోకి మళ్లీ అందరూ యథాప్రకారం రావచ్చునని అర్థం.

ముందుగా పిఆర్వో లోపలికి వచ్చాడు.

''నగరంలో ఉన్న మంత్రులందర్నీ వెంటనే రమ్మని కబురుపెట్టండి... అందరూ రావాలి!'' ఆజ్ఞ అయింది.

కథ అర్థమవుతోంది. తల ఊపి, బయటకు నడిచాడు. అక్కడినుంచి ఇక వరసగా ఫోన్లు...

గోవిందరావు ఫోనెత్తి రాజభవన్‌లోని గవర్నర్ మదన్‌సింగ్‌తో మాట్లాడాడు– ''ఈ రోజంతా మీరు ఎవైలబుల్‌గా ఉండాలి సర్!'' అన్నాడు గోవిందరావు.

''వాటీజ్‌ది అర్జెన్సీ...?''

''నేను వచ్చి మీకు తెలియజేస్తాను! ఏమైనా ఇబ్బంది కలిగించివుంటే క్షమించండి!'' అన్నాడు గోవిందరావు ఫోన్ పెట్టేస్తూ.

–గదిలో ఎవ్వరూ లేరు. గోవిందరావు ఒక్కసారి పత్రిక అందుకొన్నాడు. విందు సమావేశం గురించి వాచస్పతి రాసిన వార్తంతా మళ్లీ చదివాడు. ఈ విలేకరి ఎవరో ఘటికుడు. పత్రికలో రాసేది రాసి, తనకు కావాల్సింది తనకు పంపించాడు. పత్రికలోగనుక ఆ వార్త రాయకుండా, ఈ ఒక్క టేపుమాత్రమే తనకు పంపివుంటే, వారి విందుభోజనాలు, సమావేశాలు, తీర్మానాల గురించి ఎవరికీ తెలిసి ఉండేదిగాదు. టేప్‌విని తను– తన పని తాను నిర్విఘ్నంగా కొనసాగించి ఉండేవాడు. ఎవరికీ తెలీనంత చులాగ్గా వీరి తోకలు కోసిపారేసేవాడు.

కానీ...

ఆలస్యం అయిపోయింది. ఇపుడు తను ఏంచేసినా దానికి కారణం ఈ పత్రికలోనివార్తే అని అందరూ అనుకొంటారు... అది నిజంకూడానూ! అయినా ఈ విలేకరికి తెలుస్తున్న నిజాలు పోలీసులకు ఎందుకు తెలీటంలేదు? తనకు అసలైన కళ్లలాగ ఉండాల్సిన సి.ఐ.డి.లు ఏంచేస్తున్నట్లు??

–గోవిందరావుకు ఏదీ కొరుకుడుపడటం లేదు.

–గదిలో ఏదో అలికిడి అయినట్లయింది. ఆలోచనల తెరకదిలింది. గోవిందరావు తలెత్తి చూశాడు. ఎదురుగా భార్య మైథిలి.

చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వులో ఏమాత్రం

జీవంలేదు. మైథిలివచ్చి సోఫాలో కూర్చుంది. ఎదురుగా పరచిన పేపరులో వార్త. మరోపక్క టేప్.

మైథిలి పేపరు అందుకొంది. మొదటి నాలుగు వాక్యాలు చదివేసరికి ఆమెకు అంతా అర్థం అయింది. పేపరు పక్కన పడేసింది.

"ఎంతమందికి చెప్తున్నారు ఉద్వాసన?" నెమ్మదిగా ప్రశ్నించింది మైథిలి.

పక్కనే బాంబుపేలినా గోవిందరావు అంతగా ఉలిక్కిపడేమనిషి కాదు. భార్య వేసిన ప్రశ్నతో కళవళపడ్డాడు-- ఎలా తెలుస్తుంది ఈ ఆడవాళ్లకు ఎదుటివారి మనసులో నిమాట? తను ఏం అనుకొంటున్నాడో అంత సరిగ్గా ఎలా చెప్పగలిగింది?

ఆడది... చదువుకొన్నది... తెలివితేటలున్నది... వీటన్నిటికీ తోడు అధికారంపట్ల ఆశలున్నది... ఆవులిస్తే పేగులు లెక్కపెడుతోంది! ఇలాటివారికి గద్దెనెక్కే అవకాశం దొరికిందంటే చాలు... ఇక వదలరు! అయినా తనను ఆ అవకాశం కోరుతోంది.

"అదే ఆలోచిస్తున్నాను" అన్నాడు గోవిందరావు.

"ఆలోచించేందుకు ఏముంది? అందరి రాజీనామాలూ మీ దగ్గరే ఉన్నాయి. అందరివీ గవర్నర్‌కు పంపి, మీ మనుషుల్ని మళ్లీ తీసుకోండి సరిపోతుంది..." అంది మైథిలి.

ఒకసారి భార్య చెప్పిన విషయం గురించి ఆలోచించాడు గోవిందరావు-- ఆమె చెప్పేది సరైనదిగానే తోచింది అతనికి. ఎలాగూ ముందే పేరుపెట్టిందిగదా తనకు 'టెర్రరిస్టు' అని. ఇపుడా విధానమే అమలుచేస్తాడు. అందరి గుండెల్లోనూ రైళ్లను పరిగెట్టిస్తాడు. ఒక్కసారి భయం పుట్టిస్తాడు. ఏ క్షణంలో తానేం చేస్తాడో తెలీనిరీతిలో ప్రతివారినీ అంచులమీద నించోబెట్టి ఆటలాడిస్తాడు. ఆ తర్వాత-- తనవారిని పిలిచి మళ్లీ అందలం అందిస్తాడు.

ఆలోచన బాగానే ఉంది... కానీ దానివల్ల ప్రమాదం ఇంకోటి తలెత్తే అవకాశం ఉందనిపించింది గోవిందరావుకి-- తనవారుగా ఉన్నవారుసైతం ఈ ప్రయత్నంలో ఎదురుతిరగొచ్చు!

--మైథిలి చెప్పింది చేస్తే కోరి కొరివితో తలగోక్కున్నట్లవుతుందేమో?

"ఆలోచిస్తాను..." అని ఊరుకొన్నాడు గోవిందరావు.

మైథిలి ఊరుకోలేదు-- క్షణం ఆగి అడిగింది-- "పోనీ ఈసారైనా... మీ మంత్రివర్గంలో నాలాటి తెలివైనవాళ్లకు, విశ్వసనీయులకు అవకాశం లభిస్తుందా?"

గోవిందరావు నవ్వాడు- "మైథిలీ... నీకు చాలాసార్లు చెప్పాను. నువ్వు తెలివైనదానివే- అయినా నా భార్యవు! కనుక నీకు మంత్రివర్గంలో స్థానం లభించదు- నేను ఎన్ని మార్పులు చేసినా".

"కాన్లెండి అయితే- మంత్రిని చెయ్యమని అడుగుతున్నా. కుదరదంటున్నారు! అర్హతలేదనో, అందుకు తగినదాన్ని కాననో మీ అభిప్రాయం కావచ్చు. కానీ దానికి చుట్టరికాన్ని అడ్డంగా చెప్పుకొంటున్నారు. మీ భార్య అయినంత మాత్రాన మంత్రిని కావటానికి వీల్లేదనటం అర్థంలేదు. సరే... పోనీండి, నాకు అంతకుమించిన అర్హతలు, తెలివితేటలు ఉన్నాయని రుజువు చేసుకొంటా!" అంది మైథిలి.

ఆమె అనటం చాలా మామూలుగానే ఉన్నా, ఆ మాటల వెనక ఆమె దృఢనిర్ణయం గోవిందరావుకు స్పష్టంగా కనిపించింది.

ఆడది తల్చుకొంటే ఏదైనా చెయ్యగలదన్న నిజాన్ని రుజువు చేసేందుకు కంకణం కట్టుకొన్న రీతిలో ఉందా మైథిలి- అన్న భయం గోవిందరావునొక్కసారి కంపింపజేసింది.

ఆ భయాన్ని దాచుకొంటూ అన్నాడు నవ్వేస్తూ- "అంటే... మంత్రివి కాలేనిదానివి ముఖ్యమంత్రినవుతానంటున్నావా?"

"చూద్దాం... అదే జరుగుతుందేమో!"

"మంచి జోకే!" గలగలా నవ్వాడు గోవిందరావు.

ఆ నవ్వులో మైథిలి కూడా పాలుపంచుకొంది.

-అరగంట గడిచేసరికి 'హర్ష' భవనం ముందు అన్ని ప్రభుత్వ వాహనాలు తీరికగా చోటుచూసుకొని నిలబడి వున్నాయి. భవనంలో పల యాభైమంది మంత్రులూ నిలబడి ఉన్నా




రు, కూర్చొని ఉన్నారు, ఒకరితో ఒకరు మాట్లాడుకొంటున్నారు, మనసుల్లో గజగజవణికిపోతున్నారు.

-ఏం జరుగుతుందో, ఏంజరిగితే దానికి ఎలా ప్రతి చర్య తీసుకోవాలో ఎవరికి వారు ఆలోచించుకొంటున్నారు.

ఆలోచనల్లో విషాన్నీ భయాన్నీ ఆందోళనలనీ బయటకు కనపడనీయకుండా జాగ్రత్తపడుతున్నారు.

అందర్నీ లోపలికి పిలిపించాడు గోవిందరావు. అందరూ సర్దుకున్నాక గదిలో మరెవ్వరూ లేరని నిర్ధారించుకొని నెమ్మదిగా మొదలుపెట్టాడు గోవిందరావు- "ఈరోజు పత్రికలో వచ్చిన వార్త మీరంతా చూసే ఉంటారు. అది నిజమా, అబద్ధమా అని మీలో చాలామంది అనుకొంటూ ఉండొచ్చు. పత్రికలో వచ్చిన వార్తలన్నీ నిజం కాకపోవచ్చు. కానీ ఈ వార్త అక్షరాలా నిజం అని నిరూపించేందుకు నా దగ్గర సాక్ష్యాధారాలు ఉన్నాయి. మీలో కొందరు... స్వార్థంతో ఎన్నోచోట్ల నీతినియమాలను అతిక్రమించారు. ఈ దేశంలో రాజకీయాలు అవినీతికి పుట్టిళ్లు. ఎక్కడా గుడ్డిగవ్వకు చెల్లుబాటుకాని వాళ్లు రాజకీయాల్లో లక్షలకు, కోట్లకు పడగలెత్తుతున్నారు. ఎలా సంపాదిస్తున్నారు ఇంత డబ్బు? అందరికీ తెలిసిన బహిరంగ రహస్యాలవి! మీరంతా వీలైనంత నీతిగా ఉండమని కోరాను. మంత్రి పదవి మూణ్ణాళ్ల ముచ్చటన్న సంగతి మీకు తెలును. అందుకే ఆ మూణ్ణాళ్ల కాలంలోనే అందింది అందినట్లు దోచుకొందామని ప్రయత్నాలు చేశారు. లంచం పట్టద్దని, నీతితో బతికి బికారిగా మిగలమని నేనెప్పుడూ అనలేదు. కానీ చేసే పనిని జాగ్రత్తగా చెయ్యమని చెప్పాను. ఎవరి కంటా పడొద్దని హెచ్చరించాను. దొరికితేనే దొంగ కాబట్టి దొరకకుండా దొరలా బతకండన్నాను! అయినా మీలో కొందరు విన్నారుగాదు! చేతికందిన అధికారాన్ని దుర్వినియోగం చేసుకొనేవాడొకడు, అధికార గర్వంతో కామాంధుడై మసిలేవాడు ఇంకొకడు-- వారిని తొలగించి మిగిలిన వారికి గుణపాఠం నేర్పాలని ఆశించాను. దాంతోనైనా జాగ్రత్త పడతారని ఆశించాను. మీరు ఆ హెచ్చరికల్ని పట్టించుకోలేదు. మీలో కొంచెం భయాన్ని పెంచాలని, దాంతోనైనా క్రమశిక్షణ అలవర్చుకొంటారని నేను మీ రాజీనామాలు దగ్గరపెట్టుకొన్నాను. దానివల్ల మీకేదో అన్యాయం జరుగుతున్నట్లు మీరు విందుల పేరుతో తిరుగుబాటు జెండా ఎగరేసే ప్రయత్నం చేపట్టారు. 'హర్ష' భవనంలో ఉన్న నాకు- ఆ మూల ఎక్కడో మీరు జరుపుకొనే సమావేశాల గురించి ఏం తెలుస్తుందనుకున్నారు... పొరబాటుపడ్డారు. అక్కడ మీలో కొందరు ఏమేం మాట్లాడారో, కాదనేందుకు వీల్లేని విధంగా ఈ టేపులో భద్రపరిచాను. తిరుగుబాటు అనేది పార్టీకి మంచిది కాదు! పార్టీ సంగతి పక్కకుపెట్టండి. ఏ నాయకుడికైనా తిరుగుబాటు రుచించదు. తనకు ఎసరు తెచ్చే ఏ వ్యక్తినీ ఏ నాయకుడూ క్షమించడు. మిగిలినవారి మాటఏమోగానీ, ఈ గోవిందరావు అసలు క్షమించడు. మీ తిరుగుబాటును మొగ్గలోనే తుంపి, మీరు భవిష్యత్తులో సైతం ఇలాటిపిచ్చి ఆలోచనలు చెయ్యకుండా చెయ్యగలడు. మొన్నటి విందు సమావేశం... నిజానికి చాలా చిన్నది. అది నాకే ప్రమాదాన్నీ తేలేనిది. అయినా దాన్ని క్షమిస్తే, మీరు మరింత విజృంభించే ప్రమాదం ఉంది. కాబట్టే మీ సంజాయిషీలేమీ అడగను.... నాకు అక్కర్లేదు. ఆ సమావేశంలో పాల్గొన్న మంత్రులందర్నీ నా మంత్రివర్గం నుంచి తొలగించాలని నిర్ణయించుకున్నాను"

చిన్నసైజు సభలాటి ఆ హాలులో కూర్చున్న మంత్రులంతా గుటకలు మింగారు. అందరిలోనూ కత్తివేటుకు రక్తంలేని చందమయింది.

హాలంతా నిశ్శబ్దం.

గట్టిగా ఊపిరితీస్తే అది పార్టీకి, నాయకుడికి ప్రతిగా చేసిన తిరుగుబాటుకు ప్రతీక అవుతుందేమోనన్న భయంతో ఎవరూ ఏమీ అనటంలేదు.

చాలాసేపు నిశ్శబ్దం తర్వాత- సూర్యారావు లేచాడు- నెమ్మదిగా గొంతు సవరించుకొన్నాడు- "విందుకు నేనూ హాజరయ్యాను! ఏముంది అందులో తప్పు?"

సూర్యారావు అలా ప్రశ్నించేసరికి సభలో ఇంకొందరికి ధైర్యం వచ్చేసింది. ఒకరు లేచారు, ఇద్దరు లేచారు... చివరకు ఓ పదిమంది లేచారు.

అందరూ తలోమాట అందుకున్నారు.

గోవిందరావు ఒక్కసారిగా గట్టిగా గొంతెత్తి అన్నాడు- "మీ విందుకు నన్నెందుకు పిలవ లేదు? మీకు ఏదురాలోచనా లేకుంటే నన్నెందుకు దూరంగా ఉంచుతారు? మీరక్కడికి నా మీద చర్చించుకోవటానికే చేరారన్న సంగతి నాకు తెలుసు. చెప్పాగదా- ఇక్కడే మీరు మాట్లాడిందంతా టేపయివుంది. విని పించమంటారా చెప్పండి... నాకే అభ్యంతర మూలేదు!"

సూర్యారావు కొంచెంతగ్గాడు- టేపు వినిపించటమే జరిగితే, ఆ సమావేశానికి కర్త తనేనన్న సంగతి స్పష్టమవుతుంది! టేపులోని విషయాలు తనతోటివారికే కొన్ని బాధాకరంగా తోచేప్రమాదం ఉంది. అందుకే సూర్యారావు కొంచెం తగ్గాడు.

కానీ ముత్తయ్య మాత్రం ఊరుకోలేదు- "అవునండీ... వేరుగా మీటింగ్ పెట్టుకొన్నాం. ఏమయింది... దానికే మీరంతగా భయపడిపోవాలా?" అని ఎదిరించాడు.

గోవిందరావు నవ్వాడు- "భయపడటం లేదు... భయపెడుతున్నాను! ఏమాత్రం ఎదురుతిరిగినా క్షమించనని, సహించనని గుర్తుచేస్తున్నాను అంతే"

"మంత్రివర్గంలోంచి తీసేందుకు మీకేముందండీ అధికారం? మేం అధిష్టానవర్గానికి కంప్లయింట్ చేస్తాం!"

"చేసుకోండి... నిరభ్యంతరంగా చేసుకోండి! కానీ... అప్పటికే మీ రాజీనామాలు గవర్నర్గారు ఆమోదించి ఉంటారని గుర్తుపెట్టుకోండి!"

"అంటే- అధిష్టానవర్గం నుంచి ఏం జవాబు వచ్చేదీ తెలుసుకొనేంత వరకైనా ఆగరా?"

"ఆగను. ముఖ్యమంత్రిగా, పార్టీ నాయకుడుగా నాకు కొన్ని హక్కులు ఉంటాయి. వాటిని వినియోగించుకొంటూ మిమ్మల్ని బయటకు పంపిస్తున్నాను!"

ముత్తయ్యకు కోపం పెరిగిపోయింది. బ్లడ్ ప్రెషర్ ఎక్కువైపోయింది- "ఇదిగో గోవిందరావూ- ముఖ్యమంత్రి సీట్లో కూర్చొన్నవాడికి కొంచెం ముందూవెనకా చూసుకొనే తెలివి ఉండాలి. పట్టువిడుపూ ఉండాలి. అదేమీలేకుండా నా పని చేసుకొనిపోతానంటే... మొదటికే మోసం వస్తుంది... జాగ్రత్త!"

గోవిందరావు ఉలిక్కిపడ్డాడు- ఆఖరికి ముత్తయ్య సైతం ఇలా హెచ్చరించటం అతనికి భరించలేనిదయింది. కోపాన్ని అణచుకొనే ప్రయత్నం చేస్తూ అన్నాడు- "ఏం చేస్తారు మీరు? మంత్రి పదవుల్లోంచి తీసిపారేస్తే మీరు కోరల్లేని వానపాములలాంటివారు. అలాటి పాములు కనిపించితేచాలు కాలికింద వేసి నలిపి పారేస్తారేగానీ ఎవ్వరూ భయపడరు!"

"కోరలు తీసి చూడండి, తెలుస్తుంది. పాముకు ఒక్క కోరల్లోనే విషంగానీ మనుషులకు నిలువెల్లా విషమే! మంత్రులకయితే- వేరుగా చెప్పేదేముంది- మా పదవిపోవటం జరిగిందంటే మీకే నష్టం అన్నది గుర్తుంచుకోండి!"

గోవిందరావు చిన్నగా చిరునవ్వు నవ్వాడు- "మీకు రూల్స్తెలీవు. పార్టీలో మెజారిటీ సభ్యులు నావైపు ఉన్నంతకాలం నాకే ప్రమాదమూ రాదు. మిమ్మల్ని కొందర్ని తీసిపారేస్తే, ఇంకొందర్ని మంత్రుల్ని చెయ్యొచ్చు! మీకన్నా వారు విశ్వాసపాత్రులై ఉంటారు!"

"మీకు రూల్స్తెలుసుగానీ, లోకజ్ఞానంలేదు! ఈ దేశంలో రాజకీయ నాయకుల మనస్తత్వం మీకు తెలీదు. మమ్మల్ని తీసేస్తే మేం అలజడులు సృష్టిస్తాం. మీ పదవికి ఎసరుతెస్తాం- మునిగిపోయే పడవనే అంటిపెట్టుకునేంత తెలివితక్కువ జనాలుకారు మన శాసన సభ్యులు! కొంచెం సందేహంవస్తేచాలు- అప్పుడు మొదలుపెడతారు తీర్థ ప్రజలాగా మరో వైపు పరుగు! ఇది మీకు అనుభవంలోకి తెచ్చి చూపిస్తాం... చూడండి!"

"మీ ఇష్టం... మీ ఇష్టం వచ్చింది చేసుకోండి! మీలాటి పక్కలో బల్లాలతో కలిసి బతకటంకన్నా పదవిని పోగొట్టుకొని బతకటమే మేలు. విందుకు హాజరైన పధ్నాలుగు మందికీ మంత్రిపదవులుండవ్! వారెవరో అందరికీ తెలుసు! వాళ్ల రాజీనామాలు గవర్నర్గారికి పంపిస్తున్నాను. ఆయన వాటిని వెంటనే ఆమోదిస్తారు! వెళ్లండి... ఇక దీని మీద చర్చ అనవసరం- నా నిర్ణయం చెప్పాను!"

"తొందరపడుతున్నారు..." సూర్యారావు




గట్టిగా అన్నాడు.

"నా ఇష్టం"

"మేం కూడా చేతులకు గాజులు తొడి గించుకొనిలేం!" ముత్తయ్యా హెచ్చరించాడు.

"చెప్పాగద... మీ ఇష్టం వచ్చింది చేసు కొండి- పొండి!" అంటూ గోవిందరావు లేచి గదిలోంచి లోపలికి నడిచాడు.

గోవిందరావు నిష్క్రమణతో ఉన్నట్లుండి అక్కడి వాతావరణంలో వేడి తగ్గింది.

రెండునిమిషాల తర్వాత ఆ హాల్లోంచి సూ ర్యారావు బయటకు నడిచాడు. అతని వెంట ముత్తయ్యా... అతనివెంట మిగిలిన డజను మంది...

హర్షభవనంనుంచి కార్లు బయలుదేరాయి. మంత్రివర్గంలోంచి ఉద్వాసనకు గురైన పద్నా లుగుమందీ తిన్నగా సూర్యారావు అధికార నివాసగృహానికి చేరారు.

"చావుదెబ్బ కొట్టాడే మనల్ని!"

"పొరబాటయిందన్నా నిన్న మీటింగ్ పె ట్టటం!"

"కొంపకూల్చినవే గదా సూర్యారావూ! ఇన్నేండ్లకు గదా మంత్రినైనాను, నువ్వేందో దాన్ని హూష్‌కాకీ చేసినావు!"

—అందరూ తలోరకంగా వ్యాఖ్యానించటం ఆరంభించారు.

సూర్యారావు అన్నీ విన్నాడు. ఆ తర్వాత సర్దుకొంటూ అన్నాడు - "నిజమే... పొరబాట యింది! గోవిందరావును కొంచెం బెదిరించా లనే అనుకొన్నాంగానీ, ఇట్లా అవుతుందని అనుకొన్నామా? లెక్క ఎక్కడో తన్నింది. అంత మాత్రాన మనం ఊరుకొంటామా? ఎదురుతిరు గుదాం. ఎట్లాగూ 'డిసిడెంట్స్' అన్నారు. అట్లా గే ఉందాం! అధిష్ఠానవర్గం వారితో మాట్లా డదాం! ఇంకో పదిమందిని కూడ గట్టుకొంటే - గోవిందరావు పనే 'గోవిందా' అయిపోతుంది... ఆలోచించండి!"

"ఏం ఆలోచించటమో మా మతులు పోతు న్నాయ్! అసలంతా ఆ డిన్నర్ మనం ఎవ రింట్లోనో పెట్టుకొంటే సరిపోయేది. ఆ హోటల్లో పెట్టుకోబట్టి అంతా బయటపడిపోయింది!"

"హోటల్‌వాడు ఏంచేస్తాడు లేవయ్యా! ఈ పేపర్‌వాడే అట్లున్నాడు! రామనా థంపోయె, రాంప్రసాద్‌పోయె, నీలాంబరరావు పోయే, ఆఖరికి ఒకేసారి పద్నాలుగుమందిమి మనమూ పోవాల్సివచ్చింది! తప్పంతా ఆ పేపరోడిదే..."

ముత్తయ్యా గొంతు సవరించుకొన్నాడు-- "తొందరపడద్దు. ఇపుడింకా పదిన్నరే అయింది టైం! ఒంటిగంటవరకు చూద్దాం-- ఈలోగా గోవిందరావుగానీ మన రాజీనామాలు గవర్నర్‌కు పంపకపోతే-- మంచిదే: మనమే వెళ్లి మాట్లాడుదాం! వేడిలో ఏదో అంటాడు గానీ, మన రాజీనామాలు గవర్నర్‌కు పంపడు గోవిందరావు. పంపాడో... అప్పుడు మన సత్తా చూపిద్దాం-- కొంచెం ఓపికపట్టండి. మాటజారి పోయినంత తేలికగా రాజకీయనాయకుడు చేతజారిపోకూడదు!"

చాలామందికి ఆ సూచన నచ్చింది.

చాలామందిలో ఆవేశం తాటాకుమంటలా గుప్పున రగులుకొని, వెంటనే చల్లారిపోతుంది. గోవిందరావు కూడా అలాగే చేస్తాడని వీరు ఆశించారు. గంటా గంటన్నర సమయంలో మళ్లీ ఆహ్వానిస్తూ గోవిందరావు నుంచి పిలుపు వస్తుందని వాళ్లు ఆశపడుతూ కూర్చున్నారు.

సూర్యారావు ఇంట్లో ఫోన్లకు క్షణం తీరుబడి ఉండటంలేదు - రాష్ట్రం నలుమూలలనుంచి ఫోన్లు - 'పేపర్లో వచ్చింది నిజమేనా?' అని కొందరు, 'ఇన్నాళ్లకైనా మంచిపని తలపెట్టా రని' కొందరు, 'రాజధానికి వస్తున్నామని?' ఇంకొందరు...

సూర్యారావు ఒక్కొక్కరితో - వారికి తగినట్లు సమాధానాలు ఇస్తూ ఉండిపోయాడు. మిగిలిన వారంతా తమలోతాము మాటల్లో మునిగిపో యారు.

అప్పుడు వచ్చిందో ఫోన్ - ముఖ్యమంత్రి గారి అధికార నివాసంనుంచి. ఫోన్ చేసింది మాత్రం గోవిందరావుకాదు, ఆయన శ్రీమతి మైథిలీరావ్.

ఫోనందుకొన్నాడు సూర్యారావు... గౌరవంతో పలకరించాడు— "లేదు మేడం... నిజంగా మేమలా ఆలోచించలేదు. ఆయన వరసబెట్టి మంత్రుల్ని పీకిపారేస్తోంటే ఏంచెయ్యాలి? అది ఆలోచించేందుకు మేం అక్కడ సమావేశ మయ్యాం!"

"కావచ్చు... కానీ ఆయనకు మీరేమేర్లమాట్లా డారో తెలుసు. కాబట్టి మీ ఉద్దేశం మంచిదే అయినా, చివరికది రూపుదిద్దుకొన్న తీరు బాగుండలేదు. అది ఆయనకు నచ్చలేదు. ఇపుడు మీరేం చెప్పినా ఆయన నమ్మరు! దానికితోడు..." మైథిలి ఆగింది.

"చెప్పండి మేడం... కొంచెం మీరైనా ఒక మాట చెప్పిచూడండి! మీకు కృతజ్ఞులై ఉంటాం"

"బాగుంది మీరనేది! ఆయన గారు మీ రాజీనామాల్ని గవర్నర్‌గారికి పంపి చాలాసేప యింది. వాటిని ఒకే చేస్తున్నట్లు అక్కడినుంచి వర్తమానం కూడా వచ్చింది. ఇక మిగిలిందల్లా ఓ ప్రకటన రావటమే!"

సూర్యారావులో క్షణకాలం చలనం ఆగిపో యింది. గొంతు తడి ఆరిపోయింది. నమ్మలేక పోతున్నాడు అది నిజమేనని!

ఎందుకిలా బెడిసికొట్టింది తమ పథకం?

ఏం ఆశించాడు? ఏం జరుగుతోంది?

ఇకపై ఏం జరగనుంది?

—"మీరలా నిశ్చేష్టులయిపోకండి! జరి గిందేదో జరిగిపోయింది. జరగాల్సింది ఏమిటో ఆలోచించుకోండి!"

"ఇంకా ఆలోచించటం ఏమిటి మేడం? మాకిక్కడ మతులుపోతున్నాయి!" సూర్యా రావు నిజాయితీగా అన్నాడు.

మైథిలి నవ్వింది. "రాజకీయాల్లోకి వచ్చిన వారికి మతులు పోకూడదు! వాళ్లు ఇంకొకరి మతులు పోగొట్టాలేతప్ప, సొంత మతులు పోగొట్టుకోకూడదు! ఆలోచిస్తే ఏదో ఓ మతలబు మీకు తట్టకపోదు. ఆలోచించి చూ డండి!" అంటూ ఫోన్‌పెట్టేసింది.

సూర్యారావు ఫోన్‌పెట్టి రాజీనామాలన్నీ గవ ర్నర్‌గారి ఆమోదానికి వెళ్లిన సంగతి ప్రక టించాడు.

సంతాపాన్ని పాటిస్తున్న తీరులో ఎవ్వరూ మాట్లాడలేదు. ఆ తర్వాత చెప్పాడు - ఆ వార్త తనకు సియంగారి శ్రీమతి 'మేడం' దగ్గర నుంచే వచ్చిందని చెప్పాడు. "ఆలోచించమని ఆమె సలహా ఇచ్చారు. ఏంచెయ్యాలో నాక యితే తోచటంలేదు"

"అదీ ఆమెనే అడగలేకపోయారా?" ఎవరో వేళాకోళంగా అన్నారు.

ముత్తయ్యకు ఆ మాటలో కొంత నిజం ఉందనిపించింది.

అక్కడేమీ అనలేదుగానీ, ముత్తయ్య సూ ర్యారావుతో ఆ మాటే అన్నాడు—

"అసలు మనం ఆలోచిస్తే అదే మంచిదని పిస్తోంది. వాళ్లిద్దరికీ కూడా ఏవో గొడవలు ఉన్నాయనే నా అనుమానం. లేకుంటే - గోవిందరావు సియం అయినపుడే ఆవిడ యంయల్ఏగా రాజీనామా చేసింది. ఈరోజు... ఆయనలా గవర్నర్‌కు మన రాజీనామాలు పంపటం ఏమిటి, ఈవిడిలా మనకు ఫోన్ చెయ్యటమేమిటి"

సూర్యారావు కూడా చాలా ఆలోచించాడు. చివరకు అందరూ అదే ఆలోచించారు. అంద రూ కలిసి ఆమెనే ఈ విషయంలో సలహా అడిగితే సరిపోతుందని అనుకొన్నారు.

సూర్యారావు 'హర్ష'కు ఫోన్‌చేశాడు - మైథిలి ఫోన్ ఎత్తింది. "మీరొక్కసారి ఇటువైపువస్తే బాగుంటుందని మేం అనుకొంటున్నాం!"

"అబ్బే... నేనెందుకండి! కష్టంలో ఉన్నారు గదానని ఫోన్‌చేసి నా సానుభూతి చెప్పాను! అంతేగానీ... అయినా మీ గ్రూప్‌కు నాయకుడె వరో ఉండివుంటారుగదా, ఆయన సలహా తీసుకోవాల్సింది"

మైథిలి అంటున్నదేమిటో సూర్యారావుకు క్షణం అర్థంకాలేదు. ఆతర్వాత సర్దుకొంటూ అన్నాడు— "మేం ఆ విషయమే మీతో మాట్లా డాలని నిర్ణయించుకొన్నాం. మీరు శ్రమ అను కోక వస్తే..."

ఈ దేశం ఫోన్లు ఇంకా పూర్తిగా అభివృద్ధి చెందలేదు కాబట్టిగానీ లేకపోతే, ఆక్షణంలో అవతలివైపునుంచి మాట్లాడుతున్న మైథిలిని గనుక చూసే వీలువుండివుంటే సూర్యారావుకు ఆమె ముఖంలో అనుకొన్నది సాధించానన్న తృప్తి స్పష్టంగా కనిపించి ఉండేది.

"మంచిది... ఒక్క అరగంటలో వస్తాను" అంటూ ఫోన్‌పెట్టేసింది.

ఈ అరగంటలోనూ సూర్యారావు, ముత్తయ్య ప్రభృతులంతాచేరి, మైథిలినే తమకు నాయ కురాలిగా ఎన్నుకొంటే సరిపోతుందన్న నిర్ణ




యానికి వచ్చారు.

సరిగ్గా అరగంట గడిచేసరికి సూర్యారావు ఇంట్లోకి మైథిలి అడుగుపెట్టింది. ఒక్కసారిగా అక్కడివారందరిలోనూ చైతన్యం నిండింది.

రాజకీయాల్లో ఏదీ వింతగాదు. ఏదీ జరగద నిలేదు. అక్కడివారికి అధికార లాలస ఉండా లేగానీ, వారికి 'నలజ్జా, నభయం, నబంధు ననుతా' ఎదురుగా నిల్చింది ఎవరైనాగానీ వారిని పడగొట్టటం ఒక్కటే వారి లక్ష్యం. ఆ లక్ష్యసాధనకు అనుసరించకూడదనే మార్గం ఏదీలేదు. అన్ని దారులు సరైనవే, అన్ని మార్గాలూ సరైనవే!

'ఎవ్విరి థింగ్ ఈజ్ ఫెయిర్ ఇన్‌లవ్ అండ్ వార్' అంటారు-- రాజకీయాల్లోనూ అంతే. ప్రేమలో, యుద్ధంలో అసమంజసమై నది ఏదీ లేనట్లే రాజకీయాల్లోనూ లేదు-- అక్కడ అంతా సమంజసమే!!

మరో అరగంట గడిచేసరికి ఆ తిరుగుబాటు దార్ల గ్రూప్‌కు మైథిలి నాయకత్వం చేపట్టింది. అప్పటికే గవర్నర్ - పధ్నాలుగురు మంత్రుల రాజీనామాలు ఆమోదించినట్లుగా ప్రకటనలు వెలువడ్డాయి.

పత్రికల కార్యాలయాలన్నిటిలోనూ ఒకటే సందడి. కేవలం ఒకేరోజులో పధ్నాలుగు మంది మంత్రులకు ఉద్వాసన చెప్పటం రాష్ట్రంలో ఎప్పుడూ జరగని సంగతి.

అన్ని పత్రికలవాళ్లు సూర్యారావు ఇంటికి దారితీశారు. ఆలోగానే అన్ని పత్రికలకూ సూ ర్యారావు ఇంటికి రావాల్సిందిగా వర్తమానం వెళ్లింది.

వచ్చిన విలేకరులకు ఆ తిరుగుబాటు బృందానికి మైథిలీరావ్ నాయకత్వం వహిస్తూ కనిపించటం ఆశ్చర్యం కలిగించింది.

వారి ఆశ్చర్యాన్ని గమనిస్తూ అంది మైథిలి- ''రాష్ట్రంలో పరిస్థితి క్రమంగా ఎలా దిగజారు తోందో మీకు తెలీని విషయంకాదు. అవినీతి అన్నివైపులనుంచి దట్టంగా ఆవరించుకుపో యింది. ఆఖరికి మంత్రులలోసైతం అవినీతి పరులకు స్థానాలు లభిస్తున్నాయంటే పరిస్థితి ఏమిటో మీరే అర్థంచేసుకోండి! పరిపాలన అన్నది నామమాత్రంగా మిగలటాన్ని సహించ లేకపోతూ మా బృందంలోని మంత్రులం అందరమూ కలిసి ముఖ్యమంత్రిని రాజీ నామా చేయాలని కోరాం! ఆయన అందుకు అంగీకరించకపోవటంతో రాజీనామాచేసి వీరంతా మంత్రివర్గంనుంచి తప్పుకోవాల్సివ చ్చింది. అసమర్థుడైన నాయకుడి వద్ద పనిచే యటానికి అయిష్టం వ్యక్తంచేస్తున్న వీరు కోరే దంతా రాష్ట్రానికి సమర్థమంతమైన నాయక త్వం మాత్రమే''

విలేకరుల సంగతి పక్కనపెడితే, సూర్యా రావు ప్రభృతులంతా నివ్వెరపోయారు-- ఆమె రాజకీయ చాతుర్యానికి!

నిజానికి తమకు జరిగింది ఉద్వాసన అయినా దానికి ఆమె స్వచ్ఛంద రాజీనామా లుగా కలర్ ఇచ్చింది. కిందపడినా గెలుపు మాదే అన్నతీరుతో కాకుండా గోవిందరావును సరిగ్గా సూటిగా ఎదుర్కోగలిగింది ఆమె ఒక్కతే అనిపించింది సూర్యారావుకు!

తప్పనిసరి అయినా సరైనవ్యక్తికే నాయక త్వం అందించామన్న తృప్తి అక్కడి అందరిలో కనిపించింది.

''రాజీనామాల సంగతి సరేననుకోండి! ఆపై కార్యక్రమం ఏమైనా చేపడుతున్నారా?'' ఒక విలేకరి ప్రశ్నించాడు.

మైథిలి చిరునవ్వు చిందించింది-- ''పైకా ర్యక్రమం లేకుండా ఎలాఉంటుంది చెప్పండి! అది ఏరూపంలో ఉండాలో మేమింకా ఆలో చించుకోలేదు. రాష్ట్రానికి మంచి నాయకత్వం కావాలనేది మాకోరిక''

''మంచి నాయకత్వం అంటే...? పోనీ మీ దృష్టిలో ఉన్న మంచి నాయకులెవరో చె ప్తారా?'' ఇంకో విలేకరి ప్రశ్న.

''మేం కార్యవాదులం! మంచి నాయకత్వం అంటే ఏమిటో మాటల్లో చెప్పేకన్నా చేతల్లో చూపటం మంచిదని మా ఉద్దేశం. ఇక ఎవరు అంటే ఆ అవకాశం రానీండి-- ఆ వ్యక్తి ఎవరో ముందే ఎలా తెలుస్తుంది!''

''ఒక పర్సనల్ ప్రశ్నండీ - గోవిందరావుగా రు మీ భర్తేకదా! భారతీయ స్త్రీ భర్తను అనుస రించి నడవాలని అంటారు. మరి మీరు ఇలా వ్యతిరేకించటం... విచిత్రంగాలేదూ, విడ్డూ రంగాలేదూ!'' మైథిలిని సూటిగా అడిగాడు ఇంకో విలేకరి.

''భారతీయ స్త్రీకి భర్తే ప్రత్యక్ష దైవం...




కాదనను! నాకూ అంతే! కానీ అంతమాత్రాన భర్తలోని లోపాలను ఎంచి చెప్పటం తప్పని నేను అనుకోను. అసలు స్త్రీపురుషుల ప్రసక్తి వదిలిపెట్టండి— ప్రతివ్యక్తికీ కొన్ని బాధ్యతలున్నాయి. తన కుటుంబంకన్నా రాష్ట్రంపట్ల ఆ బాధ్యత అధికం. రాష్ట్రంకన్నా దేశంపట్ల బాధ్యత మరీ అధికం. రాష్ట్రానికి అన్యాయం జరుగుతోందని అనుకొన్నపుడు భర్త, భార్య అంటూ పరిధి గీసుకొని సంకుచితంగా ఆలోచించటం అర్థంలేనిదేగాదు, అనర్థహేతువు అనికూడా నా అభిప్రాయం. రాజకీయాల్లోనే కాదు, కుటుంబ విషయాల్లోకూడా నా అభిప్రాయాలను స్వేచ్ఛగా ప్రకటించే అధికారం, హక్కు, అవకాశం నా భర్త గోవిందరావు నాకెప్పుడూ ఇస్తూనేవచ్చారు. ఇప్పుడూ అంతే! ఈ విషయంలోకూడా ఆయన నా అభిప్రాయాల్ని గౌరవిస్తారనేది నిజం''

—విలేకరులు కూడా ఆమె చతురతకు జోహార్లు చెప్పుకొన్నారు. ఆ మాటలలో- ఆఖరికి గోవిందరావుకూడా ఆమెకు ప్రతిగా ఒక్కటంటే ఒక్కమాట అనే వీలులేకుండా చేసేసింది!!

—విలేకరులు వెళ్లిపోయాక మైథిలి, సూర్యారావు వగైరాలతో సంప్రదింపులు జరిపింది. రాజీనామాల పర్వం ముగిసింది కాబట్టి తర్వాతి కార్యక్రమం ఏమిటన్న ప్రశ్న మిగిలింది వారి ముందు.

మైథిలి ఆ విషయంలోనూ వారికి సూచనలు చేసింది— గోవిందరావు రాజీనామా కోరుతూ రేపటినుంచే రాష్ట్రంలో అలజడులు ఆరంభించటం ఆ సూచనల్లో ఒకటి.

''అన్నీ శాంతియుతంగానే జరిగితే మంచిదని నా అభిప్రాయం'' అంది మైథిలి.

'నా అభిప్రాయం అది, ఆపైన మీ ఇష్టం'- అన్న సూచన అందరికీ అర్థమయింది. అయినా అలజడులు, ఆందోళనలు లేకుండా రాజకీయాలు ఏమిటి, రాష్ట్రానికి చరిత్ర ఏమిటి?

హింస లేకుండా అలజడి ఏమిటి? ఆందోళన ఏమిటి? ఎవరికి తెలీని విషయాలు అవి! అయినా అందరూ ఆమె మాటలకు తలఊపారు.

ఆనాటి కార్యక్రమాలు అయినట్లు, ఆ రోజు నుంచీ రోజూ కలుసుకోవాలని నిర్ణయించుకొని అందరూ బయటకు నడిచారు.

—నడుస్తున్నవారందరికీ మైథిలీరావ్ నాయకత్వంలో నమ్మకం పెరిగింది. కానీ ఒక వ్యక్తికి మాత్రం ఇంత గొడవ అనవసరంగా తలెత్తిందనే భావం కలిగింది. ఏదో నలుగురు కలిసి ఓచోట కూర్చుని విందు చేసుకొంటూ ఉంటే దానిపై నిఘావేసి, దాన్ని రికార్డ్ చేసి ముఖ్యమంత్రికి అందజేయాల్సిన అవసరం ఏమొచ్చింది? ఎంత గొప్ప విలేకరికైనా అదేంపాడు బుద్ధి?

—అలాటివ్యక్తికి ముందు బుద్ధిచెప్పాలి. ఎక్కడ కలగజేసుకోవచ్చో, ఎక్కడ కన్నెత్తి చూడరాదో అతనికి నేర్పాలి. ఆ అవసరం ఉంది-- అనుకున్నాడా వ్యక్తి...

ఆ వ్యక్తిపేరు... ముత్తయ్య!




ముత్తయ్య రాజకీయాల్లో పుట్టి రాజకీయాల్లో పెరిగినవాడు కాదు. అతన్ని కాలం అలా నడుపుతూ వచ్చింది.

కొందరుంటారు వారికి రేపటిసంగతి ఏమిటో తెలీదు. అది వారి ఊహకు అందదు. ఈరోజు ఇలా గడిస్తేచాలన్న పద్ధతిలోనే వారు జీవితాన్ని గడుపుకొంటూ వస్తారు. అలాటివారు చాలామంది పుబ్బలోపుట్టి మఖలో మాడిపోయే పుట్టగొడుగు జీవితాల్ని గడుపుతారు. కానీ కొందరు అదృష్టవంతులు వీరిలోనూ వుంటారు. వారికి మాత్రం రేపేమిటో తెలీకపోయినా, నేటి ఆధారంతో రేపు అనుకోకుండా అందలా లెక్కేస్తూ వుంటారు.

ఇలాటి అదృష్టవంతుల జాబితా ఒకటి

తయారుచేస్తే దాంట్లో ముత్తయ్యపేరే ముందుండితీరాలి!!

—ముత్తయ్య తల్లిదండ్రులు - నగరానికి నడిబొడ్డున ఉన్న మురికివాడలో ఉండేవారు. అదంతా ఎవరిదో స్థలం. పెద్దషాపింగ్ కాంప్లెక్స్‌కోసం కొనుక్కొన్న స్థలమది. పునాదులు తీయటానికి ముహూర్తం పెట్టుకొన్న రోజునే ఆ యజమాని గుండె ఆగిపోయింది. గుండె ఆగిపోవటానికి శారీరక, ఆరోగ్యపరమైన కారణాలు ఎన్నోవుంటాయని వారికీ, వారింటివారికి తెలిసినా ... 'అదంతా ఆ స్థల మహత్యమే'నని కొందరంటే 'నిజమే, కాబోలను'కొన్నారు! అంతే! ఆ స్థలాన్ని ఓ ఏడాదిపాటు చూడకూడదని ఎవరో అంటే దాన్నీ నమ్మారు.

—ఏడాది గడిచేసరికి చూస్తే ఏముందీ - అక్కడంతా చిన్నాపెద్దా గుడిసెలు మొత్తం వందవరకు తలెత్తాయి. వాళ్లంతా అక్కడ చాలాకాలంనుంచి ఉన్నదానికి గుర్తుగా అన్నట్లు పారుతున్న మురికి కాలవలు, వాటిలో జలకాలాడుతున్న పందులు, ఇంటింటి ముందూ ఉన్న పెంటకుప్పల ముందు తారాడుతున్న కుక్కలు...

ఆ స్థల యజమానులగుండెల్లో రైళ్లు పరిగెట్టాయి. వాళ్లు వెంటనే - పోలీసులను ఆశ్రయించారు. డబ్బు విచ్చలవిడిగా ఖర్చుపెట్టారు. బుల్‌డోజర్లను తెచ్చి ఆ గుడిసెలన్నిటినీ నేలమట్టం చేస్తామంటూ హెచ్చరించి వెళ్లారు. గుడిసెల్లో జనం బెంబేలు పడ్డారు. కొందరు మంత్రుల ఇళ్లకు వెళ్లారు. ఇంకొందరు యం.యల్.ఏ.ల ఇళ్లకు వెళ్లారు. మరికొందరు ఆ స్థలాన్ని గుడిసెలవాళ్లకే ఇచ్చితీరాలని నిరాహారదీక్షలు ఆరంభించారు.

అందరి దగ్గరా తలో పదీ వసూలుచేసి, మురికివాడముందు టెంట్ వేశారు. ఆ టెంట్ మధ్యలో రెండు తలగడలమధ్యన కూర్చున్నాడు ముత్తయ్య!

—అంతే - అలా ఆరంభమయింది అతని రాజకీయ జీవితం. నిరాహారదీక్షల్నే నిత్యాహారంగా స్వీకరించాడు ఆ తర్వాత.

-మర్నాడు బుల్‌డోజర్లు రానేవచ్చాయి. వాటిని చూసి గుడిసెల్లోని జనం అంతా గుండెలు బాదుకొన్నారు. ఉన్న తట్టా బుట్టా సర్దుకొనేవారు కొందరైతే, మరికొందరు ఏంచేయాలా అని ఆలోచించారు.

ముందుకు నడిచే బుల్‌డోజర్లను ఆపాలంటే ఒకటేమార్గం - గుడిసెల్ని పడగొట్టటానికివచ్చిన బుల్‌డోజర్ ముందు పడుకొంటే అది గుండెలమీంచి వెళ్లదు కదా అన్నారు ఎవరో.

తెలియని ఆవేశం ఏదో ముత్తయ్యను ముందుకు నడిపింది. గుండెలమీద చొక్కావిప్పి, బుల్‌డోజర్‌కు అడ్డంగా నేలమీద వెల్లకిలా పడుకొన్నాడు ముత్తయ్య.

ముత్తయ్య వెనుకనే మరికొందరు...

బుల్‌డోజర్ ఆగిపోయింది. వచ్చినవాళ్ళు, పోలీసులు ఏవేవో మంతనాలు జరుపుకున్నారు. అయిదారు నిమిషాల తర్వాత ఆ స్థలం యజమానులు వెళ్లిపోయారు. తర్వాత ... పోలీసులూ వెళ్లిపోయారు.

వెంటనే...

"ముత్తయ్యా ... జిందాబాద్"

"ముత్తయ్యా ... జిందాబాద్..."

"గుడిసెవాసుల ఐక్యత ... వర్ధిల్లాలి!" అన్న నినాదాలు మిన్నుముట్టాయి.

—ఏ ఎన్నికాలేకుండా నాయకుడిగా అలా ఎన్నికయిపోయినాడు!

ఆ తర్వాత ... ఓసారి ఏదోకాలేజీ ఎలక్షన్స్ జరుగుతోంటే - అక్కడికి రోజు కూలీ పద్ధతిలో ప్రచారానికి చేరాడు ముత్తయ్య. మూడురోజులు గడిచేసరికి అతనికి అర్థమయిపోయింది - తను ప్రచారం చేస్తున్నవాడికి ఓటమి తప్పదని!!

—"వెయ్యి రూపాయలు పారెయ్యండి! మీరు గెలిచేలా చేస్తా!"నని వాగ్దానం చేశాడు ముత్తయ్య. వెయ్యి రూపాయలు చేతిలో పడగానే ప్రత్యర్థిని, అతనికి ప్రచారం చేస్తున్న ఓ అమ్మాయినీ మాయం చేయించాడు. ఎన్నికలయ్యేంతవరకు వాళ్లను తన మురికివాడలో బంధించివేశాడు. ఇక్కడ కాలేజీలో వాళ్లిద్దరిమధ్యా ఏదో సంబంధం ఉందని, ఈ అవకాశం చూసుకొని పారిపోయారని ప్రచారం చేయించాడు. ఆ అమ్మాయిపట్ల అయిష్టంతో అమ్మాయిలు అతనికి ఓటు వెయ్యలేదు. ఆ అబ్బాయిపట్ల ఈర్ష్యలాటి భావంతో అబ్బాయిలతనికి ఓటువెయ్యలేదు.




# సితార లో

# శీర్షికలు నాకెందుకని?





ఒక వారం
కొని చదివితే
మీకే తెలుస్తుంది!

—ముత్తయ్య ప్రణాళిక సఫలం అయింది. ముత్తయ్య ప్రచారంచేసిన అభ్యర్థే గెలిచాడు.

ఎన్నికల ఫలితాలు వచ్చినరోజున వాళ్లిద్దర్నీ వదిలేశాడు ముత్తయ్య' "వెళ్లి పొండి కాని బయట మాపేరెక్కడైనా పొక్కిందంటే జాగ్రత్త ... నీకాళ్లూ చేతులు ఈసారి సరిగ్గానే వున్నాయి! కానీ మాపేరు బయటకొస్తే నీకింక కాళ్లూ చేతులూ వుండవ్!" అని ఆ అబ్బాయిని హెచ్చరించాడు. "చూడమ్మా... జరిగిందేదో జరిగిపోయింది. నీ ఒంటిమీద మేం చెయ్యేసి ఎరగం! కానీ ... ఎక్కడైనా మాపేరు చెప్తే ... ఈసారి పెళ్లికాకుండానే నువ్వు పురుడు పోసుకోవాల్సి వస్తుంది జాగ్రత్త! అలాపుట్టే నీబిడ్డకు తండ్రి ఒక్కడు కాదు, ఈ మురికివాడలో వుండే ప్రతివాడూ తండ్రే అవుతాడని గుర్తుంచుకో!" అన్నాడు.

ఆ తర్వాత-

ఆ అమ్మాయి కాలేజీలో ముత్తయ్య పేరు చెప్పలేదు సరికదా, కాలేజీనే వదిలేసుకొని వేరే ఊరికి వెళ్లిపోయింది.

ఆ అబ్బాయి - మూడేళ్ల కాలేజీ చదువును తలెత్తకుండా కానిచ్చేశాడు?

-ముత్తయ్య మాత్రం హీరోలా ఎదగటం ఆరంభించాడు!!

వీధి గూండాలా జీవితాన్ని ఆరంభించిన ముత్తయ్య- దినదిన ప్రవర్ధమానమవుతూ వచ్చాడు. తొండముదిరి ఊసరవెల్లి అవుతుందో లేదోగానీ గూండా ముదిరి రాజకీయ నాయకుడైనాడు.

అతనికి తెలిసిన రాజకీయాలంతా... ఈ దేశంలో కొందరు మనుషులు కాంతానికి లొంగుతారు, ఇంకొందరు కనకానికి లొంగుతారు. ఈ రెంటికీ లొంగనివారు కత్తికి లొంగుతారు! అంతే- అడ్డొచ్చినవారికి ముందు కాంతా కనకాల ఆశ చూపించి లొంగనిపక్షంలో... కత్తితో లోబర్చుకొంటున్నాడు ముత్తయ్య.

కానీ ఇపుడతని జీవితంలో కొత్త అధ్యాయం చోటుచేసుకోబోతోంది. సరదాగా... సరదాకు కాకపోయినా బజారులో మాత్రం అలాగే చెప్పుకు తీరాలిగదా- సరదాగా నలుగురు మంత్రులొకచోట చేరి మంతనాలాడితే దాన్ని గురించి ఒక విలేకరి కూపీలాగి మరీ రికార్డు చేసి ఆ టేపును ముఖ్యమంత్రికి ఇచ్చాడంటే- అది ఏకంగా తన కొంపకే ముప్పుపెట్టినట్లు! అది ఏకంగా తన కుర్చీ కిందకే నీళ్ళు తెచ్చినట్లు! దాన్ని తాను సహించడు!!

ఈ ప్రమాదాన్ని వెంటనే నిరోధించకపోతే- క్రమంగా ఇది వెర్రితలలు వేస్తుంది. అంత దూరం రానివ్వకూడదు దీన్ని!

నిర్ణయించుకొన్నాడు ముత్తయ్య. క్షణం ఆలస్యం చెయ్యకుండా ఫోనందుకొన్నాడు.

★ ★ ★

నగరం నడిబొడ్డునే ఉన్నా జనసముద్రంలో నిర్జన ద్వీపంలాగే ఉండే ఆ హోటల్ దగ్గరకొచ్చి ఆగాడు ఇన్స్పెక్టర్ రత్నానంద్.

జీపు దిగుతోంటే అతనికి సింహాసనం దిగుతున్నట్లుగా అనిపించింది. అడుగు తీసి అడుగు వేస్తోంటే తన రాజ్యంలోకి నడుస్తున్న భావన కలిగింది. శిష్టరక్షణ ఎలావున్నా దుష్టశిక్షణకు మాత్రం వీలు కల్పించిన ఆ ఉద్యోగం అన్నా, ఆ ఉద్యోగ విధి నిర్వహణ అన్నా రత్నానంద్కు చెప్పలేనంత ఉత్సాహంగా ఉంటుంది.

రత్నానంద్ ముందుకు నడుస్తోంటే హోటల్ ముందున్న గ్లాస్డోర్ తెరిచి పట్టుకొన్నాడు ఒక కానిస్టేబుల్. అధికార దర్పంతో ముందుకు నడిచాడు. తిన్నగా రిసెప్షన్ దగ్గర ఆగి, "మీ మేనేజర్తో మాట్లాడాలి పిలిపించండి" అన్నాడు రత్నానంద్.

"మేనేజర్ ఆ గదిలో ఉన్నారు సార్...!" అని ఆగి ఆ రిసెప్షనిస్ట్ ఎదురుగా ఉన్న ఎవర్నో పిలిచి "వీరిని మేనేజర్గారి దగ్గరకు తీసుకెళ్ళు" అంది.

అప్పుడు చూశాడు రత్నానంద్ రిసెప్షనిస్ట్ కేసి! ఆమె నీలంరంగు చీరకట్టుకొని ఉంది. దానికి తులసికోట డిజైన్లబార్డర్. స్లీవ్లెస్ జాకెట్.

రత్నానంద్ ఆడదాన్ని ఎరగని మనిషి కాడు. పోలీస్స్టేషన్లోనే ఎన్నోసార్లు ఎందర్నో రుచిచూసిన మనిషే! వయసు, హోదా అలాటివేమీ అతనికా క్షణంలో గుర్తుకురావు. ఎవరైనా ఒక్కటేనన్న ధ్యాస అతనిది- అందరూ ఆడాళ్ళే!

అందుకే ఆ రిసెప్షనిస్ట్ను చూడగానే రత్నానంద్కు కన్నొకసారి చెదిరింది.

కానీ ఇపుడు డ్యూటీ మీద ఉన్నాడు తను! పైగా అలాటిలాటి డ్యూటీకాదు– ఏకంగా... అమ్మయ్యో!

ఈ రిసెప్షనిస్టు ఇక్కడ ఉండేదే!

ఈరోజుకాకపోతే రేపు దీని గురించి ఆలోచించచ్చు! దానికేం తొందర లేదు!

ఇప్పుడు చెయ్యాల్సిన పని వేరే ఉంది!!

రత్నానంద్ అడుగులో అడుగువేసుకొంటూ ముందుకు నడిచాడు. నడుస్తున్నంతసేపు అతని ఆలోచనలన్నీ ఆ రిసెప్షనిస్ట్ చుట్టూనే కేంద్రీకృతం కావటం విశేషం!

సౌండ్‌ప్రూఫ్ రూంలా ఉన్న ఆ గదిలోకి ప్రవేశించాడు రత్నానంద్. దాన్ని చూస్తోంటే చిన్నసైజు సినిమా సెట్టింగ్‌లా ఉంది. ఓమూల నిలువెత్తు అరలోకి బుద్ధవిగ్రహం, మరో వైపు అందంగా పెరిగిన రబ్బరు చెట్టు– ఆ గదికి చెప్పలేనంత అందాన్నిస్తూ కనిపించాయి.

''రండిసార్...'' అన్నాడు ఆ గదిలో ఉన్న బేడీ.

''చాలా తప్పనిసరై వచ్చాం మీ దగ్గరకు! సారీ ఫర్ ది ఇన్‌కన్వీనియన్స్!'' అంటూ ఎపాలజిటిక్‌గా చెప్పి, విషయంలోకి వచ్చేశాడు రత్నానంద్- ''మీ హొటల్ ఇపుడు పెద్ద పెద్దవాళ్ళ దృష్టిలోపడింది. దాంతో కష్టాలన్నీ మానెత్తినపడ్డాయి! మినిస్టర్స్ కొందరు ఇక్కడ ప్రైవేట్ మీటింగ్ పెట్టుకొంటే- వాళ్ళేం మాట్లాడుకొన్నారో అంతా టేపయి, సియంగారి దగ్గరకు చేరింది! ఎవరు టేప్ చేశారో, దానికి ఎవరు సాయపడ్డారో... అది తెలుసుకోవాలి నేను!''

బేడీకి మినిస్టర్స్ మీటింగ్ గురించి తెలీకకాదు.

కానీ తెలీనిదంతా ఆ మీటింగ్‌లోని మాటలన్నీ టేపయి సియంగారి దగ్గరికి ఎలా వెళ్లాయనేది!

''ఎలా జరిగిందిది?'' ఆశ్చర్యంగా అడిగాడు బేడీ.

''అదే నేనూ అడుగుతున్నాను! ఎలా జరిగింది?''

బేడీ ఇంకా ఆ ఆశ్చర్యంలోంచి తేరుకోలేదు– తల అడ్డంగా ఊపుతూ అన్నాడు-- ''అయివుండదుసార్- ఎక్కడో పొరబాటు జరిగి ఉంటుంది! మీకు తెలుసు- మా హొటల్‌లో రోజుకు కొన్ని వందలమంది గెస్ట్‌లు బసచేస్తుంటారు. వాళ్ళమధ్య కొన్ని వందల అగ్రిమెంట్‌లు సైన్ అవుతుంటాయి. మరెన్నో విషయాలు చర్చల్లో ఉంటాయి. ఏ ఒక్కటి ఇలా బట్టబయలయిందని బయటికొచ్చినా మా హొటల్ ప్రెస్టీజ్ అంతా గంగలో కలిసిపోతుంది. ఏ ఒక్కరికీ మామీద నమ్మకం ఉండదు... అందుకే ఇలా జరిగి ఉండదేమో అంటున్నా సార్!''

రత్నానంద్ నవ్వాడు– ''భలేవారే మీరు! జరిగింది, అని చెప్తే నమ్మనంటే ఎలా? జరిగింది... దాని గురించి ఆరా తీయండి అని నాకు పైనుంచి ఆర్డర్లొచ్చాయి. అందుకేగదా ఇలా వచ్చాను!''

''మీరొచ్చారు సరే సార్! కానీ... ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడంటారు! మరి మేం...''

''అందుకే గదండీ- పోలీసులం మేం ఉన్నాం. ఆ ఈశ్వరుడు పసిగట్టలేని విషయాల్ని సైతం ఈ డిపార్ట్‌మెంట్ పసిగడుతుంది. మీరు చూస్తూ ఉండండి... వాడినెలా పడతానో!...'' అంటూ ఆగి తర్వాత అన్నాడు రత్నానంద్– ''ఒక్కపని చెయ్యండి మీరు– ఆ రోజు ఆ ఫ్లోర్‌లో డ్యూటీలో ఉన్న వాళ్ళను పిలిపించండి! అలాగే- ఆ ఫ్లోర్‌లోని గదుల్లోకి ఎవరెవరు ఎప్పుడెప్పుడు వచ్చారో– ఆ డీటైల్స్ కూడా తెప్పించండి!''

బేడీ ముందుగా ఆ రిజిస్టర్ తెప్పించి రత్నానంద్‌కు ఇచ్చాడు. ఆ తర్వాత- ఆరోజు ఆ ఫ్లోర్ డ్యూటీలో ఉన్న వాళ్ళందర్నీ పిలిపించాడు. రిజిస్టర్ చూస్తోంటే- ఒక సంగతి రత్నానంద్‌కు స్పష్టంగా అర్థమయింది. మినిస్టర్స్ మీటయిన ఆ గదికి పక్క గదిలోకి మాత్రమే ఆరోజు ఒకతను వచ్చి వెళ్ళిపోయాడు. అతని పేరూ ఊరూ అన్నీ ఉన్నా అవన్నీ దొంగ అడ్రసులే అన్న సంగతి రత్నానంద్‌కు తెలుసు. అతనికి కావాల్సిందల్లా– ఆ పక్కగదిలో ఉన్న వ్యక్తి వార్త విలేకరే అయినా– అతనెవ్వరు అనేదే! అదీ తెలుసుకోవటం కష్టంగాదు–





ప్రతీ పత్రికా విలేకరికి కొందరు ఇన్‌స్పెక్టర్లతో 'దగ్గర సంబంధాలు' ఉంటాయి. వార్తల గురించి వివరంగా చెప్పేందుకు విలేకరులకు ఇన్‌స్పెక్టర్‌లతో అవసరాలుంటే తాము చేస్తున్న కేసులకు ప్రచారం లభించేందుకు, పైఅధికార్ల మెప్పు పొందేందుకు విలేకరులతో దగ్గర సంబంధాలు ఉంచుకొంటారు ఇన్‌స్పెక్టర్లు. ఇది ఉభయతారక మంత్రం. అయితే- ఇలాటి విలేకరులు కూడా తన తోటివాడి గురించి చెప్పమంటే... చెప్పరు!! జాత్యభిమానం అది!!

అందుకే- ఇంత ప్రయాస!

తన ముందు నిలబడ్డ అందర్నీ పరిశీలనగా చూశాడు రత్నానంద్. ప్రతివాళ్ళలోనూ అదో రకమైన ఆందోళన, భయం. కానీ... అంతమందిలోనూ వాడు... ఆ చివర్నించి రెండోవాడు- బిక్కచచ్చిపోతున్నట్లుండటం రత్నానంద్‌కు స్పష్టంగా కనిపించింది. దొంగలెందుకు తేలిగ్గా పోలీసులకు దొరికిపోతారో...

ఆ గిల్టీకాన్షస్ దొంగల్ని ఎలా పట్టిస్తుందో- తెలిసిన రత్నానంద్‌కు అసలు హీరో ఎవరో వెంటనే అర్థమయింది. వాసన చూసి దోషిని పట్టుకోగల పోలీసు కుక్క తత్వం అది!!

"మిగిలినవాళ్ళను తర్వాత ప్రశ్నిస్తాను. ముందుగా..." అని క్షణం ఆగి, ఏదో ఆలోచించిన తీరులో ఎవరో ఇద్దర్ని యధాలాపంగా ఎంచిన రీతిలో... "మీ ఇద్దరూ పోలీసుస్టేషన్‌కు రండి!" అన్నాడు రత్నానంద్. ఆ ఇద్దరిలో ఒకడు రాజమల్లు. వాచస్పతి దగ్గర డబ్బు తీసుకొని, ఆ గదిలో జరిగిదంతా టేప్ కావటానికి తోడ్పడ్డవాడు!!

ఇద్దరికిద్దరూ బిక్కచచ్చిపోయారు. క్షణం తర్వాత ఆ రెండోవాడు తేరుకొని, ఒక్కడుగు ముందుకువేసి గభాలున రత్నానంద్ కాళ్ళు పట్టుకొని- "నేనేం ఎరగను సార్... నాకేమీ తెలీదు సార్!" అంటూ ఏడ్వటం ఆరంభించాడు.

"నీకు తెలీదు సరే... కానీ ఎవడో ఒకడికి తెలిసి ఉండాలి కదా! నీకు తెలీదన్న సంగతే పోలీసుస్టేషన్‌లో స్టేట్‌మెంట్‌గా రాసియ్యి అంతే!" అంటూ కానిస్టేబుల్స్‌కేసి చూశాడు.

రాజమల్లు కూడా అప్పటికి అడుగు ముందుకు వేయటంతో- "నీకు తెలీదు! అవునా... అయినా సరే స్టేట్‌మెంట్ ఇవ్వాల్సిందే! అందరి దగ్గరా అలాగే తీసుకొంటాం!" అంటూ మరోమాటకు అవకాశం ఇవ్వకుండా కదిలాడు రత్నానంద్. బేడీకి చెప్పి సెలవు తీసుకొని జీపెక్కాడు.

"సారీ సర్... ఇలాటివి ఇంకెప్పుడూ జరగకుండా చూసుకొంటా!" అన్నాడు బేడీ అపాలజెటిక్‌గా!

రత్నానంద్ చిరునవ్వు నవ్వాడు- జీపు కదిలింది.

'వీడు దొరికాడు! ఆ రిపోర్టర్ పేరు తెలుసుకొని ముత్తయ్యకు చెప్తేచాలు!' అనుకొన్నాడు రత్నానంద్.

పోలీస్‌స్టేషన్ ముందు జీపు ఆగింది. ముందు ఇన్‌స్పెక్టర్ హోదాలో రత్నానంద్ దిగాడు. తర్వాత కానిస్టేబుల్స్, ఆ తర్వాత- ఆ ఇద్దరూ.

పైకి అమాయకంగా, నిశ్శబ్దంగా- కనిపించని పోలీసు దెబ్బలాగే- పోలీసుస్టేషన్ ఒదిగి కూర్చుంది. ఒక్కో మెట్టూ ఎక్కుతోంటే రాజమల్లు గుండెల్లో రైళ్ళు పరిగెట్టసాగాయి.

రత్నానంద్- ఆ ఇద్దర్నీ కూర్చోబెట్టి, ముందుగా ఆ రెండోవాణ్ని పిలిచాడు- "ఏంట్రా... ఏం జరిగింది?"

"నాకు తెలీద్సార్... ఆరోజు నేనా సూట్ దగ్గర డ్యూటీలో ఉన్నా, నేనీపని చెయ్యలేదు సార్!" నీళ్ళు నములుతూ చెప్పాడు వాడు.

"నిజమే?"

"నిజం సార్!"

"అలా రాసిచ్చి వెళ్ళు. కానీ తప్పని తెలిస్తే... జాగ్రత్త- మళ్ళీ ప్రాణాలతో ఇంటికి వెళ్ళవు!"

"నిజం సార్..." అంటూ తలఊపగానే రత్నానంద్ "ఖాదర్"- అంటూ రైటర్‌ను పిలిచి— "స్టేట్‌మెంట్‌తీసుకుని వీణ్ని వంపెయ్యి!" అన్నాడు.

తర్వాత రాజమల్లు— "నా క్కూడా ఏమీ తెలీద్సార్!" అన్నాడు గుటకలు మింగుతూ.

"ఎవరికీ తెలీకపోతే ఎలారా? మీ హోటల్లో జరిగిందది! ఎలా జరిగింది? ఎవడో ఒకడు చేస్తేనే జరిగింది- ఆ ఒక్కడు ఎవడు? నువ్వు కాదా?"

"కాను సార్... తల్లితోడు సార్...!" రాజమల్లు అన్నాడు.

"సర్లే..." అంటూ రత్నానంద్ "ఖాదర్" అని పిలిచాడు.

'బతికిపోయాను!' అని రాజమల్లు నిట్టూర్చుకొంటూ ఉంటే రత్నానంద్ అన్నాడు- "ఖాదర్- వీడూ కాదట! ఏం చేస్తాం- దూరం నుంచి వచ్చాడు గదా- స్టేట్‌మెంట్ తీసుకో- తర్వాత కొంచెం నీళ్ళు తాగించి వంపెయ్యి!"

ఖాదర్ తల ఊపాడు.

రమ్మన్నట్లు ఖాదర్ సైగ చేయటంతో అటు కదిలాడు- కానీ తనను ఇందాకటిలా కాకుండా వేరేగా లోపలికి ఎందుకు తీసుకెడుతున్నారో రాజమల్లుకు అర్థం కాలేదు.

...అర్థం అయ్యేసరికి రాజమల్లు ఒళ్ళంతా హూనం అయిపోయింది. దెబ్బపడని

చేటంటూ ఒంటి మీద లేకపోయింది. రాజమల్లుకు కళ్ళు తెరవటం కష్టంగా ఉంది. ఏ క్షణంలో ప్రాణాలు పోతాయోనన్నట్లుగా ఉంది. అయినా... మాటలు పేర్చుకొంటూ, గొంతు పెకలించుకొంటూ అన్నాడు-
''త...ప్పు...యిం...ది... సార్... తప్పు...యింది!''

''నువ్వు తప్పు చేస్తే నా కొడకా- మాక్కదరా కష్టాలు...'' అంటూ ఖాదర్ మరో రెండు తన్ను లు తన్నాడు. దాదాపు రెండంగుళాల వరకు ఉన్న ఆ బూటు మడమ ఒక్కసారిగా రాజమల్లు పొత్తికడుపు లోపలికంటా వెళ్ళిపోయినట్లయింది.

''అమ్మా—'' అంటూ గింగిర్లు తిరిగి రాజమల్లు కళ్లుతేలేశాడు.

ఖాదర్ ఒక్కక్షణం వాడికేసి చూశాడు. సాధారణంగా ఇలాటివి చూడటం అతనికి మామూలే— దెబ్బలు భరించలేక ఇలా దొంగ వేషాలు వేసి కళ్లుతిరిగినట్లు, స్పృహకోల్పోయినట్లూ వేషాలు వేసేవాళ్లను ఎందర్నో చూశాడు ఖాదర్. అలాటి వాళ్లంతా ఇలా పోలీసులు వెళ్లగానే మళ్లీ కళ్లు తెరిచిచూస్తుంటారు. ఇదీ అలాటి కేసే... అనుకొని కూడా ఖాదర్ ముందుకొక్క అడుగేసి చూశాడు.

కాని రాజమల్లు కళ్లు తేలవేయటమేకాదు, ప్రాణాల్నేవదిలేశాడు!!

ఖాదర్ క్షణకాలం భయపడ్డాడు! 'సార్ ఏమంటాడో...' అనుకొన్నాడు. కానీ. తర్వాత ధైర్యం తెచ్చుకొన్నాడు. సార్ ఎప్పుడూచేసే తప్పుడు పనులు ఎన్నిలేవు. తనసొంత ఇంటి బెడ్‌రూంలోకన్నా సార్‌కు ఇక్కడే ఎక్కువసార్లు శోభనం జరిగివుంటుంది. 'ఏందిసార్?' అని ఎవరన్నా అడిగారా? ఇదీ అంతే-- లెక్కలో చిన్నపొరబాటు!

ఖాదర్ ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్చుకొని ఇన్‌స్పెక్టర్ దగ్గరకు వెళ్లి నిలబడ్డాడు.

''ఏమంటాడు వాడు?'' అనడిగాడు.

ఖాదర్ క్షణం ఆగిఅన్నాడు: ''వాడు చచ్చిండుసార్!''

రత్నానంద్ 'నిర్ఘాంతపోయాడు. ఖాదర్ అన్నది అర్థంచేసుకొనేసరికి రత్నానంద్‌కు ముచ్చెమటలు పోశాయి. టార్చర్ - టార్చర్ లీడింగ్ టు డెత్ - పోలీస్ స్టేషన్‌లో చిత్రహింస, హత్య... తను ఎన్నో చేశాడు పోలీస్‌స్టేషన్‌లో! ఏంచేసినా ఈ నాలుగు గోడలతల్లి తనను ఒళ్లోపెట్టుకొని కాపాడుకొంటూ వచ్చింది! కానీ ఇది - హత్య! తను చెయ్యనిది. అయినా... అందులోనూ కేసు - బుక్‌చెయ్యకూడని కేసు. రిపోర్టర్ పేరు తెలుసుకోవడానికి చేసిన పని ఇది. ఈ సంగతి వాళ్లకు తెలిస్తే - అసలే వార్తలకోసం ఆవురావురుమనే ఆ జనం - తమ ఆచూకీ తెలుసుకొనేందుకే ఈ పని జరిగిందన్న సంగతి బయటకువస్తే అమాంతం పోలీసుల్ని మింగేస్తారు.

మిగిలినవాళ్లమాట ఎలా ఉన్నా - తన పని మాత్రం ఖతం... అది ఖాయం!!

రత్నానంద్ లేచాడు. గతంలో ఎప్పుడూ అతన్ని అలాచూడని ఖాదర్ దెబ్బకు వణికిపోయాడు.

''నా కొడకా... ఎంతపనిచేశావ్‌రా! నీయ...'' అంటూ తిడుతూలాగి ఒక్కటి కొట్టాడు.

ఆ దెబ్బకు ఖాదర్ కళ్లు గిర్రునతిరిగాయి. గింగిర్లు తిరుగుతూ అంతదూరంలో పడ్డాడు ఖాదర్. ఎన్నోసార్లు తను ఎందర్నో ఇదే పోలీస్ స్టేషన్‌లో కొట్టాడు - కానీ ఏ దెబ్బా ఇంత గట్టిగా తగిలివుండకపోవచ్చు! ఏ దెబ్బా ఇంత బాధాకరంగా ఉండకపోవచ్చు!!

—పోలీస్ స్టేషన్‌లోఉన్న అందరు పోలీసులకూ జరిగిందేమిటో అర్థమయిపోయింది. ఇదే మరోచోట అయితే-- క్షణంలో ఆ వార్త పెదవిదాటి పాక్కిపోయేదే కానీ... ఇనప్పెట్టె లాటి ఆ పోలీస్‌స్టేషన్‌లో ఆ వార్త అలాగే ఉండిపోయింది. ఏ పోలీసూ నోరు విప్పలేదు.

రత్నానంద్ వెళ్లి రాజమల్లు చెయ్యిపట్టుకు చూశాడు. 'చచ్చిపోయాడు-- ఇక చేసేదేమీలేదు' అనుకొన్నాడు మనసులో.

—వెళ్లి కుర్చీలో కూర్చున్నారు.

ఆ కుర్చీలో కూర్చుంటే అతనికెంతో ప్రశాంతంగా ఉంటుంది. ఎంతటి ఇబ్బందినైనా ఎదుర్కోగలనన్న ధీమా కలుగుతుంటుంది. ఎన్నో కేసుల్ని తాను ఆ కుర్చీలో కూర్చునే పరిష్కరించిన మాట వాస్తవం! అక్కడ కూర్చోగానే - తన కెన్నో కొత్త ఆలోచనలు ఉన్నట్లుండి



తడుతుంటాయి. ముందుకుపోవటానికి ఆ కుర్చీయేదారి చూపిస్తుంటుంది!

—ఈరోజూ అంతే!

ఆ విక్రమార్కుడి మార్కు సింహాసనంలో వెళ్లికూర్చున్నాక, రత్నానంద్ కొంచెం కుదుట బడ్డాడు. ఆలోచనలు క్రమంగా రూపుదిద్దుకోనారంభించాయి.

అయిదు నిమిషాల తర్వాత—

"ఖాదర్!" అని పిలిచాడు.

"జీ...!" లేచి నిలబడ్డాడు ఖాదర్.

'ఇలారా!' అన్నట్లు సైగచేసి పిలిచాడు. ఖాదర్ దగ్గరకు రాగానే నెమ్మదిగా చెప్పాడు-- ఏంచేయాలో!

ఖాదర్ తలఊపాడు. లోపల ఇంకో నలుగు రైదుగురు కానిస్టేబుల్స్‌కు ఆ సంగతి చెప్పాడు.

మరో అయిదు నిమిషాలకు పోలీస్‌స్టేషన్ లోంచి జీపు కదిలింది.

—హొటల్‌ముందు జీపు ఆగగానే రత్నానంద్ దిగి లోపలికి నడుస్తూ, ఆ రిసెప్షనిస్ట్‌కేసి చూశాడు. ఆమె అందం అతన్నొకసారి కలవరపెట్టింది. అతికష్టంమీద చూపుమరల్చుకొని బేడీ రూంలోకి వెళ్లాడు.

తలెత్తిచూసిన బేడీకి విష్‌చేస్తూ అన్నాడు రత్నానంద్— "మీవాడు ఒప్పుకొన్నాడు, వాడే చేశానని! మావాళ్లు వాణ్ని ఆ గదిలోకి తీసుకెళ్తున్నారు, మైక్రోఫోన్ ఎక్కడ ఎలాపెట్టాడో చూడ్డానికి...!" అంటూ తలుపు కొంచెం పక్కకు జరిపాడు. ఇద్దరు పోలీసులు రాజమల్లును నడిపిస్తున్నట్లు తీసుకెళ్లటం కనిపించింది బేడీకి.

తలుపు వేసేస్తూ అన్నాడు రత్నానంద్— "సో, దట్సిట్!! వాడిని మేం పోలీస్‌స్టేషన్‌కు తీసుకెళ్లి ఇంటరాగేట్ చేశాంగదా, ఆ విషయంలో గొడవలేమైనా రావచ్చు. ఎందుకైనా మంచిది, ఆ రూంలో తెఫ్ట్ జరిగినట్లు ఒక రిపోర్ట్ ఇవ్వండి నాకు!"

బేడీ నివ్వెరపోయాడు - దొంగతనం జరిగినట్లా... లేదుగదా?

బేడీ ముఖంలో ఆశ్చర్యాన్ని పసిగట్టి అన్నాడు రత్నానంద్— "ఇదంతా ఓ ఫార్మాలిటీ మాత్రమే! ఆ గదిలో ఉండే వ్యక్తి మీకు ఓరల్ కంప్లయింట్ ఇచ్చినట్లు, దానిమీద బేస్‌అయి మీరీ ఫిర్యాదుచేస్తున్నట్లు వ్రాయండి. చాలు"

బేడీ క్షణం ఆలోచించాడు - ఇది కొరివితో తలగోక్కుంటున్న వ్యవహారం - ఎన్ని చట్టాలు, న్యాయాలు, న్యాయస్థానాలు ఉన్నా ఈ దేశంలో పోలీసులు వీటన్నిటికీ అతీతులు. వాళ్లు చేయదల్చుకొన్నదేదో చేసేస్తారు. ఆతర్వాత... 'తాంబూలాలు ఇచ్చేశాం, తన్నుకు చావండన్న' రీతిలో వ్యవహరిస్తారు. ఈరోజు తానుగనుక ఆ ఫిర్యాదు ఇవ్వకపోతే, రేపు ఏదో వంకనవచ్చి రెయిడ్ చేస్తారు. అనవసరమైన రభసఅవుతుంది. ఆ తర్వాత తను ఎన్ని కోర్టుల వెంట తిరిగినా...

బేడీ డ్రాలోంచి కాగితంతీసి, ఇన్‌స్పెక్టర్ చెప్పినట్లుగా రాసి సంతకంపెట్టి ఇచ్చాడు.

"మీరు చెప్పారని చేస్తున్నాగానీ... సమ్‌హౌ - ఇది తప్పు. రేపు ఈ సంగతి మా వర్కర్ల యూనియన్‌కు తెలిస్తే నన్ను చంపేస్తారు. మీకు తెలీందిగాదు!" అంటూ నీళ్లు నమిలాడు.

ఆ కాగితం అంతా చదివి, దాన్ని మడతపెట్టుకొని పైజేబులో పెట్టుకొన్నాడు రత్నానంద్.

"మీకేమీ భయంలేదు..." అని రత్నానంద్ హామీ ఇస్తున్నప్పుడు వెనక గ్లాస్‌డోర్ టాప్ అయిన చప్పుడయింది.

బేడీ వెళ్లి తలుపుతీశాడు - ఎదురుగా ఒక పోలీస్‌కానిస్టేబుల్. అతను కంగారుగా ముందుకొచ్చి అన్నాడు— "సార్...వాడు... ఆ గది కిటికీలోంచి కిందకు దూకేశాడు సార్!"

"దూకేశాడా!" అంటూ ఆశ్చర్యపోతూ నిలబడ్డాడు రత్నానంద్.

బేడీకి క్షణంలో అర్థం అయింది - రాజమల్లును నీటుగా పోలీస్‌స్టేషన్‌లో చంపేసి, ఇక్కడికితెచ్చి, తనచేత ఒక అబద్ధపు కంప్లయింట్ రాయించుకొని, రాజమల్లును గదిలోంచి కిందకు విసిరేశారు...

ఈ పోలీసులు... వీళ్లు గుండెలు తీసిన బంటులు!! అతనికి క్షణంలో అగాధాల ఊబిలో కూరుకుపోతున్నట్లుగా అనిపించింది. ఎలా... ఎలా ఈ ఊబిలోంచి బయటపడటం? ఎవరు రక్షిస్తారు తనను??




–హొటల్ బయటసంచలనం ఆరంభమయింది.

క్షణక్షణానికీ గోల అధికం కాసాగింది.

–రత్నానంద్ బయటకొచ్చి అక్కడున్న ప్రజల్ని 'క్లియర్' చేయించసాగాడు.

★ ★ ★

"ఇది చాలా చిత్రంగా ఉందిసార్! పోలీసులు ఆ గదిలో ఉండగానే రాజమల్లు అలా కిటికీలోంచి దూకాడనటం... ఎందుకో నమ్మశక్యంకాని విషయంలా ఉంది!" వాచస్పతి నెమ్మదిగా అన్నాడు.

ఎడిటర్ వాచస్పతి చెప్పింది వింటున్నాడు.

"మరెలా జరిగి ఉంటుందని మీ అనుమానం?"

"దిసీజ్ పోలీస్ మర్డర్ - వాళ్లు వాణ్ని పోలీస్‌స్టేషన్‌లో చంపేసి ఇక్కడ కిటికీలోంచి ఆ శవాన్ని పారేసి, ఆత్మహత్యగా చిత్రీకరిస్తున్నారు– అంతే!"

'అయివుండొచ్చు' నన్నట్లు తల ఊపాడు ఎడిటర్.

"ఇందులో పొలిటికల్ ఇంప్లికేషన్స్ కూడా ఉన్నాయని నా అభిప్రాయం" ఖచ్చితంగా అతనిమీదే ఇలాటి నేరారోపణ జరగటం, వెంటనే అతను చనిపోవటం... అంతా చిత్రంగా... అనుమానాలకు తావిస్తూ ఉంది!" అని క్షణం ఆగి అన్నాడు వాచస్పతి– "అసలిది పొలిటికల్ మర్డర్ అని రాసిపారేస్తే... ఎవరెవరు ఉలికిపడతారో చూద్దాం! భుజాలు తడుముకొన్నవారి చరిత్ర చూస్తే మనకు నిజానిజాలు తేలిపోవచ్చు!"

"మీరు ఈ విషయంలో జోరుగా వెళ్లిపోతున్నారని నా అభిప్రాయం! ఈ దేశంలో ప్రజాస్వామ్యం అనేదో పెద్ద ఫార్సు. ఇక్కడంతా బలవంతులదే రాజ్యం! పత్రికా స్వాతంత్ర్యం అనేది ఎంత నేతిబీరకాయలో నెయ్యో మనకు తెలీందిగాదు! సిద్ధాంతాలమీద పోరాడే మనల్ని తమ శత్రువులుగా పరిగణిస్తారు వాళ్లు! గొడవంతా అక్కడే వస్తోంది. నీతీజాతీలేని మనుషులతో వ్యవహరించేటపుడు కొంచెం జాగ్రత్తగా ఉండటం మంచిది!" అనుభవసారాన్ని జీవితం నేర్పిన పాఠాల్ని జ్ఞప్తికి తెచ్చుకొంటూ, వాచస్పతిని హెచ్చరిస్తున్నట్లుగా అన్నాడు.

"నిజమేననుకోండి! కానీ... బాధ్యత స్వీకరించాక దాన్నుంచి పారిపోవటం మంచిదికాదని నాఉద్దేశం. ఇలాటివారి గురించి భయపడే మనస్తత్వంఉండేవాళ్లు అసలు ఈ వృత్తిలోకే రాకూడదు. వచ్చాక వెరవనేకూడదు!" దృఢచిత్తంతో అన్నాడు వాచస్పతి.

వాచస్పతి అన్నది విని నవ్వి ఊరుకొన్నాడు ఎడిటర్.

–పత్రికారంగంలో ఎందర్ని చూశాడతను - పని అంటే బద్ధకించేవాళ్లనూ చూశాడు, పని అంటే ప్రాణం ఇచ్చేవాళ్లనూ చూశాడు.

...చదువుకొనే రోజుల్లో చెప్పేవాడు తన గురువు సరదాగా ఓ కథ - పత్రికా విలేకరి కావాలన్న తాపత్రయంతో ఒక పత్రికాఫీసులోకి వచ్చాడట ఒక కుర్రాడు. ఎంతో ఆసక్తివున్న కుర్రాడిలా ఉన్నాడని భావించి పరీక్షలాగ ఆరోజు కార్యక్రమాల్లో ఒకటి అతన్ని ఎసైన్‌చేశాట్ట. "వెళ్లి ఇదిగో... ఈ పెద్దింటివారింట్లో పెళ్లిని కవర్‌చేసుకొనిరా!" అని చెప్పాట్ట ఆ ఎడిటర్. 'పెళ్లి గురించి రాసేదేముంటుంది?' అనుకొంటూ ఆ కుర్రాడు వెళ్లి హాయిగా నిద్రపోయాట్ట! అదేపనిని ఎందుకైనా మంచిదని మరో కుర్రాడికీ అప్పజెప్పాట్ట! సాయంత్రం అయ్యేసరికి ఇద్దరూ తిరిగొచ్చారు. 'ఏంజరిగింద'ని అడిగితే ఇంటికెళ్లి నిద్రపోయిన కుర్రాడు తడుముకోకుండా జేబులోంచి ఓ రిపోర్టుతీసి అందించాడట– "ఫలానావారింట్లో పెళ్లి వారి హోదాకు తగ్గట్టుగా జరిగింది. నగరంలోని ప్రముఖులంతా హాజరయ్యారు. అందరి ఆశీర్వాదాలూ పొందిన వధూవరులు ఈ వారాంతంలో హనీమూన్‌కు వెడతారని తెలుస్తోంది" అనిఉంది ఆ రిపోర్టులో. అది చదివి పక్కనపెట్టి రెండో కుర్రాడిని అడిగారట ఆ ఎడిటర్- 'ఏదీ నీ రిపోర్ట్!' అని. ఆ కుర్రాడునవ్వి అన్నాడట– "పెళ్లికొడుకు వస్తూ వస్తూ గుర్రంమీంచి పడ్డాడుట! పెళ్లి అందుకే వాయిదాపడింది!" అని ఆ కుర్రాడు జవాబివ్వటంతో నిర్ఘాంతపోయాట్ట ఎడిటర్.

వార్త అంటే బాధ్యత తెలీనివాడు మొదటి కుర్రాడు.

అసలు వార్త అంటే ఏమిటో తెలీనివాడు రెండో కుర్రాడు.

—వాచస్పతి అలాటివాడుకాదు. అతనికి వార్త ప్రాణం. వార్తే అతనికి జవం, జీవం. ఇలాటి కుర్రాళ్లు వార్తలసేకరణకు ప్రాణాల్ని అయినా ఇస్తారు. అందుకే తన హెచ్చరికల్ని సైతం వాచస్పతి పక్కనపెడుతున్నాడు.

ఏంజరుగుతుందో చూడాలని అనుకొన్నాడు అతను!!

—మర్నాడు ఉదయానికి ఆ వార్త అక్షరరూపంలో బయటకొచ్చింది. వాచస్పతి, తను అనుకొన్నదాంట్లో, అనుకొంటున్న దాంట్లో అక్షరమ్ముక్క మార్చకుండా అలాగే రాశాడు.

రాజనుల్లు 'హత్య' రత్నానంద్ ఆధ్వర్యంలో జరిగిన పోలీస్ మర్డర్ అనీ, అంతక్రితం జరిగిన ప్రత్యర్థుల సమావేశంలో పాల్గొన్న ఒక మంత్రిగారి నిర్వాకమే ఇదీ అని రాశాడు.

—ముత్తయ్యకు ముచ్చెమటలు పోశాయి.

ఎంతరహస్యంగా చేద్దామన్నా ఈ విలేకరి ఎవరో గుండెలు తీసిన బంటులా ఉన్నాడు--అన్నీ బయటపెడుతున్నాడు.

ఇలాటివాళ్లకు ఇక మిగిలింది ఒకటేదారి.

అదేదో స్పష్టంగా 'వాడికి' చూపించాలని నిర్ణయించుకొన్నాడు ముత్తయ్య.

—అలా అనుకొన్నమరుక్షణంలో ముత్తయ్య ఫోనెత్తాడు. అవతలి వ్యక్తికి చెప్పాల్సింది చెప్పాడు.




అలసటతో మంచంమీద వాలిన వాచస్పతి నిద్రలేచేసరికి ఎన్నో పరిణామాలు జరిగిపోయాయి.

అంత చకచకా రాజకీయంగా మార్పులు చేర్పులు జరుగుతాయని ఎవరూ వూహించుకోలేదు– ముఖ్యంగా వాచస్పతి.

అతను నిద్రలేవగానే శారద దగ్గరకొచ్చి అంది– "మీ కోగుడ్‌న్యూస్ చెప్పనా?"

"చెప్పు... ఏమిటది?" అన్నాడు వాచస్పతి చాలా మామూలుగా.

"మినిస్ట్రీలోంచి పధ్నాల్గుమంది రాజీనామా చేశారు. గోవిందరావుగారి రాజీనామా కోరుతూ రేపటినుంచి వాళ్ళు ఉద్యమం లేవదీస్తారట!"

వాచస్పతి నిద్రమత్తంతా ఆ రెండు వాక్యాలకే వదిలిపోయింది.

"ఆ ఉద్యమానికి మైథిలీరావ్– అదే గోవిందరావుగారి భార్య నాయకత్వం వహిస్తారట! బాగుందిగదా... భర్తను పదవిలోంచి దింపాలని భార్య ప్రయత్నించడం" శారద వ్యాఖ్యానించింది.

వాచస్పతి ఉలిక్కిపడ్డాడు. రాజకీయంగా ఇది చాలా విశేషమైన సంగతి. ప్రపంచంలో ఎక్కడా ఇలాటిది జరిగి వుండదేమో.

ఎన్ని మలుపులు తిరుగుతున్నాయి ఈ రాజకీయాలు. ఆశ... అధికారంపట్ల కాంక్ష ఎన్ని పనులైనా చేయమంటుంది కాబోలు!!

శారద చెప్పేదంతా నిజమే అయితే– నిజం కాకుండా ఎందుకుంటుంది? ఊహాగానాలు చేసేందుకు శారద పత్రికా విలేకరి కాదుగదా! భార్య చెప్తున్నది నిజం గనుక, ఇలాటి సమయంలోనే... ఆ భార్యభర్తలిద్దరితోను ఓ ఇంటర్వ్యూ అడిగితీసుకొని వేస్తే...

—వాచస్పతి బుర్ర చాకులా పనిచేయసాగింది. వెంటనే లేచి ఆఫీసుకు బయలుదేరాడు.

ఆఫీసు మెట్లు ఎక్కుతుంటేనే అందరూ అతనికి అభినందనలు చెప్పటం ఆరంభించారు. ఒకరిద్దరైతే, "నిన్నుచూస్తే మాకు జలసీగా వుందోయ్" అని అనేశారు. వాచస్పతి నవ్వాడు. ఇలాటి పొగడ్తలూ మామూలే; మనిషి వెనక్కు తిరిగాక అతని గురించి రకరకాలుగా వ్యాఖ్యానించుకోవడమూ మామూలే. ఇక్కడ తన పని తను చేసుకోవటమే మంచిది. పొగడ్తలకు పొంగిపోతే రేపు ఇదే జనం తెగనాడితే, తల భూమిలోకి దించు కోవాల్సివస్తుంది.

న్యూస్ ఎడిటర్ రామ్మూర్తిగారైతే వాచస్ప




తిని కావలించుకొన్నంత పనిచేశాడు. "ఒక్కటే రిపోర్టు, పధ్నాలుగుమంది మంత్రులు పోవటం! గ్రేట్ వాచస్పతీ... అయాం ప్రౌడ్‌ఆఫ్ యూ" అన్నాడు. తలపండిన మహానుభావు డాయన. రాగద్వేషాలకు అతీతమైన మనిషి. ఆయన అలా అనటం వాచస్పతికి గర్వంగా అనిపించింది.

నెమ్మదిగా అన్నాడు, "ఆ ఇద్దర్నీ ఇంట ర్వ్యూ అడుగుదామని వుందిసార్!"

"గుడ్ అయిడియా... ప్రొసీడ్! కానీ దొరుకు తారా- అనేదే ప్రశ్న!" అన్నాడు రామ్మూర్తి.

వాచస్పతి ప్రొసీడ్ అయ్యాడు. గోవిందరావు వెంటనే రమ్మన్నాడు మైథిలి మాత్రం రాత్రి తొమ్మిది తర్వాత రమ్మంది.

వాచస్పతి బయలుదేరాడు. హర్ష భవనంలో రోజూకన్నా సందడి అధికంగావుంది. గోవింద రావు అనుయాయులంతా అక్కడ పడిగాపు లు కాస్తున్నారు. మంత్రివర్గాన్ని విస్తరిస్తేతప్ప గోవిందరావు మంత్రివర్గం మనుగడ సాగించ లేదని అక్కడివారి నమ్మకం. ముఖ్యంగా తమ ను మంత్రివర్గంలో తీసుకొంటేతప్ప మంత్రాంగాన్ని సరిగ్గా నడపగల ధీరులెవ్వరూ లేరని ఎవరికి వారు అనుకుంటున్నారు. చక్రం తిప్పాలంటే తామే సరైన వ్యక్తులమని, చక్రంతిప్పే అవకాశం ఎలాగూ లేదుగనుక కనీసం 'చక్రధారి'కి సలహాలు ఇచ్చే వీలైనా కల్పించాలని వారి కోరిక. ఎటొచ్చీ గోవిందరావు అది వింటాడో లేదో, విన్నా పాటిస్తాడో లేదో కూడా వారికి తెలీదు.

తమ ప్రయత్నలోపం వుండకూడదన్నదే వారి తాపత్రయం అంతా!

వాచస్పతి స్కూటర్ పార్క్‌చేసి లోపలకు వెడుతుంటే అందరూ అతన్నే చూస్తున్నారు. ఆ సంగతి గ్రహించాడు వాచస్పతి. ఆ చూపు లన్నీ తనకు కొత్త బాధ్యతలను అందిస్తున్న ట్లుగా ఫీలయ్యాడు.

గోవిందరావు వాచస్పతిని వెంటనే లోపలికి పిలిపించాడు. అంతవరకు తనతో మాట్లాడు తున్నవారినందర్నీ గోవిందరావు బయటకు పంపించాడు. వాచస్పతి లోపలికి రాగానే లేచి సాదరంగా ఆహ్వానించాడు.

వాచస్పతి కూర్చుంటూ అన్నాడు ఎపాలజి టిక్‌గా- "సారీసర్... ఇంత జరుగుతుందని అనుకోలేదు!"

గోవిందరావు నవ్వాడు- "జరగటం మంచి దే! ఎవరు శత్రువుల్లో, ఎవరు అసలైన మి త్రులో తెల్సుకోగల వీలు ఏర్పడిందిగదా! నిజం చెప్పాలంటే మీకెంతో ఋణపడ్డాను! మంత్రివర్గంలో పనికిరానివారందర్నీ ఏరిపారె య్యగలిగాను! ఎంత కుట్ర వన్నారంటే వీళ్ళు- మీరు టేప్ పంపించారు గాబట్టి సరిపోయింది కానీ, లేకపోతే నేననలు నమ్మే వాడినిగాను! వీరు నాకు నావక్కలో నాగులు. ఏ క్షణంలోనైనా ఏమరుపాటులోవుంటే కాటువే సేవా రేగదాననిపిస్తోంది నాకు! పెద్ద ప్రమా దంనుంచి తప్పించారు నన్ను!!"

వాచస్పతికి ఆ పరిస్థితి ఇబ్బందిగా అని పించింది. రాష్ట్రానికి ముఖ్యమంత్రి ఇలా తన ను పొగడ్తలతో ముంచెత్తడం చిత్రంగా తోచింది. మౌనంగా వుండిపోయాడు.

-గోవిందరావుకు చాలాకాలానికి ఒక నిజ మైన శ్రేయోభిలాషి తన ఎదురుగా కూర్చున్న ట్లు అనిపించింది. ఆత్మీయునితో కష్టాలు చె ప్పుకుంటున్న రీతిలో మొదలుపెట్టాడు- "ఎ ప్పుడో చరిత్రలో చదువుకొన్నాను, ఇపుడు కళ్ల ఎదుట స్పష్టంగా చూస్తున్నాను. గోతులు తవ్వే మనుషులు వీళ్లు, నమ్మినవారిగొంతులు కోయ గల కసాయిలు, కృతఘ్నులు వీళ్లు!" అంటూ చరిత్రలో ఎవరెవరు ఎవర్ని ఎలా మోసంచే స్తూ వచ్చారో- అన్నీ చెప్పటం మొదలుపెట్టా డు.

వాచస్పతికి ఇబ్బందిగా ఉంది- ఇంట ర్వ్యూ ఇక జరగనిమాట వాస్తవం. ఇలాటి మూడ్‌లో, ఆత్మపరిశీలనలో నిమగ్నమయిన ఈ వ్యక్తి తను ఏం అడిగినా సరిగా జవాబు చెప్పలేకపోవచ్చు. ఆయన మానసిక స్థితిలాగే జవాబులూ అడ్డదిడ్డంగానే ఉండొచ్చు. వాటిని ఆధారంచేసుకొని ఇంటర్వ్యూ పేరుతో బజారు లోకి వెళ్లటం... భావ్యంకాదనుకొన్నాడు వాచ స్పతి.

అందుకే- ఊరుకుండిపోయాడు.

గోవిందరావు తన ధ్యాసలో తాను నిమగ్నమ యిపోయాడు. ఏదో ట్రాన్స్‌లో ఉండి మాట్లాడు తున్న తీరులో ఆయన గతాన్ని గతంలో తాను ఎవరెవరికి ఏమి సాయం చేస్తూ వచ్చాడో,

దానికి ప్రతిగా ఎవరేం చేశారో... అన్నీ ఒకటొక టిగా, కథలుకథలుగా చెప్పసాగాడు.

వాచస్పతి అన్నీ మౌనంగా వింటూ కూర్చు న్నాడు.

—నిజానికి ఇపుడు గోవిందరావు చెప్తున్న ఏ విషయాన్ని అచ్చుపోసినా కొంపలు అంటు కొంటాయి. దేనికది మంచి సెన్సేషన్ అయిటం అవుతుంది. కానీ, ఆత్మీయంగా, ఆఫ్ ది రికార్డ్‌గా– ఇంత చేరువగా భావించి మనసులోది చెప్పుకొంటున్నదానికి అక్షర రూపం కల్పిస్తే, అది అక్షరాలకూ అన్యాయమే అవుతుంది అవతలివ్యక్తికీ అన్యాయమే అవు తుంది, అనిపించింది వాచస్పతికి.

సమయం– మైథిలీరావ్‌తో ఇంటర్వ్యూకు వేళయినట్లు చెప్తోంది.

వాచస్పతి గోవిందరావు దగ్గర సెలవుతీసుకొ నేందుకు లేచాడు. గోవిందరావు తన ఆత్మావ లోకనాన్ని ఆపాడు. లేచి వాచస్పతికి వీడ్కోలు చెప్పాడు.

"ఒకరోజున మిమ్మల్ని నేను ఇదే ప్రదేశంలో బెదిరించాను, అదిలించాను, భయపెట్టాను! ఈరోజున మనస్పూర్తిగా చెప్తున్నాను– ఆనాటి నా ప్రవర్తనకు ఈనాడు క్షమాపణ చెప్పుకొంటు న్నాను. సిగ్గుతో తల వంచుకొంటున్నాను. ఈ దేశంలో పత్రికావిలేకరులంటే నాకు ఇదివరకు మంచి అభిప్రాయం ఉండేదిగాదు. నాకు అది చేసిపెట్టండి, ఇది చేసిపెట్టండి అని అడిగిన వారినే చాలామందిని చూశాను. కానీ... మీలాటి వారిని నేనెవ్వర్నీ గతంలో చూడలేదు. మీలో స్వార్థంలేదు సరికదా, మీకు సాయం చేస్తానని నేనే అన్నా కాదన్నారు. ప్రలోభపెట్టినా తిరస్క రించారు. మీరంటే నాకు ఆనాడే ఎనలేని గౌరవం కలిగింది. అది చెప్పుకోగలవీలు ఇప్పుడే కలుగుతోంది!"

వాచస్పతికి మనసంతా అదోలా అయిపో యింది. ఎందుకో రెండుచేతులు జోడించి నమస్కారం చేశాడు.

ఆ తర్వాత అన్నాడు– "మిమ్మల్ని ఇంట ర్వ్యూ చేద్దామని వచ్చాను. కానీ అది కుదరలే దు. మరోసారి ఎప్పుడైనా నాకు ఆ అవకాశం కలిగించండి!"

"మీరు చెప్పనక్కర్లేదు, ఎవర్నీ అడగనక్కర్లే దు. ఎప్పుడైనా సరే మీరు తిన్నగా నా దగ్గరకు రావచ్చు. ఏ అభ్యంతరమూ ఉండదు!" గో విందరావు హామీ ఇచ్చాడు.

"ఇపుడు మీ మిసెస్‌తో నాకు ఇంటర్వ్యూ" అన్నాడు వాచస్పతి.

గోవిందరావు చిన్నగా నవ్వాడు– "నేడు శ్రీమతికి మా తోటి లడాయి! ఓ రెండు గంటల కిందట ఇద్దరమూ గొడవపడ్డాం. ఇదేవి షయం! కానీ... ఆమె అభిప్రాయాలు ఆమెవి. వాటిని గౌరవించితీరాలి. ఆ క్షణంలో నాకు ఆ తెలివితేటలు లేకపోయాయి!"

—ముఖ్యమంత్రి స్థాయి వ్యక్తి చిన్నపిల్లాడిలా మాట్లాడటం, తనలాటి వ్యక్తితో మనసు విప్పి మాట్లాడటం... వాచస్పతికి అదోలా ఉంది. అది నిజమేనని నమ్మటానికి కష్టంగా ఉంది.

"వెళ్లండి– మైథిలి లోపలే ఉంది! పోనీ నేను పిలిపించనా? అన్నాడు గోవిందరావు ఆదరంగా.

"వద్దులెండి... మీకాశ్రమ దేనికి? నేనేవెళ్లి మాట్లాడుతాను!" అంటూ వాచస్పతి ఆ గది లోంచి బయటకు వచ్చాడు.

—రాజకీయాలలాటి కుళ్లు, కుత్సితం నిండిన వాతావరణంలో ఉన్నా, గోవిందరావుతో గడిపిన ఆ కొద్దిసేపూ ఎంతో హాయిగా అని పించింది వాచస్పతికి.

పక్కహాల్లో మైథిలిని కలుసుకొన్నాడు వాచ స్పతి.

"రండి" అంటూ ఆహ్వానించింది సాద రంగా.

"మీ జీవితంలో ఇది– వ్యక్తిగతంగానూ, వృత్తిపరంగానూ– చాలా ముఖ్యమైనరోజు. ఈరోజు మీరు నాకు ఇంత సమయం కేటా యించటం నా అదృష్టమనుకొంటా!" అన్నా డు వాచస్పతి.

మైథిలి నవ్వింది–" మీరు మర్చిపోయా రేమో నాకు తెలీదు. కానీ నాకు గుర్తుంది– మీకు ఓ ఇంటర్వ్యూ ఏదోరోజున ఇస్తానన్న సంగతి! ఆ వాగ్దానం ఈరోజు తీర్చుకొంటున్నా ను!"

వాచస్పతికి ఆశ్చర్యం అనిపించింది– ఇంతకాలం తర్వాత కూడా అది గుర్తు పెట్టుకో వటం.




వాచస్పతి ఎన్నో ప్రశ్నలు వేశాడు. ఆమె అన్నిటికీ ఓపికగా సమాధానాలు ఇచ్చింది- రాజకీయాల్లోనేకాదు- ఏరంగంలోనైనా ఎవరైనా నిచ్చెనలు ఎక్కాలనుకోవటంలో తప్పేమిటంది. భర్తతో గొడవంతా రాజకీయంగానే కానీ వ్యక్తిగతంగా కాదంది. అవకాశంకోసం ఎదురు చూస్తున్న మాట వాస్తవమే అయినా అదింత త్వరగా వస్తుందనుకోలేదంది. ఆందోళనలు, ఉద్యమాలు చేపట్టినా, అవన్నీ హింసకు దూరంగా, ప్రజాస్వామ్య పద్ధతులకు అనుగుణంగా ఉండాలనేదే తన విధానం అంది.

[illegible]ా అయిపోయి- వాచస్పతికి వీడ్కోలు [illegible] ...ట్లు దిగుతున్నప్పుడు అం[illegible] [illegible]

"మీకు నా థాంక్స్ చెప్పుకోవాల్సి ఉంది!"

"నాకా? దేనికీ... ఆవార్త వేసినందుకా?" అనడిగాడు వాచస్పతి ఆశ్చర్యపోతూ.

మైథిలి తల ఊపింది అందుకు... కాదన్నట్లుగా. "అదికాదు, మొదటినుంచి మీరు నాకు తోడ్పడుతూ వచ్చినందుకు!"

వాచస్పతి మెట్లుదిగుతున్నవాడు ఆగాడు. ఆగి ప్రశ్నించాడు- "నేను మీకు తోడ్పడుతూ వచ్చినందుకా?"

"అవును... రామనాథంగారి రాజీనామా దగ్గర్నుంచి...నేటివరకు... అఫ్‌కోర్స్, దీనివల్ల మీరూ ఎదిగారనుకోండి! నిజానికి ఇది ఇచ్చిపుచ్చుకోవటం పద్ధతిలోనే జరిగింది. ఎటొచ్చీ మీకా సంగతి తెలీలేదు!"

వాచస్పతి ముఖంలో ఆశ్చర్యం.

"అవునండీ-మీకు రామనాథంగురించి చెప్పిందీ, ఫొటోలు పంపిందీ నేనే! ఆఖరికి ఈ డిన్నర్ మీటింగ్ గురించి తెలియజేసిందీ నేనే! దానికి మీకు తెలియకుండా మీరూ నాకు సాయపడుతూనే వచ్చారు. అందుకే చెప్తున్నా కృతజ్ఞతలు...అయాం రియల్లీ థాంక్‌ఫుల్‌టు యూ!"

-వాచస్పతి మెట్లు దిగాడు.

తనకు ఇంతకాలం ఫోన్లు చేసిందీ, చేయించిందీ ఈవిడా?

ఒకేరోజు కొద్దిగంటల తేడాలో తాను భిన్నధృవాలలాటి ఇద్దరు రాజకీయనాయకులదగ్గర్నుంచి ప్రశంసలు అందుకొన్నాడు. ఆదీ వారిద్దరు భార్యాభర్తలు కావటం, రాజకీయంగా శత్రువులుకావటం యాదృచ్ఛికం అయినా చిత్రంగా ఉంది!

రామ్మూర్తిగారికి ఫోన్‌చేసి చెప్పాడు-ఇంటర్వ్యూ పని జరగలేదని! మిగిలింది రేపు చెప్తానంటూ ఫోన్‌పెట్టేశాడు.

-ఇంటిముఖంపట్టాడు.

రాత్రి...దాదాపు అర్ధరాత్రి ప్రాంతం. నగరం అంతా నిశ్శబ్దంగా పడుకొని ఉంది. పగటి రాజకీయాలకు, కుతంత్రాలకు అందరూ [illegible] చెప్పి, నిద్రలో విశ్రమిస్తున్నట్లుగా [illegible] గాలి చల్లగా వీస్తోంది-ఏకల్మషమూలేకుండా అమావాస్యరోజులేమో-చీకటి నిండుగా పర్చుకొంది-బీదాబిక్కీ, అధికార ప్రతిపక్షాల తేడాలేకుండా!!

వాచస్పతి చీకట్లో ముందుకు దూసుకుపోతున్నాడు.

-ఇది అతని జీవితంలో చాలా ముఖ్యమైన రోజు!

ఇంటికొచ్చిన భర్తకు శారద ఎదురువెళ్ళింది. వాచస్పతి లోపలికి నడుస్తూ-"ఈరోజు ఎన్ని విశేషాలు జరిగాయో!" అన్నాడు.

అంతసేపు ఒంటరిగా ఉండి, మనసులో రకరకాలైన ఆలోచనలతో సతమతమవుతూ వచ్చిన శారద, ఒక్కసారిగా తన భయాల్ని బయటపెట్టింది-"విశేషాలమాట ఏమోగానీ, నాప్రాణంమాత్రం భయంతో గిలగిలలాడుతోందండీ!"

"నీకిది ఎప్పుడూ ఉన్నభయమేగదా! ఈ రోజు కొత్త ఏముంది!"

"అలాకాదండీ- మిగిలినరోజుల్లాకాదు. ఈరోజు జరిగిన విశేషాలు అన్నీ ఇన్నీకావు! ఒకేరోజు పథ్నాలుగురు మహామహులు ఇంటిదారి పట్టారు. ఇదేం సామాన్యమైన సంగతా?"

ముఖం కడుక్కొని వచ్చిన వాచస్పతి, తుడుచుకొంటూ అన్నాడు-"సియంగారి మిసెస్ తోకూడా మాట్లాడాను. ఆవిడైతే మాకెంతో మేలుచేశారంటూ థాంక్స్‌కూడా చెప్పారు తెలుసా? నీవన్నీ అర్థంలేని భయాలు! అయినా మనం ఉండేది జనంతో కిక్కిరిసి ఉన్న రాజధానినగరంలో! ఇదేమీ అడివికాదు! ఇక్కడున్నది ఆటవికన్యాయంకాదు" ధైర్యంచెప్తూ అన్నాడు.

అంతలోనే ఎవరో తలుపుతట్టిన చప్పుడ

యింది.

వాచస్పతి అడుగుముందుకు వేశాడు.

శారద అతని చెయ్యిపట్టుకొంది-"ఉండండి చూద్దాం ఎవరో, ఏమిటో... ఇంత అర్ధరాత్రివేళ..."

వాచస్పతి ఆమెను, ఆమె మాటలను కొట్టిపారేశాడు-"పిచ్చీ... ఎవరొస్తారు మన ఇంటికి? బహుశా రామ్మూర్తిగారే ఎవర్నో పంపివుంటారు...జరుగు" అంటూ తలుపుతీశాడు వాచస్పతి.

ఎదురుగా ఒక కారు ఆగి ఉంది. తలుపు ముందొక అపరిచితవ్యక్తి. చిన్నగా అన్నాడతను: "కారు ఫెయిలయిపోవటంతో లేటయింది. ఈ అడ్రసు గుర్తుపట్టలేకపోతున్నాం... కొంచెం చెప్తారా?" అంటూ ఓ కాగితం అందించాడు.

వాచస్పతి ఆ కాగితం అందుకొని, దీపం వెలుగుకోసం అడుగు వెనక్కువేశాడు.

"బాగా దాహంగా ఉంది. ఓ గ్లాసుడు నీళ్ళు ఇప్పిస్తారా?" అనడిగాడు ఆగంతకుడు.

వాచస్పతి ఆ కాగితాన్ని పక్కనేపెట్టి ఇంట్లోకి నడిచాడు. ఇట్నుంచి "ఎవరండీ వచ్చింది?" అంటూ శారద ఆ గదిలోకి వచ్చింది.

-అటుతర్వాత అంతా క్షణాలమీద జరిగిపోయింది.

-కార్లోంచి ఇంకో ముగ్గురు దిగారు. మెరుపులాగా వారిలో ఇద్దరు శారద మీదకు ఉరికారు. ఏం జరుగుతుందో ఆమె గ్రహించి నోరెత్తేలోపున ఆ ఇద్దరూ ఆమె నోరు మూసేశారు. శారద పెడరెక్కలు విరిచిపట్టుకున్నారు. ఒకడామెను తన చేతులమీదకు ఎత్తుకొంటుండగా-

గ్లాసులో నీళ్ళతో వాచస్పతి ఆ గదిలోకి వచ్చాడు. జరుగుతున్నది చూసి కెవ్వున కేకేసాడు. చేతిలోని గ్లాసుకిందపడింది. ఒక్క దూకు దూకాడు వాచస్పతి వాళ్ళమీదకు. అప్పటికే శారదతో వారు మెట్లుదిగి, ఆమెను కార్లోపడేశారు.

వాచస్పతి ముందుకు వెళ్ళే ప్రయత్నం చేశాడు-గదిలో ఉన్నవారిలో ఒకడు వాచస్పతిని ఒక్క తోపుతోశాడు. వాచస్పతి వెళ్ళి, గదినిండా ఒలికిపోయిన నీళ్ళలో పడ్డాడు. తలతిరిగిపోయిందతనికి.

ఓపిక తెచ్చుకొని లేవబోయాడు. కానీ-ఎందుకో తెలీని నీరసం, నిస్సత్తువ, నిస్సహాయత అతన్ని ఆవరించుకొన్నాయి. అయినా లేచాడు.

-లేస్తున్న వాచస్పతి మీదకు ఉరికాడు ఆ వ్యక్తి. జేబులోంచి కత్తితీసి, వాచస్పతి కడుపులో, గుండెల్లో నాలుగైదు పోట్లు పొడిచాడు.

గుండెల్లోంచి రక్తం ఉవ్వెత్తున పైకి పొంగింది. నేలమీద నీళ్ళన్నీ నివ్వెరపోయిచూస్తోంటే, వాచస్పతి వేడి రక్తం నెమ్మదిగా ఆ నీళ్ళలో కలిసి చల్లగా అయిపోసాగింది.

-వాచస్పతి...బాధగా, బరువుగా నేలమీదికి ఒరిగాడు. గదంతా రక్తం ఎర్రగా వ్యాపిస్తోంది.

మరుక్షణం-శారదతోబాటుగా ఆ కారు చీకట్లోకి సాగిపోయింది. అదెక్కడికి వెడుతోందో శారదకు తెలీదుకానీ, తన జీవితం చెడుమలుపు తిరుగుతోందని ఆమె అర్థంచేసుకోగలిగింది.

ఈ దేశంలో...అందునా రాజధానిలో...జనం కిక్కిరిసివున్న ఇక్కడ ఏమీ జరగదని భర్త అన్నమాటలు ఇంకా ఆమెకు వినిపిస్తూనే ఉన్నాయి. అయినా...జరిగేది అంతా జరుగుతోంది. కిక్కిరిసి ఉన్న రాజధానిలో...ఏ ఒక్కరూ ఆ దారుణాన్ని గమనించలేదు.

రాజధాని నిద్రపోతూనే వుంది.

అన్యాయం, అక్రమం నిశాచరులై రాజ్యంచేస్తున్నాయి.

కాలం కరిగిపోతూ ఉంది. అరాజకం పెరిగిపోతూఉంది-శారద జీవితంలో చీకట్లు కమ్ముకుపోతున్నాయి.

-ఇదేమీ పట్టించుకోని ప్రపంచంలో...ఓ మూల ఓ గదిలో...జరుగుతున్న దారుణాన్ని మేం భరించలేమంటూ, అంతకాలమూ సజీవమై సంచరించిన రక్తకణాలన్నీ గడ్డకట్టుకుపోతున్నాయి.

★ ★ ★

చుట్టూఉన్న చీకట్లను చూడలేని ప్రజలందరికీ- సూర్యోదయంతో తెల్లవారినట్లయింది.

వెలుగుక్రమంగా పరుచుకొంటూవస్తోంది. వెలుగుతోబాటే వాచస్పతి హత్యావార్తకూడా నగరమంతా పరుచుకొంటూవచ్చింది. వాచస్పతి

తన ఇంట్లో, గదిమధ్యలో దారుణంగా హతుడై ఉండటం, ఇంట్లో అతని భార్య శారద లేకపోవటంతో... జరిగింది ఏమిటో చెప్పేందుకు ప్రత్యక్షసాక్షులు ఎవరూ లేకపోయినమాట నిజమే అయినా...

జరిగింది ఏమిటో అందరికీ తెలుస్తునే ఉంది.

మామూలుప్రకారం పత్రిక ఇచ్చేందుకు అక్కడికి వచ్చిన పేపర్‌బాయ్- జనాన్ని తప్పించుకొని, లోపలికి తొంగిచూసి ఉలిక్కిపడ్డాడు. వాచస్పతి హత్య జరిగినతీరు క్షణంలో అవగాహనచేసుకొని వెనక్కు మళ్లాడు. సైకిల్ స్టాండుతీసి, పెడలు మీద కాలువేశాడు. సైకిల్‌ముందు పత్రిక కాపీలు. దానిమీద "రాష్ట్రంలో నేటినుంచీ ఉద్యమం" అని పెద్దఅక్షరాలతో ఉంది. అటూఇటూ గోవిందరావు, మైథిలీలఫొటోలు ఉన్నాయి.

అరగంట గడిచేసరికి ఆ ఇంటిచుట్టూ పోలీసులు వలయం ఏర్పాటుచేశారు. ఎవర్నీ లోపలికి రానివ్వటంలేదు. వాచస్పతి ఫొటోలు తీస్తున్నారు.

అన్ని పత్రికల కార్యాలయాలనుంచీ విలేకరులు, సంపాదకులు, వాచస్పతి మిత్రులు... అందరూ వస్తున్నారు. వీధిలో ఆమూలనుంచి ఈమూలవరకు జనం గుంపులు గుంపులుగా నిలబడి చర్చలు జరుపుకొంటున్నారు. ఎవరికి తోచిన ఊహాగానాల్లో వారు నిండా మునిగి ఉన్నారు.

పోలీస్ పైలట్ కారు సైరన్ ఊదుకొంటూ వచ్చిఆగింది. పోలీసులు ఎలర్ట్‌అయి జనాన్ని పక్కకునెట్టారు. ఆ వెనకవచ్చి ఆగిన కారు లోంచి ముఖ్యమంత్రి గోవిందరావు దిగాడు.

నలుగురయిదుగురు పోలీసులు ఆయనకు రక్షణ కల్పిస్తొంటే... గోవిందరావు హుందాగా అడుగులో అడుగువేస్తూ నడిచాడు. ఆ నడకలో కూడా సంతాపం, సానుభూతి వ్యక్తం అవుతున్నట్లుగా ఉంది.

గదికి బయట ఆగి, లోపలికి తొంగిచూశాడు గోవిందరావు. మళ్లీ లేవకుండా, నోరెత్తకుండా, అక్షరాలలో ఈ అన్యాయాలను వెలుగులోకి తేకుండా ఎవరో అతన్ని శాశ్వతంగా దెబ్బతీశారు.

తను చేపట్టిన కార్యక్రమంలో తనే సమాధి అయి రక్తతర్పణం చేసిన వాచస్పతి శవం-

ఈ దేశంలో రాజకీయగూండాగిరికి ప్రత్యక్ష సాక్ష్యంగా గదంతా పరుచుకొని పడివుంది.

ఈ పరిస్థితిని ఎవరూ బాగుపర్చలేరన్న నిరాశతోనున్నట్లుగా రక్తం అంతా నల్లరంగులోకి మారింది.

గోవిందరావు వెనక్కు కదిలాడు.

చుట్టూ ఉన్న పోలీసు ఆఫీసర్లకు ఏవేవో సూచనలు, ఆజ్ఞలు జారీచేశాడు.

అందరికీ ఒకసారి నమస్కారంపెట్టి కారెక్కాడు.

గోవిందరావు వెళ్లిపోగానే మళ్లీ జనం అన్ని వైపులనుంచీ గుమిగూడారు.

అయిదునిమిషాలలోనే పోలీసులు మళ్లీ ఎలర్ట్ అయ్యారు.

ఈసారి మైథిలి వచ్చింది. గబగబా అడుగులువేసుకొంటూ ముందుకు నడిచింది. గదిబయటే ఆగక, గదిలోకి అడుగుపెట్టింది- అది తప్పని తెలిసినా, తన అడుగులవల్ల పరిశోధనకు ఇబ్బంది కలుగుతుందని తెలిసినా!

ఇలాంటి సమయంలో అలాటివి గుర్తుంచుకొని ప్రవర్తించటం అవసరమే అయినా, జనం అదిచూడరు. నాయకులు ఎంతగా దూసుకొని వెడితే, వారి చొరవకు, వారికి హతుడిపట్ల ఉన్న గౌరవానికి అది ప్రతీకగా ప్రజలు భావిస్తారు. మైథిలికి ఇది తెలుసు.

గదిలో నాలుగైదు నిమిషాలు నిశ్శబ్దంగా నిలబడింది.

బయటకు వచ్చింది.

"ఎవరుచేసినా ఇది దారుణం అమానుషం! నీతినిజాయితీ ఉన్న... పత్రికా విలేకరులు ఈ దేశం ప్రజలకు నజీవనయనాలు! అలాటివారిలో వాచస్పతి అగ్రగణ్యుడు. అతన్ని చూసి దేశం గర్వపడొచ్చు! అలాటి వ్యక్తికి సైతం ప్రాథమిక రక్షణ కల్పించలేకపోవటం ఈ ప్రభుత్వవైఫల్యానికి నిదర్శనం! అతని ఇల్లాలు ఏమయిందో ఇంకా తెలియకపోవటం ఈ ప్రభుత్వం ఎప్పటికీ ఏమీ చెయ్యలేదన్నదానికి సాక్ష్యం! మేం ఉద్యమం ఎందుకు చేపట్టామో, అది ఎంతతప్పనిసరిఅయిందో ఇపుడైనా ప్రజలు గ్రహించి ఉంటారు" అంది




మైథిలి.

అందరూ ఆమె అంటున్నదానికి అవునన్నట్లు తలఊపారు.

ప్రతివారి గుండెల్లోనూ ఆమె మాటలు ప్రతిధ్వనించాయి.

"వాచస్పతిగారి హత్యకు నిరసనగా మేం ఈరోజే రాష్ట్రవ్యాప్తంగా బంద్ నిర్వహిస్తాం! రేపు ఉదయంలోగా అతని ఇల్లాలు ఆచూకీ తెలీకపోతే రేపుకూడా బంద్ కొనసాగుతుంది మైథిలి ప్రకటించింది.

అక్కడ ఉన్న పత్రికలవాళ్లు ఆ నిర్ణయానికి తమ మద్దతు తెలిపారు.

ఆ నిర్ణయాన్ని బలపరచింది జర్నలిస్టుల సంఘం. పత్రికా విలేకరికి కనీసరక్షణ ఇవ్వలేని ఈ ప్రభుత్వం సామాన్యులకు రక్షణ ఇచ్చేది ఇంకేమిటని, ఇలాటి అసమర్థప్రభుత్వాన్ని వెంటనే బర్తరఫ్‌చేసి, కొత్త ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలని కేంద్రప్రభుత్వాన్ని కోరుతూ వారు టెలిగ్రాం పంపారు.

వాచస్పతి హత్యకు, శారద కిడ్నాపింగ్‌కు నిరసనగా 'వార్త' ఆరోజు పత్రికను వెలువరించలేదు.

-వాచస్పతి హత్యతోనూ, శారద కిడ్నాపింగ్‌తోనూ గోవిందరావు ప్రభుత్వంపై ప్రజలు ఆగ్రహావేశాలు పెంచుకున్నారు. నిజాల్ని నిర్భయంగా చెప్పటమే ఇక్కడ తప్పయితే దానికి హత్యలు, ఎత్తుకుపోవడాలే శిక్ష అయితే... ఇదేం ప్రజాస్వామ్యం, ఇది మాకు అక్కర్లేదన్నారు.

-ప్రజలంతా ఉవ్వెత్తున లేచారు. లేవనివాళ్ళను లేపారు కొందరు.

-ఒకేరోజులో పలునగరాల్లో కాల్పులు జరిగాయి. పదిమంది ప్రజలు తమ ప్రాణాల్ని త్యాగంచేశారు. బస్సులు ఆగిపోయాయి. రైళ్ళు ఆలస్యంగా నడిచాయి.

గోవిందరావు ప్రభుత్వం- తుఫానుగాలికి చిరుఆకులా విలవిలలాడింది. కొనప్రాణంతో కొట్టుమిట్టాడింది.

ఉప్పెనగా ఉన్నట్టుండి ఎగిసిపడిన ప్రజాగ్రహానికి అందరూ నివ్వెరపోయారు. అప్రమత్తంగాలేని పోలీసువ్యవస్థ ఎన్నోచోట్ల ఎదురుదెబ్బలు తింది.

-మర్నాటికీ పరిస్థితి ఏం బాగుపడలేదు.

శారద ఏమయిందో, ఎక్కడుందో పోలీసులకు అంతుచిక్కలేదు. ఆమె కనబడేంతవరకు తమ ఉద్యమం తీవ్రస్థాయిలోనే కొనసాగిస్తామని మైథిలి ప్రకటించింది. ఆ ప్రకటనతో ఆరోజుకూడా ఉద్రిక్తత కొనసాగింది.

సాధారణంగా ఏ రాష్ట్రంలో ఆందోళన తలెత్తినా దాన్ని అణిచివెయ్యాలనే ఉద్దేశంతో ఉండే కేంద్రంకూడా ఈసారి ఎందుకో కొంచెం చలించింది. పత్రికల్లో వాచస్పతి హత్యగురించి వివరంగా ప్రచారం జరగటంతో కేంద్రం తన ప్రతిష్ఠ దెబ్బతింటుందనే ఆలోచనలో పడింది.

ఆరోజు రాత్రి ముఖ్యమంత్రి గోవిందరావు రాష్ట్రప్రజలను ఉద్దేశించి రేడియో, టెలివిజన్‌లలో ప్రసంగించారు. రాష్ట్రంలో పరిస్థితిని ప్రభుత్వం జాగ్రత్తగా కనిపెడుతోంది. ఆందోళనలను అతిత్వరలో అదుపులోకి తెస్తోంది. శాంతిభద్రతలను కాపాడితీరుతుంది. మరో ఇరవైనాలుగు గంటల్లోగానే పరిస్థితి అంతా మామూలుస్థితికి వచ్చి తీరుతుందని హామీ ఇస్తున్నట్లుగా ప్రకటించారు.

ఆ ప్రకటన వచ్చిన అరగంటకు-

కేంద్రం గోవిందరావు ప్రభుత్వానికి ఉద్వాసన చెప్పాలని నిర్ణయించుకున్నట్లు వార్తలు వచ్చాయి.

రాష్ట్రంలో- ఒక్కసారి ఉత్సవాలు వెల్లివిరిసాయి.

మర్నాడు ఉదయం- మైథిలీరావ్ రాష్ట్రానికి కొత్త ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేస్తుందనే వార్త కూడా ప్రచారంలోకి వచ్చింది.

"గెలిచావు" అన్నాడు గోవిందరావు.

"గెలవటం సంతోషంగానే ఉంది. కానీ ఇలాకాదు నేను గెలవాలని ఆశించింది! నా సమర్థతను నిరూపించుకోవాలని అనుకున్నానేగానీ... పొరబాటున మీరు అసమర్థులని రుజువుఅయింది!" మైథిలి మనస్ఫూర్తిగా అంది.

గోవిందరావు నవ్వాడు-

"ఆ నిజం నీకు తెలుసు, నాకు తెలుసు- ప్రజలకేం తెలుసు! తెలిసినా, ఆ సంగతి అర్థంచేసుకున్నా దానిగురించి ఆలోచించేది

ఎందరు? ఎందరికి అంత ఓపిక, సమయం ఉన్నాయి చెప్పు! ఏదో ఆవేశంతో ఉద్యమాలు చేపట్టడమే మన జనానికి తెలిసిందిగానీ, ఆలోచించటం ఇంకా రాలేదు వారికి!''

''ఏదో ఒకరోజు అదీ వస్తుంది! ఇప్పుడు తలవంచుకొని బతుకుతున్నవారు రేపెప్పుడో తల ఎత్తుతారు! ఇప్పుడు ఏమీ పట్టించుకోని వారు ఆనాడు ప్రశ్నలు రువ్వుతారు, జవాబులు వెతుకుతారు! ఆరోజు వరకు...'' మైథిలి ఆగింది.

''ఇలాటి రాజకీయాలు కొనసాగుతూనే ఉంటాయి. నిజానికి ఇప్పటి రాజకీయ రంగంలో అసలు రాజకీయాలు లేవు. ఇప్పుడున్నవన్నీ అరాజకీయాలే.... అది గుర్తుంచుకో! మంత్రివర్గం మారినంతమాత్రాన పరిస్థితి మారిపోయిందని, మారిపోతుందని ప్రజలు అనుకోవచ్చుగానీ నువ్వు ఆ భ్రమలో ఉండకు! ప్రజలు నిన్ను కనిపెడుతూ ఉంటారు. నాలాగా అప్రతిష్ఠతో మాత్రం పదవిలోంచి నిష్క్రమించకు... గుడ్‌లక్!'' అన్నాడు గోవిందరావు.

మైథిలి భర్తకేసి ఆప్యాయతతో చూసింది. ఆమె కళ్ళల్లో వేనవేల మాటలు. ఆమె పెదవులు ఏ శబ్దమూ చెయ్యటంలేదు. కానీ ఆ మాటల్ని గోవిందరావు మనసు మాత్రం వినగలుగుతోంది.

మార్గశీర్ష బహుళనవమి. ఉదయం తొమ్మిదిగంటల తొమ్మిది నిమిషాలు.

ఏడాదికిందట గోవిందరావు ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారంచేసిన అదే 'సు'ముహూర్తంలో ఆయన సతీమణి శ్రీమతి మైథిలీరావ్ ప్రమాణస్వీకారం చేసి, రిజిస్టర్‌లో సంతకంచేసి కలాన్ని పక్కనబెట్టింది. గవర్నర్‌కు అభివాదపూర్వకంగా నమస్కారం చేసింది. తర్వాత పదవీ విరమణచేసిన ముఖ్యమంత్రి గోవిందరావుకు నమస్కారం చేసింది. ఆయన ప్రతి నమస్కారంచేసి, కరచాలనానికి చెయ్యిజాపాడు. ఆమె ఆప్యాయంగా కరచాలనం చేసింది.

పదవినుంచి భర్త నిష్క్రమణం, భార్యామణి ఆగమనం

వేదిక కిందనున్న ప్రజలు, ప్రముఖులు ఆ అపూర్వదృశ్యాన్ని చూస్తూ మైమరిచిపోయారు. పెద్దపెట్టున కరతాళధ్వనులు చెలరేగాయి.

వేదికముందున్న అందరికీ సాదరంగా నమస్కారం చేసింది మైథిలి. ఆ తర్వాత మైక్‌ముందు నిలబడింది.

-చిన్నగా తన ప్రసంగం మొదలుపెట్టింది.

''...రాష్ట్రచరిత్రలో నేడు సుదినం. ప్రజలు తమ అభీష్టాన్ని నిర్ద్వంద్వంగా తెలిపి తమకు కావల్సిన ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసుకున్న రోజిది...'' అంటూ ఆరంభించింది.

ఆ తర్వాత, తనకుముందున్న ప్రభుత్వ వైఫల్యాలను ఒకటొకటిగా ఏకరువుపెట్టింది. అవినీతికి, అక్రమాలకు తమ ప్రభుత్వం ఏమాత్రం చోటివ్వదని ఉద్ఘాటించింది. అన్యాయాలను ఎదుర్కొనేవారికి, అక్రమాలను వెలుగులోకి తెచ్చేవారికి తన ప్రభుత్వం సంపూర్తిగా సంరక్షణ కలిగిస్తుందని హామీ ఇచ్చింది.

ఉపన్యాసానంతరం...

ఆమె- అతిరథమహారథులు వెంటరాగా, సాధికారంగా వాచస్పతికి అంత్యక్రియలు జరిగిన ప్రదేశానికి వెళ్ళి నివాళి అర్పించింది.

వాచస్పతికి ప్రభుత్వం తరపున గౌరవపురస్సరంగా ఒక స్మృతిచిహ్నాన్ని నిర్మిస్తామని ప్రకటించింది. ఆయన పేరిట రాష్ట్ర విశ్వవిద్యాలయం ఒకదాంట్లో జర్నలిజం కోర్సులో బంగారుపతకాన్ని ప్రతి ఏడాది ఉత్తమ విద్యార్థికి బహూకరిస్తామని ప్రకటించింది.

ఉద్యమ సమయంలో ప్రాణాలు త్యాగంచేసిన ప్రజలకు ఒక్కొక్కరికి పదేసివేల రూపాయల నష్టపరిహారంగా వారి కుటుంబాలకు చెల్లించదలిచామని ప్రకటించింది.

అటుతర్వాత-

ఆమె నూతన మంత్రివర్గనిర్మాణంలో తగినవారిని, అర్హతలు ఉన్నవారిని మంత్రులుగా ఎన్నుకొనేందుకు ప్రయత్నాలు ఆరంభించింది. ఆమె- రాజకీయ జీవితం మలుపుతిరిగింది.

అంతే...

అంతకుమించి ఆ తర్వాత మరేం జరగలేదు...

జరగదు కూడా







# మీ బిడ్డల భవిష్యత్తును గురించికాక మీ ఆరాటం వేరేముంటుంది!



# మార్గదర్శి

మీ బిడ్డల భవిష్యత్తు తీర్చిదిద్దడానికి తలపెట్టే ప్రయత్నంలో ఆచితూచి అడుగువేయాలి. అందుకు లాభప్రదమైన సంస్థలో మీ డబ్బు పెట్టుబడి పెట్టండి. మీరు నిశ్చింతగా ఎంచుకోదగ్గ సంస్థ మార్గదర్శి ఒక్కటే.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం. ఆర్థిక హాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 5000 | 50 | 2,50,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

బ్రాంచీలు:

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పి.యన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూరోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావుపేట, ఏలూరు.
- ఆర్.ఆర్.స్ట్రీట్, నెల్లూరు.

**డబ్బుకోసమేనా మీ చింత!**
**మార్గదర్శి ఉన్నది మీ చెంత!!**



రిజిష్టర్డ్ మరి[illegible]
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.




ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ సమీక్షలు రాయటం మంచిది.

1. **"సమీక్ష"** అరఠావుకి మించకుండా, కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింద కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **'చతుర' సమీక్షకు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టు చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపిక చేసి, ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

పాఠకులు నవలతోబాటు 'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, చతుర కథలు, ఫీచర్లు వంటి ఇతర అంశాలపట్ల కూడా తమ తమ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు కూడా విడిగా వేరే కాగితంపై రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలచాం.

## కూపన్

### మార్చి 'చతుర' నవల అరాజకీయం

సమీక్షకుని పేరు: ..........................................

చిరునామా: ..........................................

..........................................

..........................................

..........................................

## FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500482 |
| 2. | Periodicity of its Publication | : Monthly |
| 3. | Printer's Name | : **RAMOJI RAO** |
| | Whether citizen of India. | : Yes |
| | If foreigner, state the country of origin | : — |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500482 |
| 4. | Publisher's Name | : **RAMOJI RAO** |
| | Whether citizen of India. | : Yes |
| | If foreigner, state the country of origin | : — |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500482 |
| 5. | Editor's Name | : **RAMOJI RAO** |
| | Whether citizen of India. | : Yes |
| | If foreigner, state the country of origin | : — |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500482 |
| 6. | Names and address of Individuals who own the newspaper and partners or share holders holding more than one percent of the total capital. | : **VASUNDHARA PUBLICATIONS** 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500482 |

**I, RAMOJI RAO,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS.**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 1988

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad- 500016, TEL: 229428 CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad- 500482.




## దెయ్యాల ప్రహసనం

నాగరిక దేశాల్లో దయ్యాల ప్రస్తావన వస్తే నవ్వుకుంటాం. అవన్నీ మనిషి కల్పించుకున్న భ్రమలని చెబుతాం. కాని, ఒకప్పుడు లండన్ లాంటి మహానగరంలో ఎంతో సంచలనాన్ని కలిగించాయి దయ్యాల చర్చలు.

పదిహేడవ శతాబ్దంలో ఎలిజబెత్‌రాణి, జేమ్స్ రాజుల పరిపాలనల్లో దయ్యాల్ని పట్టిచ్చినవారికి పారితోషికాలిస్తామని ప్రకటిస్తూ ఓ శాసనమే చేశారు. ఆ రోజుల్లో జనం దయ్యాలున్నాయని గాఢంగా విశ్వసించేవారు. దయ్యాలు ఎక్కువగా తిరిగే ప్రదేశాల్లో తమకు డ్యూటీలుపడకుండా చూడమని ప్రార్థించేవారు అక్కడి సైనికులు. సైనికులే అలా భయంతో వణికిపోతుంటే ఇక సామాన్యుల సంగతేమిటి!?

ఆ రోజుల్లో ప్రభువుల భద్రత కోసం ప్రత్యేకించి ఓ దయ్యాల వ్యతిరేక సంఘం ఏర్పాటైంది. ప్రభువుల జోలికి ఏ దయ్యమైనా వస్తే తరిమేయటం ఈ సంఘ సభ్యుల పని. అలా దయ్యాల్ని తరిమిన సైనికులకి ప్రత్యేక వసతులూ, ప్రమోషన్లూ, ఇంక్రిమెంట్లూ ఉండేవి.

వీధిలో మిట్టమధ్యాహ్నం ఏ స్త్రీఅయినా నడిస్తే దయ్యమే అని వాదించి తక్షణమే నిలువునా కాల్చి చంపేవారు.

ఎలిజబెత్‌రాణి హయాంలో పాలకులతోపాటు సాహితీవేత్తలుకూడా దయ్యాలున్నాయని నమ్మేవారు. జేమ్స్‌రాజు హయాంలోనయితే 'దయ్యాల'కి ఎదురేలేకపోయింది. దయ్యాలన్నీ ఏడాదికోసారి ఒకచోట కలుసుకుని ఉత్సవం జరుపుకుంటాయని నమ్మే రచయితలుండేవారు. పైగా దయ్యాలు లేవని వాదించేవారిని మూర్ఖులుగా, పిచ్చివాళ్లుగా పరిగణించేవారు. దయ్యాలు రాత్రిళ్లు విధి నిర్వహణలకోసం సంచరించడానికి ప్రదేశాల్ని నిర్ణయించుకుని డ్యూటీలు వేసుకునేవని విశ్వసించేవారు.

ఈ దయ్యాలు కొన్ని చిన్నపిల్లల్నీ, పెంపుడు జంతువుల్నీ ఎత్తుకుపోతాయనే వదంతులుండేవి. బహుశా అందుకే ఇప్పటికీ చిన్నపిల్లలు మారాం చేస్తే 'దయ్యానికి పట్టిస్తామని' పెద్దలు బెదిరిస్తుంటారేమో! దయ్యాలు రాజుల, రాణుల వ్యక్తిగతజీవితాల్లో కూడా జోక్యంచేసుకుని ప్రేమల్ని విఫలం చేయటం, రాజ్య భ్రష్టుల్ని చేయటంలాంటి పనులు చేస్తాయని భావించేవారు.



ఈ ఉదంతాల్నే ఆనాటి కవులు, చరిత్రకారులు తమ రచనల్లో విరివిగా రాశారు. ఓ పథకం కింద జేమ్సురాజు కాలంలో ఆరు వందల దయ్యాల్ని పట్టుకుని థేమ్స్ నదిలో ముంచారని చెబుతారు.

షేక్స్‌పియర్ తన 'మెక్బెత్'లో దయ్యాల చేత రాజుకి జోస్యం చెప్పిస్తాడు. షేక్స్‌పియర్ దయ్యాలున్నాయనేందుకు విజ్ఞానశాస్త్రాన్ని ఉదహరించటం ఆశ్చర్యకరం. మళ్లీ అతనే ఒకచోట మనిషి మానసిక ఆలోచనలకి ప్రతిరూపాలే దయ్యాలని అంటాడు.

ఆరోజుల్లో రచనల్లో దయ్యాలకి ప్రాధాన్యత కల్పించడం ఫ్యాషన్. కీడు చేసే దయ్యాలతో పాటు సహృదయ దయ్యాలు కూడా వుండేవని ఓ నమ్మకం. పేదవారి కష్టాల్ని చూసి బాధపడి ధనికుల్ని దోచి పేదవారికి డబ్బులు, నగలు అందించేవట అలాంటి దయ్యాలు.

షెల్లీ తన కవిత్వంలో దయ్యాల్ని ప్రస్తావించాడు. అతని కలంతో ఊపిరి పోసుకున్న దయ్యం లండన్‌లోని మిగతా దయ్యాలకంటే విభిన్నమైంది. అది అందం, సుగుణాల పోగు. ఓ నావలో పయనిస్తూ ప్రజలకు సాయపడటమే దాని వృత్తి. దయ్యాలు మురికిగా భయంకరంగా వుండి ప్రజలకు కీడుచేస్తాయనే భావనను పోగొట్టడానికి షెల్లీ చేసిన ప్రయత్నమేమో ఈ పాత్ర సృష్టి అనిపిస్తుంది. దీన్నిబట్టి మేధావులైన ప్రముఖులు సైతం పూర్వం ఎంత గుడ్డిగా పిచ్చినమ్మకాలతో రోజులు గడిపారో తెలుస్తోంది.

## చిలక పలుకుల మాస్టారు

తన శిక్షణలో మాటలు నేర్చి పదుగురినీ రంజించి మెప్పులందుకుంటున్న విద్యార్థుల్ని చూసి ఏ గురువు హృదయం ఉప్పొంగదు? తన కృషి ఫలించినందుకు విద్యార్థుల ప్రతిభ గురించి ఆ గురువు సగర్వంగా చెప్పుకుంటాడుగదా! పూనా నివాసి చింతామణ్ షెలార్ నడిపే స్కూల్లోని విద్యార్థులు బాలబాలికలు కాదు సుమండీ- పిచ్చుకలు, చిలుకలు అతని విద్యార్థులు. గత పదిహేను సంవత్సరాల్లో 400కి పైగా చిలుకలు అతని శిక్షణలో మాటలు నేర్చాయి. వాటిలో ఎన్నో సర్కస్ కంపెనీల్లో ఉద్యోగాలు సంపాదించుకుని గురువుకి మంచిపేరు కూడా తెచ్చిపెట్టాయి.

చిలుక మనిషి ధ్వనిని అనుకరిస్తుంది. ఉపన్యాసాలు వల్లెవేస్తుంది. పద్యపాదాలు కంఠతానేర్చి అప్పచెపుతుంది. కానీ అవన్నీ అది తన గురువు ద్వారా నేర్వవలసిందే! ఒక్కో చిలుకల మాస్టారూ తనదంటూ ఓ ప్రత్యేక పద్ధతిని అనుసరిస్తాడు. షెలార్ ఒక మట్టికుండకు అడుగున రంధ్రం చేసి కుండలోకి చిలుకను వదులుతాడు. తడిగుడ్డతో కుండ మూతిని మూసి వేసి కట్టివేస్తాడు. కుండను 'ఉట్టి'లా వేలాడదీస్తాడు. అడుగునున్న రంధ్రం ద్వారా చిలుకకి మాటల్ని పదేపదే నేర్పుతుంటాడు. సాధారణంగా ఉదయమే ఈ శిక్షణ కార్యక్రమం ముగిస్తాడు. మధ్యాహ్నం పొద్దున చెప్పిన మాటల్ని చిలక్కి మళ్ళీ చెప్పి.



వల్లె వేయిస్తాడు. అలా చిలుక మాటలు నేర్చుకుంటుంది. షెలార్ తను శిక్షణ ఇచ్చిన చిలుకలన్నిటికీ ఈ పద్ధతిలోనే నేర్పాడు. ఒక చిలుకకి మాటలు నేర్పించటానికిగాను షెలార్ 300 నుండి 500 రూపాయల వరకు వసూలు చేస్తాడు. పద్యాలూ, పాటలూ ఒక చిలక్కి నేర్పేందుకు రెండు వేల రూపాయలు ఛార్జీచేస్తాడు. ఇండోనేషియాకి చెందిన ఓ చిలుకకి అచ్చుమనిషిలానే మాట్లాట్టం, అభినందించటం, అభివాదం చేయటం నేర్పాడతను.

మగ చిలుకలకంటే, ఆడ చిలుకలే తెలివైనవనీ, చురుకైనవనీ తన అనుభవంగా చెబుతాడు షెలార్. మాటలు నేర్చుకునేందుకు తన దగ్గరికి వచ్చిన రకరకాల చిలుకల స్వభావాల్నీ అలవాట్లని క్షుణ్ణంగా వివరించగలడు.

ఆస్ట్రేలియాకి చెందిన ఒక జత "మాకా" చిలుకల వెల అక్షరాలా 36 వేల రూపాయలు. అయితే వెలలానే వాటి జీవితకాలమూ ఎక్కువే. సుమారు 150 సంవత్సరాలు బతుకుతాయట. ఇండోనేషియాకి చెందిన చిలుకలు కూడా 150 ఏళ్ళూ జీవించినా జత ఇరవైవేలు మాత్రమే. అహమ్మదాబాద్‌కి చెందిన ఒక జత చిలుకల ఖరీదు 150 రూపాయలు కాగా వాటి ఆయుర్ధాయం 50 ఏళ్ళు.

చిలుకను రెచ్చగొట్టకుండా ఓపికగా దానికి మాటల్ని నేర్పవలసి వుంటుంది. ఇది చాలా సున్నితమైన పని. అందుకే సర్కస్ కంపెనీలు తాము కొన్న చిలుకల పలుకులకి మురిసి షెలార్‌ని అభినందించాయి. అతను కొన్ని కుక్కలకు కూడా శిక్షణనిచ్చాడు.

షెలార్ కుటుంబం గత మూడు తరాలుగా జంతువులతో, పక్షులతో అనుబంధం పెనవేసుకుని ఉంది. అతని పితామహుడు సేఠ్‌తుకారాం 'దిగ్రేట్ షెలార్ రాయల్ సర్కస్'కి ప్రొప్రయిటర్. అది 1932 లో బాంబుదాడిలో ధ్వంసమైంది. తండ్రి సేఠ్‌గజానన్ ఒక సర్కస్ కంపెనీలో రింగ్ మాస్టర్. అలా జంతువులతో, పక్షులతో షెలార్‌కి చిన్ననాటి నుంచే పరిచయం ఉంది. అయినా అనారోగ్యకారణంగా సర్కస్ ప్రపంచానికి దూరమైనాడు.

## అరకిలో అమ్మాయి

అరచెయ్యి సైజులో, అరకిలో కంటే తక్కువ బరువుతో పుట్టి వైద్యరంగంలోనే గొప్ప సంచలనం సృష్టించిందో పాపాయి. మాంసపుముద్దలా కనిపించిన ఆ పసికూన బతికి బట్టగడుతుందని ఎవ్వరూ ఊహించలేదు. కాని వైద్య విజ్ఞానం అభివృద్ధి సాధించి అసాధ్యాలను సైతం శాయశక్తులా సాధ్యంగా మారుస్తున్న ఉదంతాలెన్నో వున్నాయి.

బొంబాయిలోని చెంబూర్‌కి చెందిన సుభాష్‌నగర్ నివాసి శ్రీమతి కవితా డేంగేర్కర్‌ని గత సంవత్సరం ఫిబ్రవరి 19న ఆరునెలల గర్భవతిగా ఉన్నప్పుడే పురిటి నెప్పులు రావటంతో హడావిడిగా ఆస్పత్రికి తీసుకొచ్చారు. మరో గంటలో కవిత ప్రసవించింది. కాని పుట్టిన శిశువు కేవలం 450 గ్రాముల బరువుండి 31.5 సెం.మీ అంటే 5.5 అంగుళాల పొడవూ, తల 23.5 సెం.మీ ఉండటంతో ఆస్పత్రి సిబ్బంది, డాక్టర్లూ విస్తుపోయారు. అరచెయ్యి సైజులో ఉన్న ఆ ప్రాణిని బతికించగలగటం ఎలాగో వారికి అర్థంకాలే







దు. అలాంటి శిశువులకి సంరక్షణ కల్పించ గల సౌకర్యాలు ఆ ప్రైవేట్ ఆస్పత్రిలో లేనందున బొంబాయిలోని మున్సిపల్ హాస్పిటల్‌లోకి ఆ శిశువుని పంపించారు.

ఆ ఆస్పత్రిలోని డాక్టర్లు, డాక్టర్ అర్మిదా ఫెర్నాండెస్ నేతృత్వంలో అనుక్షణం ఆ పాపాయిని పరీక్షిస్తూ సంరక్షించసాగారు. రోజురోజుకీ ఆ శిశువు బరువు పెరగటం ప్రారంభమయింది. ఇంక్యుబేటర్‌లో ఆ పాపాయిని ఉంచి ట్యూబ్‌తో గ్లూకోస్ నీళ్ళు ఆహారంగా అందించేవారు. శరీరానికి ఒక పద్ధతి ప్రకారం కొబ్బెర నూనెను మర్దనాచేయించారు. ఎదగని శిశువులకి చికిత్సచేసి ఇదివరకే ప్రసిద్ధ 'నియోటనెలాజిస్టు'గా పేరుపొందారు డాక్టర్ ఫెర్నాండెస్. ఎంతో శ్రద్ధగా ఈ శిశువును చెక్‌చేసి సరైన సూచనలిచ్చి బతికించాలని శాయశక్తులా పాటుపడ్డారు. పేదరికం, పోషకాహారలోపం, తల్లి బలహీనత– ఈ విధమైన శిశు జననాలకి కారణాలవుతున్నాయి.

గతంలో 600 గ్రాములు తూగిన శిశువులు సైతం రెండురోజులకి మించి జీవించలేదు. 450 గ్రాముల బరువుమాత్రమే ఉన్న ఈ శిశువు జీవిస్తుందని ఎవరూ అనుకోలేదు. అందుకే ఈ పాపాయి దినదిన ప్రవర్ధమానమవటం అందరిలోనూ సంచలనాన్నిరేపి సంతోషాన్ని కలిగిస్తోంది. ఈ చిన్నారి ప్రాణాలకి ముప్పులేదని తెలిపోయింది. అయితే డాక్టర్ ఫెర్నాండెస్ ఈ పాపాయి భవిష్యత్తు గురించి మూడు విధాలుగా అంచనావేస్తున్నారు. అందులో మొదటిది– రెండు మూడేళ్ళలో మరింత బరువు పెరిగి ప్రకృతి సహజమైన మార్పులతో సాధారణంగానైనా ఈ శిశువు పెరుగుతుంది. లేదా మానసికంగా బలహీనమై ఉత్సాహరహితంగా ఉంటుంది. లేదా అసాధారణ ప్రజ్ఞాపాటవాలు చూపే మేధావంతురాలైనా అవుతుందని ఆమె చెప్పారు. ఎందుకంటే ప్రపంచ ప్రఖ్యాతి పొందిన విజ్ఞానఖనులు బెథోవెన్, న్యూటన్, ఐన్‌స్టీన్ వంటి ప్రముఖులు ఆరోమాసంలోనే జన్మించారట.

ప్రస్తుతం ఈ పాపాయి అందరు శిశువుల్లాగే శరీరావయవ అభివృద్ధి పొంది ఆటలతో, కేరింతలతో గడుపుతోంది. ★

# హరిన ముత్యాలు

★ దేశం అభివృద్ధిచెందడమంటే అద్దాల మేడలు రంగుల గోడలు కాదు- పౌరుని నైతికాభివృద్ధే నిజమైన దేశాభివృద్ధి.

– గాంధీజీ

★ అధికారం అవినీతికి మూలం. అంతులేని అధికారం అంతులేని అవినీతికి ఆలవాలం.

– లార్డ్ ఆక్టన్

★ అదృష్టం అన్వేషించేవారినే వరిస్తుంది. ప్రతి వ్యక్తి జీవితంలో అదృష్టం ఒక్కసారే వచ్చి తలుపు తడుతుంది. ఆ క్షణాన 'కృషి' అనే ద్వారాన్ని తెరవకపోతే అదృష్టం అదృశ్యమవుతుంది.

– న్యరైయస్

★ మనల్ని చూసి జనం జాలిపడేట్లుగాకాక అసూయపడేటట్లు మనం జీవించాలి.

– హెరపోన్

★ దయ ఎప్పుడూ వృధాకాదు. అవతలవానిమీద దాని ప్రభావం లేకపోయినా ప్రదర్శించేవానికి అది మేలుచేస్తుంది.

– ఎస్. హెచ్. సిమ్మన్స్

★ భగవంతుడు కన్నీటిని, చిరునవ్వును కూడా సృష్టించాడు. సంభ్రమాశ్చర్యాన్నీ స్వేచ్ఛను స్వీకరించేందుకు నువ్వు వుపయోగపడుతున్నట్టే సంతాపం సావధానంగా నర్దుకొనేందుకు కన్నీరు వుపయోగపడుతుంది. నిర్వేదన, నిస్పృహ, నిరాశలకు దారితియ్యకుండా కన్నీరు కాపాడుతుంది.

–లీహంట్

★ చరిత్ర రాజుల యుద్ధాల కథ కాకూడదు- అవి భావాల చరిత్ర కావాలి.

– చెకోవ్

★ ఏకార్యంలోనూ విజయం సాధించలేమని ముందుగానే ఒక నిర్ణయానికి వచ్చేవారెన్నడూ విజయం సాధించలేరు.

– సర్-ఆర్థర్ కాటన్

★ ఉత్తముడు ఎవరినీ అవమానించడు. ఇతరులు అవమానిస్తే సహించడు.

– హ్యూమ్స్

★ తల్లిదండ్రులు పిల్లలను మంచి నడవడిలో దిద్దుకోవడం మంచిదే కానీ, తమ నమ్మకాలను వారిపై రుద్ది వారు మోయలేని భారాన్ని మోపడం మంచిదికాదు.

– బేకన్

★ పరిశుద్ధమైన ప్రేమ కొంచమైనా లేనివాడే దరిద్రుడు.

– గాంధీజీ

★ ఈ ప్రపంచంలో నీకు శత్రువులు లేరు, మిత్రులు లేరు. నీ ప్రవర్తనే నీకు శత్రువులను, మిత్రుల్ని తెచ్చిపెడుతుంది.

–చాణక్య

# పాఠకులకో మాట

'విపుల' 'చతుర'లకంటే ఎక్కువగా అమ్ముడయ్యే ఇతర తెలుగు, మాస పత్రికల పేర్లు.....

ఇట్లు

'విపుల' 'చతుర'లకంటే ఎక్కువ రంగుల పేజీలు గల ఇతర తెలుగు మాసపత్రికల పేర్లు......

ఇట్లు

# వ్యాపారంలో

ప్రచారంలో ముఖ్యమైనవి పత్రికాప్రకటనలు. కొనుగోలుదారుణ్ని ఆకర్షించి వస్తువును కొనిపించేశక్తి ప్రకటనకు ఉండాలి. ఇందుకు మంచి ఉదాహరణ ఆమధ్య విడుదలైన 'మ్యాగీ'వారి నూడుల్స్. ఈ నూడుల్స్ నాణ్యత ఎలాంటిది, వాళ్ళు ఎంతస్థాయిలో ఉత్పత్తి చేయగలరు, ఆ ఉత్పత్తిని వినియోగదారునివరకూ తీసుకురాగల యంత్రాంగం ఎలా ఉన్నది- అనే అనేక విషయాలకన్నా చాలా ముఖ్యమైనది- దానివైపు వినియోగదారుడు ఆకర్షింపబడాలి. ఆ తరువాత మిగతా విషయాలు. అందుకు ఆ కంపెనీవారి నూడుల్స్ పేరు ''టూ-మినిట్ నూడుల్స్'' అనిపెట్టారు. తమ వంటకం యొక్క మొదటి ప్రత్యేకత- రెండు నిమిషాల్లో వండుకోగలగటమనేదాన్ని తమ పేరుతోనే చెప్పుకున్నారు. దీంతో అసలు నూడుల్స్ అంటే ఏమిటి అనే ఆలోచనకు బదులు, అది ఏదైనాసరే అనేక రుచుల్లో కూడా దొరుకుతున్నప్పుడు, రెండు నిమిషాల్లో వండుకోగలిగిందంటే, మనం చేయవలసిందల్లా ఓ మూడు రూపాయలు ఖర్చుపెట్టడం మాత్రమే గదా- అనే ఆలోచనని కొనుగోలుదారుని మనసులోకి అందించగలిగింది. ఒక కొత్త ఉత్పాదనను, అతిశీఘ్రంగా ప్రజల్లోకి పంపించగలిగిన చక్కటి ఆలోచన అది. ఇక మ్యాగీవారి మరొకవ్యాపార ప్రకటనారహస్యం. ఏప్రాంతానికి ఆ ప్రాంతం ప్రత్యేక వంటలున్న మనదేశంలో ఒక కొత్త (చైనా) వంటకాన్ని ప్రజలు స్వీకరింపచేయగలిగేలా చేయటానికి మరొక చిట్కా. ఏకొత్త రుచినైనా మొదట స్వీకరించేది పిల్లలే. తినేవస్తువు బాగుండాలన్నవిషయం తప్పితే, అదేమిటన్న పట్టింపు వాళ్లకు ఉండదు. దీన్ని ఆధారంగా తీసుకుని- పిల్లలు ఏక్షణంలో ఆకలని అంటారో వాళ్లకే తెలియదు- అనే నినాదంతో, అలాంటప్పుడు తల్లులకు కొంగుబంగారం, రెండునిమిషాల్లో తయారయ్యే మ్యాగీ నూడుల్స్-అన్న ప్రకటన. ఆ




# చతుర ఫీచర్

# అందం

ఉత్పాదన ఎవరికి ఉద్దేశించబడిందో ఆ తల్లులకు సూటిగా చేరేవిధంగా రూపొందింపబడి, అనుకున్నలక్ష్యాన్ని సాధించింది. ఫలితంగా మ్యాగీవారి నూడుల్స్ ప్రజలకు చేరువైనాయి. ఆ తరువాత వాటిలోని సులువును, నాణ్యతనూ, రుచులనూ తెలుసుకున్న ప్రజలు వాటిని ఆదరించసాగారు.

ఆమధ్య మనరాష్ట్రంలో ఒక సుప్రసిద్ధ సంస్థవారు కొత్తగా మసాలాపొళ్ల రంగంలోకి దిగారు. కల్తీచేయలేని ప్యాకెట్‌లలో స్వచ్ఛమైన మసాలాపొళ్లను వారు అందించినప్పటికీ, అవి ప్రజాదరణకు నోచుకోలేదు. అందుకు ఏకైక కారణం ప్రచారలోపం. పసుపుపొడిలో రంపంపొట్టుతోపాటు గుర్రపులద్దెకూడా కలుపుతున్న సమయంలో, కృత్రిమమైన రంగుకూడా కలపని ఆ కొత్తబ్రాండు ప్రజాదరణను ఎందుకు పొందలేకపోయింది? సాధారణ మసాలాపొళ్లకూ ఈ కొత్తబ్రాండువారి మసాలాలకూ ధరలో రెట్టింపుభేదం ఉంది. కల్తీఉత్పత్తికీ, మేలురకం ఉత్పత్తికీ ఆ తేడా సహజమే. అయితే అదేవిషయం ప్రజల మనసుల్లో గాఢంగా హత్తుకుని, తక్కువ ఉన్న కల్తీఉత్పత్తి కన్నా తమ మేలురకం ఉత్పత్తి ఎలా లాభదాయకమో ప్రజలకు స్పష్టంగా అర్థమయ్యేరీతిలో వారు ప్రచారంచేయలేదు. ''ఎంత కల్తీలేనిదైనా, ఇంత ధరా'' అని కొనటందగ్గరే వినియోగదారు వెనుకడుగువేయటంతో, వాటిని వాడి చూసి, ఎలా మంచిదో తెలుసుకునే అవకాశం వినియోగదారునికి కలగలేదు. అందువల్ల ఈ మసాల పొళ్ళు ప్రజల్ని ఆకర్షించలేకపోయాయి.

వ్యాపార రంగంలో ఒక కొత్తవస్తువుకైనా లేదా ఒక రంగంలో ఒక కొత్త సంస్థకైనా ప్రచారం ప్రాణంవంటిది. వస్తువునాణ్యత, ఉపయుక్తత అనేవాటికన్నా ముందు విషయం దానిగురించి ప్రజలకు తెలియచెప్పటం. పెట్టుబడిదారీ వ్యవస్థలో పోటీపడే పారిశ్రామిక

వేత్తలు, ఒకేతరహా వస్తువుల్లో కూడా, తమ వస్తువునే అమ్మగలగాలంటే అందుకు ప్రచారం తప్పనిసరి విషయమన్నమాట. అందుకే ప్రచారానికి, ఆకర్షణీయమైన ప్యాకింగ్‌లకూ కొన్ని కోట్ల రూపాయలు ఖర్చుపెడుతుంటారు. ఉత్పత్తి రంగం, ప్రభుత్వ ఆధీనంలో ఉండే కమ్యూనిస్టుదేశాలలో ప్రకటనలకు ఇంత హంగామా అవసరం ఉండదుకనుక, అక్కడ ఈ వ్యయం ఆదా చేసుకోగలగటం వల్ల, వస్తువుధర రూపంలో ఈ ప్రచార వ్యయం వినియోగదారునిపైన పడదు. తద్వారా చౌకలో వస్తువులు లభిస్తాయి. ప్రతి కంపెనీ తమ ఉత్పత్తుల ప్రచారానికి విశేషమైన కృషీ, వ్యయమూ జరిపినా అందులో కొన్ని మాత్రమే వినియోగదారుణ్ణి ఆకర్షించగలుగుతున్నాయి. ఆ ఆకర్షింపబడినవాటిలో నాణ్యత ఉంటే అవి నిలుస్తాయి. కానీ నాణ్యమైనవి కూడా సరిగ్గా ప్రచారం లేకపోతే, ప్రజలదాకా చేరలేవు కనుక, వ్యాపార ప్రచారం ఒక ప్రత్యేక విద్యగా రూపొందింది. ఎంత ఖర్చుతో చేసిన ప్రచారమైనా, అందులో మరిన్ని ప్రత్యేకతలున్నప్పుడు మాత్రమే ఆ ప్రచారం యొక్క లక్ష్యం నెరవేరుతుంది.

ఒక వస్తువును ప్రచారం చేయటానికి సిద్ధం చేసుకునే మొత్తం ప్రణాళికను 'అడ్వర్టైజింగ్ క్యాంపేన్' లేదా 'కేన్వాసింగ్ క్యాంపేన్' అంటారు. చాలా చిన్న సంస్థలు తమ ప్రచార రంగాన్ని తామే సిద్ధంచేసుకుంటాయి. వీటి పరిమితులు తక్కువగా ఉంటాయి కనుక వీటికి అంతగా ప్రచారవిధానం అవసరం ఉండదు. స్థానికంగా మాత్రమే పంపిణీ అయ్యే వస్తూత్పత్తి సంస్థలు ఇందులోకి వస్తాయి. ఇక పెద్ద వ్యాపార సంస్థలకు అడ్వర్టైజింగ్ డిపార్ట్‌మెంట్‌లు ప్రత్యేకంగా ఉంటాయి. ఈ రెండూకాక, ఇతరుల తరపున ప్రచారరంగం సిద్ధంచేసిపెట్టే "అడ్వర్టైజింగ్ ఏజన్సీలు" చాలా ముఖ్యమైనవని చెప్పుకోవచ్చు. కొన్ని వ్యాపార సంస్థలు పూర్తిగానూ, మరికొన్ని సంస్థలు తమ అడ్వర్టైజింగ్ డిపార్ట్‌మెంట్‌ల ద్వారా కొంతవరకూ ఈ అడ్వర్టైజింగ్ ఏజెన్సీల (యాడ్ ఏజన్సీలు)పైన ఆధారపడతాయి.





ఆసక్తిలేని వ్యక్తులుగా ఉండే వినియోగదారులు, ఆకళింపుకలిగిన కొనుగోలుదారులుగా తమంతటతామే మారరు. ఈ పరిణామం ఒక క్రమంలో, దశలవారీగా జరుగుతుంది. తెలియనితనం నుంచి ఒకవస్తువు ఉనికిపట్ల పరిశీలనతో, అప్రమత్తులుగా మారి, అవగాహన నుంచి ఇష్టతదాకా పాకినతరువాత, ఆ ప్రత్యేక వస్తువు పట్ల మొగ్గు చూపనారంభించి, దానిపట్ల తమ విశ్వాసాన్ని (యాక్సెప్టెన్స్) ప్రకటించడం వరకూ వినియోగదారుణ్ని నడిపించవలసిన బాధ్యత తీసుకుని, అతన్ని కొనుగోలుదారుగా మార్చి, అతనితో ఆ వస్తువును కొనిపించగలగటం-ఒక యాడ్ క్యాంపేన్ యొక్క ప్రాథమిక లక్ష్యం. వినియోగదారు సదా అదే ఉత్పత్తి (ప్రాడక్ట్)ని అంటిపెట్టుకుని ఉండేట్టు చేయటం యాడ్ క్యాంపేన్ యొక్క నిరంతర లక్ష్యం. కనుక ప్రచారరంగానికి ఉండవలసిన ముఖ్యమైన లక్షణాలు-

1. తన ప్రాడక్టు యొక్క ఉనికిని, దాని విశిష్టతనూ వినియోగదారునికి తెలియజెప్పటం;
2. ఆ ప్రాడక్టు పట్ల వినియోగదారునికి ఇష్టాన్ని కలిగించి, అతను దానిపట్ల మొగ్గు చూపేట్టు చేయడం;
3. ఆ ప్రాడక్టు వినియోగదారుని ఆలోచనల్ని వెంటాడేలా చేసి, అతని ఆలోచనల నుంచి ఆచరణవైపుకు దూకేలా, అంటే ఆ ప్రాడక్టు కొనేలా చేయడం; ఇవేకాక-
4. ప్రజల్లో పాకిపోయిన ఆ ప్రాడక్టు కాలక్రమంలో వచ్చే ఇతర ప్రాడక్టులకన్నా ఎలా మేలైనదో చెబుతూ, వినియోగదారులు సదా అదే ప్రాడక్టును అంటిపెట్టుకునేట్టు చేయడం.

—ఈ లక్షణాలతో, లక్ష్యాలతో కొనసాగే యాడ్ క్యాంపేన్ అనేక పద్ధతుల్ని అనుసరిస్తుంది.

ఒక కంపెనీకి సంబంధించిన యాడ్ డిపార్టుమెంటును నిర్వహించే అధికారిని యాడ్ మేనేజర్ అంటారు. ఈ యాడ్ మేనేజర్ తన కంపెనీ ప్రాడక్టుకు సంబంధించిన ప్రచార కార్యక్రమం తరహాను రూపొందిస్తాడు. ఆ ప్రాడక్టు ఎవరిని ఉద్దేశించినదో వారికే దాని ప్రచారకార్యక్రమం కూడా ఉద్దేశింపబడాలి. ఉదాహరణకు – సిగరెట్ల ప్రకటనలు మన దేశంలో మగవారిని; రెడీమేడ్ దుస్తులు యువ

K.N. Prints
nsational Silk Saree
Complan

తరాన్నీ; సూటింగ్‌లు మధ్యతరగతి దాటిన స్థాయిగల వారినీ; మేకప్ సామగ్రి యువతుల్నీ, మిఠాయిలూ, బొమ్మల వంటివి పిల్లల్నీ; సబ్బులు, గృహోపకరణ సామగ్రీ గృహిణుల్నీ– ఆకర్షించే విధంగా వున్నప్పుడే, ఆయా ప్రకటనలు ఆయా ప్రొడక్టుల అమ్మకాలపై ప్రభావం చూపగలుగుతాయి. దీన్ని దృష్టిలో పెట్టుకుని ప్రచారం ఏవిధంగా కొనసాగవలసిందీ యాడ్‌మేనేజర్ నిర్ధారిస్తాడు. ప్రచార ప్రకటనలకు సంబంధించిన అసలు కథంతా ఇక్కడే సిద్ధమవుతుంది.

ఈ విధంగా తమ ప్రచార వ్యూహాన్ని (అప్పీల్) సిద్ధం చేసుకున్న కంపెనీ, ఆ క్యాంపేన్ తానే స్వయంగా నిర్వహించటం కానీ, అందులో ఒక యాడ్ ఏజెన్సీ సహాయం తీసుకోవటం కానీ చేస్తుంది. ప్రచారానికి కేటాయించవలసిన మొత్తాన్ని నిర్ణయించుకున్న తరువాత, ఆ వ్యయాన్ని ప్రణాళిక ప్రకారం ఏయేపద్ధతులకు, ఏయేరంగాలకు ఎంతెంత వినియోగించాలో యాడ్ మేనేజర్ ఆలోచిస్తాడు. ఉత్పత్తిరంగంతోనూ, పబ్లిక్ రిలేషన్స్ డిపార్ట్‌మెంట్‌తోనూ సమన్వయం సాధించుకుని, రంగంలోకి దూకటం యాడ్ మేనేజర్ కర్తవ్యం. ఉత్పత్తి ప్రారంభించక ముందు ఎలా ప్రచారం చేయాలి, ఉత్పత్తి ఏయేదశల్లో, స్థాయిల్లో వున్నప్పుడు ప్రచారాన్ని ఎలా మార్చాలి అన్న అవగాహన యాడ్ మేనేజర్‌కు తప్పనిసరి. అలా లేకపోతే "ఫలానా ప్రొడక్టు కొనండి" అన్న ప్రకటనకు ఆకర్షితులై, అది కొనటానికి వెళ్ళిన వినియోగదారుకు ఆ ప్రొడక్టు వెంటనే లభించకపోతే కూడా ప్రొడక్టుపట్ల ఆసక్తి క్షీణిస్తుంది. ఆ తరువాత తమ ప్రచార విధానాల ప్రభావం కొనుగోలుపై ఎలా వున్నదో సేకరించి, సమీక్షించుకోవలసిన బాధ్యత కూడా యాడ్ మేనేజర్‌పై వుంటుంది.

ఇక యాడ్ ఏజన్సీలు, ప్రచారం చేసిపెట్టమని తమ వద్దకు వచ్చే కంపెనీలను 'అకౌంట్' అనిగానీ, 'క్లయంట్' అనిగానీ వ్యవహరిస్తారు. ఒక క్లయంట్ సిద్ధం చేసుకున్న అప్పీల్‌కు అనుగుణంగా ప్రచారాన్ని నిర్వ

హించవలసిన బాధ్యత వీరిపై వుంటుంది. సాధారణంగా, అందుకవసరమైన యంత్రాంగం– ప్రకటనల్ని స్వీకరించే పత్రికలు, రేడియోలు, టెలివిజన్ వంటి సంస్థలతో సంబంధాలు, ఫొటోగ్రాఫర్లు, మోడల్సూ, ఆర్టిస్టులూ, చిన్నపాటి ప్రింటింగ్ మిషనూ, స్టూడియోలూ వంటివన్నీ ఆయా ఏజన్సీ స్థాయినను సరించి వుంటాయి. సాధారణంగా యాడ్ ఏజన్సీలు రెండురకాల విధులను నిర్వహిస్తాయి. యాడ్ క్యాంపేన్ అంతటినీ నిర్వహించటం ఒకటైతే, ప్రకటనల వనరుల్ని కొనిపెట్టుకోవడం మరొకటి. రేడియోలో ప్రకటన సమయాన్నీ, వీధి కూడళ్ళలో బోర్డులు పెట్టుకునే స్థలాలనూ, పత్రికలలో ప్రకటన స్థలాలనూ ఈ ఏజన్సీలు తమ అదుపులో ఉంచుకుని, అది అవసరమైనవాళ్ళకు కేటాయించి, అందుకు అనుగుణమైన మొత్తంలో కమీషన్ తీసుకుంటాయి. ఇక యాడ్ క్యాంపేన్ నిర్వహించటమంటే దాని స్వరూప స్వభావాలను, తమ క్లయంట్ వెచ్చించగల మొత్తాన్నీ అవగాహన చేసుకుని, తమ విధానాలను క్లయంట్‌తో చర్చించి, తమకు అందులో లాభం మిగిలే రీతిలో ఒప్పందాలు చేసుకుంటాయి. ఈ ఒప్పందాలు కూడా అనేక విధాలుగా వుంటాయి. ఒక క్లయంట్ యొక్క యాడ్ క్యాంపేన్ నిర్వహించినందుకు నికరంగా ఒక మొత్తంలోగానీ, లేదా కొంత ఖర్చుకు కొంత కమీషన్ అనే పద్ధతిలో గానీ, లేదా ఒక ప్రత్యేకమైన పనికి ఒక ప్రత్యేకమైన 'రేటు' పద్ధతిలోగానీ, లేదా క్లయంట్ వెచ్చించగల మొత్తంలో తాము ఏయే విధాలుగా ప్రచారం చేయగలమో తెలిపి, ఆ మొత్తంలోనే తమ లాభాన్ని మిగుల్చుకునే పద్ధతిలోనూ ఈ ఒప్పందాలు వుంటాయి.

ఒక కంపెనీ తనకుతానే క్యాంపేన్ నిర్వహించుకున్నా, యాడ్ ఏజన్సీ ఒక క్లయంట్ తరఫున యాడ్ క్యాంపేన్ నిర్వహించినా– అది అనేక విధాలుగా వుంటుంది. ఇందులో పత్రికా ప్రకటనలు, పోస్టర్లు, బిల్‌బోర్డులూ, రేడియో ప్రకటనలు, టెలివిజన్ ప్రకటనలూ, సినిమాలకు అనుబంధంగా చూపించే యాడ్ మూవీస్, స్లైడులూ, స్టిక్కర్లూ, పాంప్లెట్లూ ముఖ్యమైనవి. ఇవికాక మరికొన్ని విధానాలున్నాయి. కొన్ని కంపెనీలు కొనుగోలు దారుల్ని ఆకర్షించడంకోసం తమ ప్రొడక్ట్‌తో పాటు మరో వస్తువును వుచితంగా ఇస్తారు. పత్రికలవారితో ఒప్పందం చేసుకుని, ఆ పత్రికలోని తమ ప్రకటనను పంపినవారికి చిన్నసైజు సేంపుల్ అందిస్తారు. క్రికెట్ పోటీలను తమ కంపెనీ పేర నిర్వహిస్తారు. కారు రేసులనూ, ర్యాలీలనూ నిర్వహిస్తారు. ఆహార ఉత్పత్తులూ, బట్టలు ఉత్పత్తి చేసేవారు రైలు ప్రమాదాలూ, వరద ప్రమాదాలలోని బాధితులకు తమ ఉత్పత్తులను అందజేస్తారు. రెండు దశాబ్దాల కిందట, ఒక సెంటు కంపెనీ తమ సెంటును అద్దిన కాగితంపై తమ ప్రకటన ముద్రించేది. పత్రిక మొదటి పేజీ తీయగానే సెంటు ఘుమ ఘుమ పాఠకుల్ని ఆకర్షిస్తుంది. ఇలాగే నినాదాల పోటీలు, క్విజ్‌లు, చివరకు కొనుగోలుపై లాటరీనీ నిర్వహించి బహుమతుల్ని అందించటం– ఇలా ఎన్నోరకాలుగా ప్రచారం కొనసాగిస్తుంటారు. ఒక ప్రఖ్యాత సినీనిర్మాత తన సినిమా ప్రచారం కోసం కోర్టు కేసులను వాడుకున్నాడు . బ్రాసియర్ కంపెనీలన్నీ 'ఫలానా సినిమాను నిలిపేయాలనీ, అందులో హీరోయిన్ బ్రాసియర్ ధరించనందున, హీరోయిన్ల ఫేషన్లు జనం అనుసరిస్తారు కనుక తమ కంపెనీలు మూతపడే ప్రమాదం వున్నందున, తమకు కనీసం నష్టపరిహారమైనా ఇప్పించాలనీ' కోర్టులో కేసు వేశారు. ఆ కేసు ఆ సినిమాలో హీరోయిన్, బ్రాసియర్ ధరించలేదనే విషయాన్ని పరోక్షంగా ప్రచారం చేసి, ప్రేక్షకుల్ని సినిమాకు మరింతగా ఆకర్షించింది. ఒకసారి జంటనగరాల్లో ప్రజలకు పొద్దున్న లేచేసరికి వీధుల నిండా "నేను కనుగొన్నాను" అని మాత్రమే రాసివున్న ప్రకటన పోస్టర్లు కనిపించాయి. ఆరోజంతా అందరూ ఇదే చర్చ. "ఎవరు కనుగొన్నారు... ఏం కనుగొన్నారు?" – అని. తెల్లవారి మరొక పోస్టర్ కనిపించింది– దానిపైన "నేను కనుగొన్నాను" అనే మాట చిన్నగా వుండి, ఏం కనుగొన్నదీ రాసి వుంది. ఈ ప్రకటన మత ప్రచారానికి సంబంధించినది కనుక అంతటితోనే ఆగిపోయింది. కానీ, అది వ్యాపారానికి సంబంధించినదైతే, ప్రజలందరికీ ఆ ప్రొడక్టు సుపరిచితమయ్యేది. ఇలా రోజురోజుకూ అనేక తరహాల్లో










కొనసాగే ప్రచారంలో ఆధిక్యత కోసం పారిశ్రామికులు నిరంతరం కృషి చేస్తుంటారు. ఈ కృషిలో పత్రికా ప్రకటనలను రూపొందించే విధానం ఎలా వుంటుందో చూద్దాం.

మనదేశంలో కొన్ని వందల సంఖ్యలో దినపత్రికలూ, అంతకన్నా రెట్టింపు ఇతర పత్రికలూ వున్నాయి. అభివృద్ధి చెందిన దేశాలతో పోల్చితే, మనదేశంలో పత్రికలు చదివే వారి సంఖ్య చాలా తక్కువే అయినప్పటికీ, దేశవ్యాప్తంగా జరిగే మొత్తం వ్యాపార ప్రచారంలో 88 శాతం దినపత్రికల ద్వారానే సాగుతూంది. సుమారు వందపైగా వున్న ముఖ్యమైన దినపత్రికలు రోజుకు కోటిన్నరపైగా అమ్ముడవుతున్నాయి. దాదాపు 1981వ సంవత్సరం నుండి ఇంగ్లీష్, హిందీ, మలయాళం, గుజరాతీ దినపత్రికల్లో ఈ ప్రకటనలు కొంత తగ్గుముఖం పడుతున్నాయి. మరాఠీ, బెంగాలీ దినపత్రికల్లో ప్రకటనల శాతం, 1985 నుండీ అదేవిధంగా వుండగా, తమిళ, పంజాబీ దినపత్రికల్లో పెరుగుతున్నది. ముఖ్యంగా 1981లో 30 శాతం ప్రకటనలు గల తమిళ దినపత్రికల్లో ప్రస్తుతం 38 శాతానికి పెరిగాయి. సగటున ఈ సంవత్సరం దినపత్రికల్లో 40 శాతం మాత్రమే ప్రకటన దారులు వినియోగించుకోగా, కేవలం డజను పత్రికలు తమ పేపర్లో 50 శాతం పైగా ప్రకటనదారులకు కేటాయించగలిగాయి. అయితే దినపత్రికల్లో వార్తలకూ, ప్రకటనలకూ వున్న నిష్పత్తిలో తగ్గుదల కనిపిస్తున్నదే కానీ, పత్రికా ప్రకటనలపై వెచ్చిస్తున్న మొత్తం చూస్తే ఇది పెరుగుతున్నది. గత రెండు సంవత్సరాలలో ప్రకటనలు ఆక్రమిస్తున్న స్థలం 15 శాతం తగ్గగా, ప్రకటనలపై వెచ్చిస్తున్న 15 శాతం పెరిగింది. కొన్ని పత్రికలు పేజీలను అధికం చేయటమూ, అడ్వర్టైజ్‌మెంట్ ఛార్జీలు (తారిఫ్) అధికం కావడమూ, దూరదర్శన్ ప్రభావమూ కలిసి మొత్తం మీద ఇలా జరిగిందని కొందరు అభిప్రాయపడుతున్నారు.

అయితే పత్రికాప్రకటనలపై వెచ్చిస్తున్న వ్యయం పెరగటమూ, ఇతర విధానాల ప్రచారం కేవలం 12 శాతంకు మాత్రమే పరిమి

తంగా వుండటమూ దృష్టిలో పెట్టుకుంటే, పత్రికాప్రకటనలకు వున్న ప్రాధాన్యత సుల భంగా అవగతమవుతుంది. ఈ పత్రికా ప్రకట నల్ని రూపొందించటంలో పబ్లిసిటీ డిజైన్ లేఅవుట్ అనీ, టిపోగ్రఫీ టెక్నిక్ అనీ రెండు విధాలుగా వుంటాయి. అది ఏవిధంగా వున్న ప్పటికీ, పత్రికలోని అనేక ప్రకటనల్లో తన ప్రకటన ప్రత్యేకంగా పాఠకుడి దృష్టిని ఆక ర్షించేలా తీర్చిదిద్దటమే ఈ ప్రకటనల రూపక ల్పనలో ప్రధానమైనది.

మీరు ఇంకా తెరచి చూడని ఏదో ఒక పత్రిక కాపీ చేతిలోకి తీసుకొని యధాలాపంగా అందు లోని పేజీలను తిరగేస్తూ, అన్నీ చూసిన తరువాత దాన్ని కింద పెట్టేయండి. దిన పత్రికకైతే అరనిమిషమూ, మన 64 పేజీల వార పత్రికకైతే రెండు నుండి రెండున్నర నిమిషాలూ కేటాయించి, మొత్తంమీద ప్రతి పేజీనీ తిరగేసిన తరువాత ఆ పత్రికను మడిచి పక్కన పెట్టి, ఓ పెన్నూ కాగితమూ తీసుకోండి. ఒక ఐదు నిమిషాల పాటు సావధా నంగా ఆలోచించి అందులో మీరు చూసిన ఫొటోలూ, కథల పేర్లూ, రచయితల పేర్లూ, బొమ్మలూ- ఇలా మీకు ఏమేం గుర్తున్నాయో రాయండి. ప్రధాని, ముఖ్యమంత్రి ఫొటోలూ, అమితాబ్‌బచ్చన్, సిల్కుస్మిత, గవాస్కర్, ఓ బోసి నవ్వుల పాప, నలుపు తెలుపు పత్రికలో ఐతే ఎక్కడో వున్న ఒకటి, రెండు రంగుల బొమ్మలూ, మీరు వాడుతున్న వస్తువులకు సంబంధించిన ఒకటి రెండు ప్రకటనలూ, మరేవో ఒకటి రెండు ప్రకటనలూ లేదా ఫొటో లూ, మల్లాది కథ, బాపు కార్టూన్, ముఖ చిత్రమూ- ఇంతకన్నా ఎక్కువగా గుర్తుండవు. ఇప్పుడు నిదానంగా పత్రికను తిరగేసి చూ డండి. ఆశ్చర్యంగా అందులో మొత్తంమీద 10 నుండి 15 శాతం కన్నా మీకు ఎక్కువగా గుర్తు లేవని గ్రహిస్తారు. ఇది మీ జ్ఞాపకశక్తి పరీక్ష కాదు- దీనికి కారణం మీ జ్ఞాపకశక్తి తక్కువున్నదనీ కాదు. ఆయా విషయాలకున్న ఆకర్షణశక్తి మాత్రమే దీనికి కారణం.

ఒక గృహిణికి పంచదార డబ్బాకు పడుతు న్న చీమలు పెద్ద సమస్య అయిపోయింది. ఒకరోజు ఆమె తీవ్రంగా ఆలోచించి, పంచ దార డబ్బామీది చీటీని కారంపొడి డబ్బాపైన అతికించి, 'కారంపొడి' అనే చీటీని పంచదార డబ్బాపైన అతికించింది. కానీ మరునాడు చూస్తే 'కారంపొడి' అని రాసివున్న పంచదార డబ్బాకే చీమలు పట్టాయి. ఇలా ఎందుకు జరిగింది? ఆ చీమల్ని ఆకర్షించిన విషయం పంచదారే కానీ, దాని చీటీకాదు అని ఆమె గ్రహించలేకపోయింది.

ఈ రెండు విషయాలూ ప్రతి పబ్లిసిటీ డిజైన్ రూపకల్పనలోనూ ముఖ్యంగా గు ర్తుంచుకోవలసినవి. అంటే ఒక ప్రకటన ఆక ర్షించేవిధంగా వుండటమే కాక ఆ ఆకర్షణ, ఆ ప్రకటన ఎవరిని ఉద్దేశించిందో వారిని (మా ర్కెట్‌ను) తప్పకుండా ఆకర్షించే విధంగా వుండాలి. ఓ సబ్బు ప్రకటనతో పాటు ఒక అర్ధ నగ్న సుందరి ఫొటో వుందనుకోండి. ఆ సబ్బు ను కొనాల్సిన సాధారణ గృహిణి అసలావైపు దృష్టిని పోనీయదు. తద్వారా ఆ ప్రకటన వృధా అయిపోతుంది. అందుచేత ఈ విష యాలను దృష్టిలో ఉంచుకుని వ్యాపార ప్రకట నల్ని తయారు చేస్తారు.

దేశమంతా ఉత్పత్తి చేసే వస్తువు ప్రకటనలో దేశ సంస్కృతిని గుర్తు పెట్టుకోవాలి. ఉదాహర ణకు క్రాక్ జాక్ బిస్కట్ల ప్రకటనలో ఆ బిస్కట్ తీపి, ఉప్పూ రుచుల్ని కలిగి వుంటుందని చెబుతూ, ఒక ప్రకటనలో ఒక సిక్కూ, ఒక ముసల్మానూ వుంటారు. మరో ప్రకటనలో ఒక సన్నటి అమ్మాయీ, ఒక లావుపాటి అమ్మాయీ వుంటారు. అంటే వినియోగదారుడు ఏ ప్రాంతంలోనివాడైనా అది అతన్ని ఆకర్షించగ లుగుతుంది. ఇలాగే మనరాష్ట్రంలో మాత్రమే ఉత్పత్తి చేసే ప్రకటనలో తెలుగుతనం కని పించాలి. అప్పుడది వినియోగదారుణ్ణి ఆక ర్షించుతుంది. ఈ విధంగా ప్రకటనల్లో ప్రొడక్టు స్వభావం, పంపిణీని అనుసరించి అనేకరకాలుంటాయి.

నేషనల్ యాడ్స్ (జాతీయ స్థాయి ప్రకటన లు) దేశమంతా పంపిణీ అయ్యే వస్తువులకూ, రైల్వేలు, అంతర్ రాష్ట్రయాత్రాప్రయాణాలు వంటివాటికి చెందినవి రిటెయిల్ యాడ్స్- విశేష కొనుగోలుదారుణ్ని అంటే ఒక ప్రాంతానికి చెందినవాళ్లనో లేదా ఒక రంగానికి




చెందినవాళ్లనో (గృహిణులు, స్కూలుపిల్లలు, రైతులు లాంటివాళ్లు) ఉద్దేశించినవి. ఇండస్ట్రియల్, ట్రేడ్ యాడ్స్. ఇవి పారిశ్రామికులకు సంబంధించిన యంత్ర సామగ్రి గురించీ, వ్యాపారానికి సంబంధించిన డీలర్‌షిప్పులకు సంబంధించి వుంటాయి. ఇక ప్రొఫెషనల్ యాడ్స్. ఆ ప్రొడక్టుకు సంబంధించిన ఒక నిపుణుడు, తన వృత్తిపర హోదాతో దాన్ని వాడమని సిఫారసు చేసినట్టు వుండేవి. ''టీచర్లు కేమెల్ కంపాస్ బాక్సును ఎందుకు సిఫార్సు చేస్తారంటే'' అనే ప్రకటనలో ఒక ఉపాధ్యాయిని ఆ ప్రొడక్టును సిఫార్సు చేస్తుంది. తద్వారా స్కూలు పిల్లలు కొనుక్కోవలసిన ఆ జామెట్రీ బాక్సు, వారికి బోధించే ఉపాధ్యాయుల మన్ననలను పొందింది- అనే అభిప్రాయంతో పిల్లలూ, తల్లిదండ్రులూ, ఆ ప్రొడక్టు వైపు ఆకర్షింపబడతారు. ఇక ఐడియా యాడ్స్ అంటే రాజకీయ ప్రచారానికీ, కుటుంబ నియంత్రణ వంటి ప్రజా క్షేమాన్ని ఉద్దేశించినవీ అన్నమాట. ప్రకటనల్లో మరొక ముఖ్య విభాగం 'క్లాసిఫైడ్ యాడ్స్'. వీటినే సంక్షిప్త ప్రకటనలు లేదా వర్గీకృత ప్రకటనలూ అంటారు. ఇవి సాధారణంగా ఒకటి రెండు మాటల్లో, బొమ్మ లేకుండా వుంటాయి. ఇన్ని రకాల పత్రికా ప్రకటనలూ, పోస్టర్లూ రూపొందించటంలో , అనేక మంది పోటీదార్ల మధ్య తమ ప్రత్యేకతను నిలుపుకోవటానికి ఎలా కృషిచేస్తారు, ఏ పద్ధతుల్లో చేస్తారు?

ముందుగా అప్పీల్ (ఆ ప్రొడక్టులోని విలక్షణత)ను నిర్ణయించుకుంటారు. ఆ తరువాత అందుకు అనుగుణంగా 'కాపీ రైటర్' కాపీని తయారు చేస్తాడు. ఒక ప్రకటనలో నినాదంతో (స్లోగన్)సహా, దానికి సంబంధించి వర్ణించే వివరాలను 'కాపీ' అంటారు. ఆ కాపీకి, తమ ప్రొడక్టుకూ అనుగుణంగా అందులో ఏయే చిత్రాలుండాలీ, ఏయేఫొటోలుండాలీ నిర్ణయించుకుని, ఒక లే-అవుట్‌ను తయారు చేస్తారు. సాధారణంగా చిత్రకళ అనుభవం వున్నవారు ఈ లే-అవుట్‌లను తయారు చేస్తారు. ఈ లే-అవుట్ రూపకల్పనలో సహకరించే మరొక విభాగం క్రియేటివ్ డిపార్టుమెంట్. ఒక

లే-అవుట్ సృజనాత్మకంగా వుండాలంటే అందులో ఆకర్షణ పాళ్లు పెంచాలంటే, దానిలో ఏ విషయం ఎంతమేర స్థలంలో వుండాలీ, ఎవరి ఫొటో వుండాలీ, వివరాలను కొత్త పద్ధతిలో ఎలా చెప్పాలి అనే విషయాన్ని వీళ్లు రూపొందించి, సూచనలిస్తారు. ఆ తరువాత చిత్రకారులు బొమ్మల్నీ యాడ్ ఫొటో గ్రాఫర్స్ మోడల్స్ సహాయంతో ఫొటోల్నీ సిద్ధంచేస్తారు. అందులో 'ప్రమోషన్' ప్రస్తావన వుంటే ఎలా వుండాలో కూడా నిర్ణయిస్తారు. ఒక ప్రాడక్టుతో పాటు మరో వస్తువు ఉచితంగా ఇవ్వటమో లేక మూడు వస్తువులు కొంటే ఒకటి ఉచితంగా ఇస్తామనో, నిర్ణీత కాలంలోగా కొంటే ధరలో రాయితీ ఇస్తామనో చేసే ప్రకటనను ప్రమోషన్ అంటారు. ఇక పబ్లిసిటీ డిజైన్ తయారవుతుంది. అనేక విధాలుగా చేసిన డిజైన్లలో నుండి ప్రెజంటేషన్ (ఆకర్షణ విధానం) ఎలా వున్నదీ అన్న దాని ప్రకారం, చివరగా ఒకటి గానీ, నిర్ణీత సంఖ్యలోగానీ కొన్ని డిజైన్లను ఎన్నిక చేసుకుని, వాటిని విడుదల చేస్తారు.

పబ్లిసిటీ డిజైన్ వినియోగదారుణ్ణి ఆకర్షించేలా వుండాలంటే, అందులో అర్ధనగ్న సుందరాంగుల్నీ, అందమైన అమ్మాయిల్నీ సినీతారలను, ప్రఖ్యాతులైన పబ్లిక్ ఫిగర్స్‌నూ మోడల్స్‌గా వాడుకోవటం ఒక పద్ధతి. సృజనాత్మకమైన పద్ధతుల్లో అనేక ఇతర విధానాలుంటాయి. ఇందులో వోక్స్‌వేగన్‌వారి కార్ల ప్రకటనలు చాలా ప్రఖ్యాతిగాంచినవి. చిన్న కార్లను, విలక్షణమైన రూపంలో చేసినప్పుడు, ఆ ప్రత్యేకత చెప్పటానికి ఒక ప్రకటనలో తలకిందులుగా వున్న కారు వుంటుంది. కారు వైపు మన దృష్టి హఠాత్తుగా వెళుతుంది. అంతేగాక, తలకిందులుగా వుండటంతో, దాన్ని నిశితంగా పరిశీలించే సావకాశం కలుగుతుంది. అప్పుడు దాన్ని గురించి చదవాలన్న ఆసక్తి ఏర్పడుతుంది. వీరిదే మరో ప్రకటనలో, పేపర్లో కేవలం ఐదుశాతం వంతు ఆక్రమించిన కారు చిన్న బొమ్మ వుంటుంది. "చిన్నగా ఆలోచించండి" అని దానికింద పెద్దఅక్షరాలతో రాసి వుంటుంది. ఒక పెద్ద పేజీలో, ఒక మూలన చిన్నగా వున్న వైపు పాఠకుడి దృష్టి సహజంగా మళ్లుతుంది. ఆ తరువాత ఇక ఆ ప్రకటన చదువుతాడు. అంటే, ప్రకటన ద్వారా సాధించగలిగింది సాధించారన్నమాట.

ఇట్లాగే ఓ నగల కంపెనీవారి ప్రకటన పూర్తి పేజీలో, రంగుల్లో నగలు అలంకరించుకున్న ఇద్దరు అమ్మాయిలు వుంటారు. పైన చిన్న అక్షరాల్లో ఆ కంపెనీ గుర్తు, "ఇంకా మేం ఎక్కువ చెప్పాలా?" అనీ వుంటుంది. "ఎవరబ్బా ఈ కంపెనీ" అని ఆసక్తిగా పాఠకుడు వెతికితే, కుడివైపు మార్జిన్లో 'త్రిభువన్‌దాస్ భీమ్జీ జవేరీ, ఢిల్లీ' అని నిలువుగా వుంటుంది. ఆ కంపెనీ పేరు ఇంతకుముందు విననివారికి కూడా "ఓహో... ఇది ప్రఖ్యాతి వహించిన నగల తయారీ అన్నమాట" అనే భావన మనసులో హత్తుకుంటుంది. గార్డెన్ వరేలీవారి ప్రకటన కూడా ఇలాగే, పూర్తి పేజీ ఫొటోకు కుడివైపు మూలన చిన్నగా పేరు రాసివుంటుంది. మామూలు ప్రకటనల్ని చదవటానికి ఇష్టపడని పాఠకుడు, ఈ ప్రకటనల్ని చూడగానే, అది ప్రకటన అని గ్రహించకపోవటం వల్లనో లేక దాని ఆకర్షణ వల్లనో అక్కడ ఆగి చూస్తాడు. ఆ కంపెనీ పేరు మనసులోకి ఇంకిపోతుంది- అది చాలు కదా.

ఇక ప్రకటనలోని తరువాతి విషయం కాపీ. కాపీలో ప్రముఖమైనది నినాదం. ఆగి చూసే వినియోగదారుని మనస్సును ఆ క్షణంలో ఆ ప్రాడక్టు పట్ల సుముఖుణ్ణి చేసేట్టుగా వుండాలి ఈ నినాదం. ఇందుకు చక్కటి ఉదాహరణలుగా సర్ఫ్, ఫిలిప్స్ బల్బులు, ఈసీ టీవీ, కుష్టు వ్యాధి నివారణకు సంబంధించిన ప్రకటనలు చెప్పుకోవచ్చు. "సగం బల్బు కొనడం దేనికి" అన్నవ్యాఖ్యతో, సగం బల్బు బొమ్మ వున్న ఫిలిప్స్ బల్బుల ప్రకటన ఇట్టే ఆకర్షిస్తుంది. "ఈ సగం బల్బు గొడవేమిటి?" అనే ఉత్సుకతను రేకెత్తించి, చదివింపచేస్తుంది ఆ ప్రకటన. అలాగే, 24 రూపాయల పైగా ఛార్జీ చూపించే ఒక టాక్సీ మీటరూ, దాని పక్కన ఒక టెలిఫోనూ వుండి, "ఈ రెంటిలో మీరే దూరాన్ని ఎంచుకుంటారు? కొన్న తరువాత సర్వీసుల కోసం" అని వుండే ఈసీ టీవీ ప్రకటన, కొనుగోలు తరువాత తన సేవల్లోని విశిష్టత గురించి స్పష్టంగా చెబుతూ, అర్ధరూపాయి ఫోన్‌కాల్ సరిపోతుందని వివరిస్తూ తన లక్ష్యాన్ని సరిగ్గా సాధించిందని చెప్పాలి




సాధారణంగా నిస్సారంగా, అనాకర్షణీయంగా వుండే ఐడియా ప్రకటనల్లో అతి చక్కటి ప్రకటన కుష్టు వ్యాధి నివారణకు సంబంధించింది. ముగ్గురు నలుగురు పిల్లలు ఉల్లాసంగా పరుగెడుతున్న ఫొటోతోపాటు, ''ఇందులో కుష్టునుండి కోలుకున్నవారెవరో చెప్పగలరా?'' అన్న వ్యాఖ్య చూడగానే, ఆసక్తిగా చూస్తాం. ఆ తరువాత యధాలాపంగా వివరాలు చదివే పాఠకుడికి- 'కుష్టు' అంటువ్యాధి కాదనే విషయం మనసులోకి ఇంకిపోతుంది. ఆ ప్రకటన సాధించవలసిన లక్ష్యం అదేకదా! ఐడియా యాడ్స్‌లో చెప్పుకోదగినవి కాంగ్రెస్‌వారు ఇటీవల ఎన్నికల్లో ప్రకటించిన ఎన్నికల ప్రకటనలు. ఈ ప్రకటనల్లోని ముఖ్యమైన అంశం - అవి పేజీలో ముప్పాతిక వంతు మాత్రమే వుండటం. పూర్తి పేజీ ప్రకటన కనబడగానే పేజీ తిప్పబోయే పాఠకుడు, ఆ మిగతా స్థలంలో వుండే వార్తల కోసం ఆగుతాడు. ఆ వార్తలు చదివిన తరువాత తప్పకుండా ఆ ప్రకటనవైపు దృష్టి మళ్లుతుంది. దృష్టినాకర్షించటమేకదా ప్రకటన ప్రాథమిక లక్షణం.

ఇక లే-అవుట్‌లో చూపించే సృజనాత్మకత కూడా ప్రధానమైనది. ఇందుకు 'సితార' వంటి. పత్రికల్లో కనిపించే 'డిగ్‌జామ్' సూటింగ్ ప్రకటన చెప్పుకోవచ్చు. పేజీలోని బొమ్మ మొత్తం లేత నీలి రంగులో వుండి, డిగ్‌జామ్ సూట్ ధరించిన పెద్దమనిషి బొమ్మ మాత్రం రంగుల్లో వుంటుంది. తద్వారా ఆ ప్రకటన పాఠకుడు దృష్టిని ఆకర్షించటమేకాక, ప్రత్యేకంగా డిగ్‌జామ్ సూటింగ్‌ను పరిశీలించే సావకాశం కలిగిస్తుంది. ఇట్లాగే ఏ బొమ్మను ఎక్కడ వేయాలి, మాటల్లోని ఏ అక్షరాలు ఎలా రాయాలి అనే అనేక అంశాలతో కొన్ని ప్రకటనలు బాగా ఆకర్షించుతాయి. దీన్ని నిర్ధారించి రూపొందించటానికి వినియోగదారుని మనస్తత్వం తెలిసిన నిపుణులూ, లే-అవుట్ నిపుణులూ, రంగుల గురించి తెలిసిన వాళ్లూ, ఏరకం పత్రికలో ఎలాంటి ప్రకటన ఇవ్వాలో నిర్ధారించే వాళ్లూ- ఇలా అనేకమంది నిష్ణాతులుంటారు.

పబ్లిసిటీ డిజైన్స్‌లో మరొక విధానం సీరియల్ ప్రెజెంటేషన్, యానిమేషన్, టిపోగ్రఫీ

and pressure cooks
in a fourth vessel,
three words of advice...
Prestige
Pressure Pan
Discover how much
it can do and
how fast.
GRS
For 100%
safety
And of course
it pressure cooks
Prestige
PAN

లాంటివి. ఇవి సాధారణంగా నలుపు తెలుపుల్లో మాత్రమే వుంటాయి. చాలావరకూ క్లాసిఫైడ్ యాడ్స్‌కి పరిమితమైనవి. ఒక ప్రకటనకు సంబంధించిన ఒక విషయాన్ని మాత్రమే ప్రకటించి, ''మళ్లీ ఇదేచోట చూడండి'' అని రాసి, క్రమంగా ఆ ప్రకటనను మూడు నాలుగు అంచెలుగా ప్రచురించటం 'సీరియల్స్ ప్రెజెంటేషన్'. మొదట చెప్పిన ''నేను కనుగొన్నాను'' లాంటివి ఇవి. 'కలువబాల' అనే పత్రిక ప్రకటన కూడా ఇదే రూపంలో వెలువడింది. యానిమేషన్ అంటే కార్టూన్లన్న మాట. అనేక ప్రకటనల మధ్య కార్టూన్‌కు ఒక ప్రత్యేకత వుంటుంది. అంతే కాక కార్టూన్ పట్ల సహజంగా ఆకర్షింపబడే పాఠకులంతా, ఈ ప్రకటనల యొక్క ప్రాడక్టు గురించి తెలుసుకునే అవకాశం వుంటుంది. ఇందుకు ఉదాహరణ- నాగార్జున సిమెంట్ వారి ప్రకటనలు. ప్రతిసారీ పత్రికలో నాగార్జున సిమెంట్ కార్టూన్ల కోసం చూసే పాఠకులు, తమకు సిమెంట్ కొనే అవసరం వచ్చినప్పుడు, అసంకల్పితంగా నాగార్జున సిమెంట్‌ను గుర్తుతెచ్చుకుంటారు. ఆమేరకు ఆ ప్రకటన లక్ష్యం నెరవేరినట్టే.

ఒక నిర్ణీత స్థలంలో, అక్షరాల కూర్పును 'టిపోగ్రఫీ' అంటారు. ఒక పుస్తకం ముఖచిత్రంపైన ఆ పుస్తకం పేరూ, రచయిత పేరూ, దానిగురించి ఒకటి రెండు మాటలూ వుంటాయి. ఈ అన్నిటినీ, దేన్ని ఏ సైజులో, ఎక్కడ అమర్చితే అందంగా వుంటుందో ఆలోచించి, రూపొందించే విధానం టిపోగ్రఫీ. సంగ్రహ ప్రకటనల్లో టిపోగ్రఫీ మెళకువల్ని చూపించి, డజన్ల ప్రకటనల మధ్య ఆకర్షణీయంగా చేసుకోవచ్చు. ప్రత్యేకతరహా అక్షరాలను వాడటం ద్వారా, ఎక్కువ స్థలంలో, పైనొకటీ కిందొకటీ రెండు మూడు వాక్యాలను అమర్చటం ద్వారా లేదా నినాదాన్ని మామూలుగా రాసి, విషయాన్ని తలకిందులు ము




ద్రించటం ద్వారా లేదా చేతిరాతలో వున్న అక్షరాల్ని ప్రచురించటం ద్వారా ఈ ఆకర్షణను సాధించవచ్చు.

ఇందులోని అన్ని విషయాల్లోనూ నిష్ణాతులే వున్నా, కొన్ని ఏజన్సీలు, కంపెనీలు మాత్రమే ఆకర్షణీయమైన ప్రకటనల్ని తయారుచేయగలుగుతాయి. అందుకు ఒక్క కారణం చెప్పుకుంటే సరిపోతుందేమో! రాయటం తెలిసిన వాళ్లంతా కవిత్వం చెప్పలేరు కదా! అలాగే విషయం తెలియటం వేరు, దాన్ని ఆచరణలో ఉపయోగించుకోగల సామర్థ్యమూ, సమయస్ఫూర్తి, సృజనాత్మకత వుండటం వేరు. ఇవన్నీ వున్నవాళ్లు మాత్రమే ఈ రంగంలో నిలదొక్కుకుని, ఇతరులకంటే ముందుండగలుగుతారు. అందువల్లనే ఎంతో యంత్రాంగం వున్న అనేక పెద్ద కంపెనీలు సైతం యాడ్ క్యాంపేన్‌లలో యాడ్ ఏజన్సీలను ఆశ్రయిస్తుంటాయి.

అడ్వర్టైజింగ్ రంగంలోని అనేకమందిని సమన్వయపరచటానికి క్లబ్బులూ, యాడ్ ట్రెయినింగ్ స్కూల్సూ, సంఘాలూ అనేకం వుంటాయి. అయితే మన దేశంలో ఇటువంటివి స్వల్పంగా మాత్రమే వున్నాయి. ప్రఖ్యాత యాడ్ ఏజన్సీలలో పనిచేయటంద్వారా, అడ్వర్టైజింగ్ ఎక్స్‌పర్ట్స్ దగ్గర శిక్షణ పొందటం ద్వారా నైపుణ్యం సంపాదించుకునే పద్ధతే మన దేశంలో ఎక్కువగా కొనసాగుతున్నది. సృజనాత్మకమైన ప్రకటనలకు అవార్డులూ, సృజనాత్మక రూప కర్తలకు బహుమతుల రూపంలో అడ్వర్టైజింగ్ రంగాన్ని ప్రోత్సహించే ప్రయత్నాలను కొన్ని సంస్థలూ, పరిశ్రమలూ చేపడుతున్నాయి. ఇంత యంత్రాంగంతోనూ వినియోగదారుణ్ణి ఆకర్షించి, మోసపుచ్చే ప్రకటనల్ని రూపొందిస్తున్న వారిని అదుపుచేసే విధానాలు మాత్రం ఇంకా మనదేశంలో రూపొందకపోవటం శోచనీయమని చెప్పుకోవాలి.

—వినయ్

# చదవండి ఏప్రిల్ చతుర...



అంగరంగవైభోగంగా కాకిని పెళ్ళిచేసుకుని కాపురం పెట్టిందొక వరాహరాజం!

జామచెట్ల శీలాన్ని దోచుకోవటమే తన హాబీ అని వికటాట్టహాసం చేసిందొక ములగచెట్టు!!

సైకిలుని గర్భవతినిచేసి తీరా కారుని దర్జాగా వివాహ మాడిందో స్కూటరు!!!

గాయపడిన బంగాళాదుంపకి వైద్యంచేయించి తన రక్తాన్నిసైతం ధారపోసిందో వంకాయ!!!!

వద్దన్నా తమ మొరవినక రోజూ కుక్కర్లో తమని ఉడకేస్తున్న ఇల్లాలిపై ప్రతీకారం తీర్చుకున్నవి ఆ బియ్యం!!!!

ఏమిటిదంతా? ఇదేమన్నా మాయాలోకమా? లేక పిచ్చాస్పత్రా?

**కడుపుబ్బనవ్విస్తూ ఆద్యంతం ఆసక్తికరంగా చదివించే సారె రామమోహనరావు హాస్యనవల 'సంహారం' ఏప్రిల్ 'చతుర'లో చదవండి.**

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

విశిష్ఠ సుగంధం
మైమరపించే తాజాదనం

క్రొత్త
ప్రేమ్
మీకోసమే




ఇప్పుడు అనువైన ఆకారంలో క్రొత్త పరిమళంతో వస్తోంది.

Imageads 2418 Tel

CHATURA Telugu Monthly, Hyderabad-500 004. Regd. No. H/HD/402